


సంపు. ౧౩ యువసంవత్సరము, ఫాల్గునమాసము (మార్చి ౧౯౩౬) సంఖ్య ౩

# దేవ!

బొడ్డు బాపిరాజు

ఈ యవిటి తంబురాతీగ లెంత సేపు
మీటినను కమ్మనైనట్టి పాట యొకటి
పలుకబోదోయి, దేవ! సంధులును కదలు
బారి చెడిపోయె నేరీతి బాగుపడునో?

* * *

ఈ శిథిలగేహమును వెలిగించుపనికి
ఒక్క చిన్నిదీపికయేని దిక్కు లేదు!
క్రమ్ముకొనియున్న యీయంధకార మెట్లు
విరియునో దేవ! ముక్తికి తెరవు లేదె?

* * *

ఎండబడి కగ్గి, కళతగ్గి, వృంత మొడసి
అవని బడనున్న యీవిరి నాదుకొనగ
హృదయమే లేదె? యీచిన్ని బ్రదుకునందు
యిక వలపు చిగురింపదాయేమి దేవ!

* * *

గొంతు తడియారిపోయి గగ్గోలు జెంది
పరచు, ఈపేదజీవిపిపాస కొక్క
బిందువే కరవయ్యె! మరెందు కింక
తికమకలు దేవ మరుమరీచికల జూపి?

* * *

ప్రాతగిలిన జీర్ణాంబరమ్ము : దీని
కెన్నిసారులు రంగు లద్దించుకొన్న
ఒకచిరుగుగాని మాటుకాదోయి దేవ!
'ఎందు' కనుచు నీవె పరిత్యజింపవలదు.

*　　*　　*

చిన్ని నవ్వైన రాణింపకున్న యీయ
గాధ కాళరాత్రికఠోర గర్భకుహర
మున చెడ తిరిగి, యెచ్చు జీవనము కాక,
యీ దివాంధమునకు గతిలేదె దేవ?

*　　*　　*

కూలిపోనున్న యీ గుడిగోపురమున
గాపురము సేయగా గూడు కట్టుకొన్న
దేమనగ వచ్చునయ్యొ! యీ రామచిలుక,
చెప్పి తప్పింపగల దయాచిత్తు లెవరు?

*　　*　　*

ఎంతయో శ్రమ నొంది నిర్మించుకొన్న
గూడు, పాపపునరుడు ఈ మేడ యొకటి,
'ఆకసమ్మంటు'నని పొంగునంతె, తెలియ
జాల డింత సమూలనాశనము దేవ!

*　　*　　*

కమ్మగా పాడు మురళి గైకొమ్మటంచు
నొసగితివి నీవు; ఎట్లది యూదుకొనుటో
తెలియనేరక చెరచి కశ్మలము చేసె
నితడు, సరిచేయు మరల క్షమించి దేవ!

*　　*　　*

అమృతభాండమ్ములో బడబానలమ్ము
నింపుకొని త్రావి త్రావి, భరింపలేక
కుమిలి లోలోన దహియించుకొని తపించు
నీవికలజన్ము నోదార్చు రెవరు దేవ!

*　　*　　*

ఈ యణువునెడ నీ కెంతయెంత మమత
గలుగునోయి, దేవా! తారకాసహస్ర
నేత్రములు విచ్చి, కనుగొందు నిత్య; మింత
హైన నిను జూడ డీజనుపాంథజీవి!

*　　*　　*

---

# శ్రీ అరవింద జీవితము

వీరిజీవిత మింతవఱకు నేభాషయందు నింతవివరముగా ప్రకటింపబడలేదు.

ఇందు వీరిజీవితవిశేషములు, వీరియోగము, ఆశ్రమవిషయములే గాక
వీరి జాతకము, ధర్మపత్నికి ౧౯౦౫లో వీరువ్రాసిన అద్భుతలేఖలు
'స్వాతంత్ర్య నిర్వచనము', 'జాతీయత', 'ప్రాచ్యులు - పాశ్చాత్యులు'
అను శీర్షికల క్రింద వీరా కాలమున రచించిన వ్యాసముల
కనువాదములు, వీరి ఉత్తరపరోపన్యాసము,
౧౯౦౯ లో వీరుప్రకటించిన నాదేశీయుల కొకబహిరంగలేఖా సంగ్రహము
మున్నగువిషయము లెన్నియో గలవు.

శ్రీ అరవిందుల, ఆశ్రమకట్టడముల ఫోటోలు గలవు.

ఫెదరువైటుపేపరు — పెద్దయక్షరములు — చక్కనికూర్పు — వెల ౧-౦-౦.

# శ్రీ అరవింద దర్శనము

శ్రీ అరవిందుల అపూర్వ తత్త్వసారమంతయు నిం దున్నది.
లైఫ్‌డివైన్ - (Life Devine) అను తమగ్రంథమున శ్రీఅరవిందులే
సంగ్రహముగా రచించినభాగము ననుసరించి
బ్రహ్మశ్రీ వేలూరు చంద్రశేఖరంగారు వ్రాసినారు

శ్రీ

అరవిందులు స్థాపింపనెంచు దివ్యజీవనము, భాగవతజీవనము, స్వర్గరాజ్యము ఏదో
ఆదివ్యపరిణామ మెట్లురాగలదో ఈగ్రంథమును పఠించినవారికి తెలియగలదు.

తత్త్వజిజ్ఞాసగలవారందఱు చదువవలసిన గ్రంథము.

ఫెదరువైటుపేపరు — పెద్దయక్షరములు — చక్కనికూర్పు — వెల ౦-౧౨-౦.

వలయువారు:—

ఆంధ్ర గ్రంథశాల, తంబుసెట్టివీధి, మదరాసు.

# "వెక్కిరింపఁబోయి బోర్లాపడుటయే"

## 3

చెళ్లపిళ్ల వేంకటశాస్త్రి

ఇదివఱలో రెండువ్యాసములు దీనింగూర్చి కొంత సంగ్రహముగా వ్రాసియుంటిని. ఇంకొక శంకనుగూర్చి యిపుడు వ్రాయుచున్నాను. ఆయనవాక్యమ్ములనే వ్రాసినచో గ్రంథము పెరుఁగును. కావున నా వాక్య తాత్పర్య మిట నుదాహరించి పిమ్మట నేను వ్రాయఁదలఁచినది వ్రాయుదును. ఆయనశంక యిది. "ఒక్క శుచిముఖిపాత్రలో తి. వేం. కవులలో నెవరో యొక్కరే ప్రతిఫలింప వీలగును గాని యిరువురును నెట్లు ప్రతిఫలింప వీ లగును" అని. శంకించువారి ముఖ్య తాత్పర్య మిది మాత్రమే యైనను దీనిని బలపఱుపఁదగిన వాక్యములు చాల నున్నవి. ప్రభావతీప్రద్యుమ్నము తి. శా. గా రొకరే రచింప మొదలిడినారు గాన ప్రథమాంకము నందలి ప్రతిఫలనము యుక్తమే కాని, ద్వితీయాంకమునందలి వేం. శా. గారి ప్రతిఫలనముమాత్రము యుక్తము కాదని తేల్చిన ట్లగుపడెడిని. వ్యంగ్యముగాఁ గన్పట్టు విషయముగదా ఇది? అట్టి సందర్భమున నిట్టి స్తనశల్యపరీక్షతో నావశ్యకత యే యుండదు. మాటవరుసకు, పోతన్నగారికి నేపాత్రమునందు భాగవతమున ప్రతిఫలనము కలదో విచారించిన, విశేషించి వామనుని యందని తేలును. అది సంస్కృతమున కను వాద మని త్రోసివేయరాదు. ఆ ఘట్టమున పోతన్నగారి స్వకపోలకల్పితము చాల నున్నది. అగునో నాయీ లక్షణము లన్నియుఁ బట్టింపవలె నన్నఁ బట్టునా? "ఒంటివాఁడఁ జుట్ట మొకఁడు లేఁడు" అని వామనుఁ డనియె. పెండ్లమును, బిడ్డలును గల పోతన్నగారిమొగల నిది సమన్వయించునా? కావున వలనైనంతవఱకును సమన్వయమును గమనింపవలెను. ఇపు డొకపాత్రమున ప్రతిఫలించుట యొకచోయుద్ధమున నేక కాలమునఁగాని, లేక పర్యాయముగాఁ గాని పలువురు ప్రతిబింబించుటనంటిది యనుకొన్నచో సుళువుగాఁ దేలుచున్నను విమర్శకులు మిక్కిలి పెంచి కోలాహల మొనర్చిరి. ఇయ్యెడ విమర్శకుఁడుగా నొనర్చికొన్న శంకాసమాధానములు, "తుమ్మికొని దీర్ఘాయుష్య" మనుకొనుతరగతిలోనివి. విమర్శకుఁడు వసుదేవునిమాగమున నవధాన మొనర్చిన దొక్కశుచిముఖియో యనుకొని కొంత చెత్త పెంచెను. తోవాసముగా వేఱొకహంస మున్నది. నన్ను-నాకు-నేను అను నేకవచనములు బాధింపవు. అపుడు మాటలాడుచున్న దెవరు? పరికింపుఁడు. ఒక్కశుచిముఖిపాత్రముమాత్రమే కావున, తత్తదేకవచన ప్రయోగములు లేశమును బాధింపవు.

రాజ—"నేను గొంత పరివారముతో,
క. విద్వాంసు లనేకులుగల
తద్ద్వారక కేగి శతవధానముచే......"

పై గ్రంథమువలన శుచిముఖి యొంటరిగా వెళ్లలే దనుట స్పష్టము. ఆపరివారములో శుచిముఖితో నాఁ డవధాన మొనర్చునపుడు తోడుగా నున్నహంస మంశగ్గతము. కావు ననే, ద్వితీయాంకమున శ్రీ కృష్ణుఁడు, "మీ రిరువురును కన్నులకుఁ గట్టిన ట్లగ పట్టిన ట్లయ్యెడిని" అనియు, పరిచారకుఁడు, "మీ రిరువురు గాదూ?" అనియు నడు గుట సంభవించిన దని బాలురకుఁ గూడ సుగమమే. అయినను విమర్శకబుధుఁడుగారి కీయంశము గోచరించినట్లు లేదు. ఈవిమర్శ కుఁడు తుట్టతుద కేదో చేదస్తపు వ్రాఁత వ్రాసివ్రాసి తిరుపతిశాస్త్రిగారి ప్రతిఫలనము నంగీకరించిన ట్లీయక్కరములు తెల్పెడిని. "తిరుపతిశాస్త్రిగారు ప్రతిఫలించుట గమనిం పక కాఁబోలు వేంకటశాస్త్రిగారు...నాటక మును వ్రాయుటకు ప్రారంభించిన తిరుపతి శాస్త్రిగారు స్వవిషయమును తెలియఁ బఱచుటలో లోప మేదియును గానరాదు." పై యక్కరములు తి. శా.గారి ప్రతిఫలన మంగీకరించిన ట్లగుపట్టెడిని. కాని యీ విమర్శకునకు ప్రథమాంకప్రారంభము నందలి తి. శా.గారి యీవాక్య మేల విరో ధింపదో చదువరులు పరికింతురుగాక.

"శతావధానులు తిరుపతి వేంకటేశ్వ రులు రచించిన ప్రభావతీ ప్రద్యుమ్న నాటకమే నేఁడు ప్రదర్శింపఁబోవునది" ఉభయకర్తృ కత్వ మున్నపుడు ప్రతిఫలన ముభయులకును వివక్షితమై తీరవలసినదే కదా! అట్లయ్యెనేని విమర్శకుఁ డొక్కరికేఁ బ్రతిఫలన మెట్లు సమంజస మనుకొనెనో? మఱియు, "నాక విత్వంబునకు మెచ్చి సరస్వతియే బాల సరస్వతియను బిరుదొసంగి యీ గండ పెండేరంబు కాలికిం దొడిగె." బాలసరస్వతీ బిరుదము నటుంచి ఈ 'గండపెండేరము' అనుదానిని సమన్వయ మెట్లు చేసికొనెనో? ఇది బందరునుండి యుపాధ్యాయత్వము విరమించికొని వచ్చునపుడుగదా యిచ్చినది. అగువో నా యుపాధ్యాయులు తి. శా. గారే యనుకొనెఁ గాఁబోలు! పోలు!! పోలు!!! కాకినాడలో నున్నది యెవరో, బందరులో నున్నది యెవరో తెలిసికొనుపాటి వివే చనము తెలియనితాను ఆయనప్రతిఫలనము యుక్తము, ఈయన ప్రతిఫలన మయుక్తము అని చేటభారతము వ్రాసెనే! ఔరా! సాహ సము! పోసీ తుణ కాలము తి. శా. గారు, కాదు వేం. శా. గారొక్కరే ప్రతిఫలించి నట్లు వ్రాయవలె ననుకొని విమర్శకుఁడు గారు—"టెంకాయ పిచ్చికొండ" చేసి రను కొని పరిశీలింతమా? అప్పు డీ యక్కరములు కుదురవు. "మఱియు రాజరాజేశ్వరీ షోడ శీ, మహావిద్య నభ్యసించితి" వేం. శా. గారి ప్రతిఫలనమున కీ "రాజ రాజేశ్వరి" వ్యతి రేకించును. ఇది ప్రత్యేకించి తి. శా. గారికే సంబంధించినది. ఈయంశము కొలఁదిమాస

ములనాఁ డొక వ్యాసమున వ్రాసియున్నాను, చూడుఁడు. తి. శా. గారు అవసానకాలమునకు నాలుగేండ్లకు ముందు మంత్రశాస్త్రమున మిక్కిలిగాఁ బరిశ్రమచేసిరి.”
(భాద్రపదాశ్వయుజపు ప్రౌఢభారతి చూ.)

తేలినసార మేమన? శుచిముఖిపాత్రలో విమర్శకునిత్రోవ ననుసరించి మాయిరువురలో నెవరి ప్రతిఫలనముగూడ లగింపదు. అగుచో తి. శా. గారిదిమాత్రము సమంజసమని విమర్శకుఁడుగారు వ్రాయుట కర్థము లేదని తేలినది. ఈ ప్రభావతీప్రద్యుమ్న నాటకము నిటు లుంతము గాక. “భూదేవతాగారగోదావరీతీరకంకణగ్రామంబు కాపురంబు” కంకణగ్రామ మనఁగా? కడియ మని యేకదా! ఆగ్రామ మిరువురకును నివాస గ్రామ మని చదువరులు విశ్వసింతురా? ఇది విమర్శకుఁడుగారి కెట్లు సమన్వయించినదో? కాదు, వేం. శా గారికి మాత్రమే అని సమన్వయించుకొనిరందురా? అగుచో, ఆసీసగీతిలోని “తగు నుపాస్యంబు కాళీపదంబు మాకు” అనునది బాధించునే? విమర్శకునిత్రోవనుబట్టి మా కవనమునఁ గుదురని వెన్ని యోకలవు. వాని నన్నిటిని జూపుచో గ్రంథము బల్లను దోలవలయును కావున నిఁక నొకటిమాత్రము చూపి విమర్శింతును. ”చ. తిరుపతి వేంకటేశులని ధీరులు పిల్తురు మమ్ము.....!... ఈకవిత్వ మనఁగా? నది పిన్నటినాఁడె పుట్టె నబ్బురముగఁ బెంచి కొంటిమి” ఇయ్యది విజయనగరపుమహారాజావారి పద్యములలోనిది. సిన్ననాటినుండి కవిత్వము చెప్పినదెవరు? “గోచిపెట్టకమున్న కోమలకవిత చెప్పినవాఁడు సహపాఠి వేంకటకవి” (దేవీభాగవతము ౧ స్కం.) “ఉ. గోణము పెట్టుటాది బుధకోటి నుతింపఁ గవిత్వవైదుషీ వేణికయాచుఁ జేర్పడిన వేంకటశాస్త్రికి”.
(గీరత ప్రథమభాగము)

తిరుపతిశాస్త్రిగారు వ్రాసిన పయిసందర్భమునుబట్టి బాల్యమందే కవిత్వము పుట్టుట వేం. శా. గారి కని తేలినను తి. శా. గారి కెప్పుడు కవిత్వ మారంభమైనదియుఁ దేలదు. (కాళీసహస్రమునుండి) “శ్లో. సాహిత్యాం గురుపాణినీయజనితా, పౌరాణ సంవర్ధితా, దేశాలోకన పుష్పితాచ కవితా కన్యా మయి ప్రత్యయాత్, వ్రవే మాం స్వాయమేవ” పై శ్లోకార్థము ప్రౌఢావివాహమును ధ్వనింపఁ జేయుచున్నది. ఇది తి. శా. గారి శ్లోకము. అతఁడు బ్రహ్మయ్యశాస్త్రులవారి సన్నిధికి వచ్చునప్పటికి ౧౭ వత్సరములు దాఁటినవి. పిమ్మట నొకటిరెండేండ్లకుఁగాని కవిత్వరచనకు తి. శా. దిగలేదు. కావున నట్లు వ్రాసికొనెను. పై శ్లోకములో ‘మయి, మామ్,’ అను నేకవచనములను గూడ గమనింపవలయును. విమర్శకుఁడుగారి ధోరణి కీయేకవచనములుగూడ ప్రస్తుతనాటకమునందలి ప్రతిఫలనమువలె నస్తవ్యస్తములే కావలయును. అది యటు లుంతము. తి శా. గారి జీవితకాలములో నేనుమాత్రమే రచించిన కామే

శ్వేతశతకములో, "సహాధ్యాయింగా నల తిర్పతిశా సలిపె" అని యొకపద్యమున వ్రాసి యున్నాను. కాని ఆశతకముకూడ "తిరుపతి వేంకటీయము" అనియే ప్రకటింపఁబడినది. ఇదిమాత్రము విమర్శకుఁడుగారికి సమన్విత మగునా? ఆయన ప్రత్యేకించి వ్రాసినవియుం గలవు. మచ్చునకొకటి చూపుదును. "తిరుపతిశాస్త్రి తెలుంగుఁజేసె" అని బాల రామాయణప్రస్తావనలో నున్నది. ఆ బాల రామాయణముకూడ —"తిరుపతి వేంకటీయమే" ఇదిమాత్రము విమర్శకుఁడుగారి కెట్లు సమన్వయించును? పైఁగా ఆవాక్యమే సీసపద్యమునందున్నదో ఆసీసపద్యములో తి. వేం. కవు లిర్వురను శ్రీ పోలవరపు జమీన్దారుగారి యాస్థానమున నున్నట్లే తెలుపు వాక్యముగూడ నున్నది. ప్రత్యేకించి తి. శా. గారికిఁగల పైసంబంధము వేం. శా. గారికి విమర్శకుఁడుగా రెట్లు లగింపఁజేతురో? ఈ సీసములోనివాక్యము నెట్లో విడఁదీసి, తి. శా. గారికి మాత్రమే సమన్వయించి సమాధానము చెప్పుకొందమన్నను బుద్ధచరిత్రపీఠికలోని యీక్రిందివాక్యమట్లు చెప్పుకోనీయదే? "అని కోరికొని నాఁటఁగోలె నాప్రభువుచేఁ బోషింపఁబడుచుండ దాస్థానమందె యుంటిమి" ఎక్కడో వ్యంగ్యమర్యాదచే స్ఫురించెడి ప్రతిఫలనమునకై బోలెఁడు వెక్కిరింపుమాటలను వ్యయము మొనర్చిన విమర్శకుఁడుగారికి వాచ్యముగానున్న పై విషయము మఱియు సంగతము కావలయునుగదా? లేక నేనుగూడ శ్రీ పోలవరపు జమీన్దారుగారి యాస్థానమునుండి పోషింపఁబడిన ట్లేమేని యాధారములు చూపఁగలరా? దీనినిగుఱించి దివాకరాస్తమయములో విస్తరించి కలదుగాన వలయువా రందుఁ దిలకింపఁగలరు. ఇట్టి బుద్ధిమంతులు బయలుదేరుదు రని నేనించుక గుఱితించియే దానియందొకింత ప్రస్తుతవిషయము నుట్టంకించితిని. అట్లు చేసినను, "భక్షితేఽపి లశునే న రోగశాంతిః" అను న్యాయముకతన, ప్రయోజనము కనుపట్టనేలేదు. 'ఏదో తోఁచినట్లు వెక్కిరించనే కాని విమర్శకుఁ డిన్ని చూచితే' దని కొందఱ అనవచ్చును. సమ్మతమే కాని 'దేనిని విమర్శింప మొదలిడెనో దానిఁగూడఁ దీన్నఁగాఁ జూడలే దని ఋజువుచేసితినిగదా? 'అప్పను సత్యమే. ఆయన నేమిచేయుమందు'? రనిమెదరా? ఏమియును జేయవలదు. తరువాయి సరయుఁడు—ఇంతవరకు, తి. శా. గారి జీవితకాలమున జరిగినరచన లుదాహరింపఁబడినవి. తి. శా. గారి స్వర్గతికిఁ బిమ్మటివికూడ, 'ఆరోగ్యకామేశ్వరి', 'ఆరోగ్యభాస్కరము', 'మృత్యుంజయస్తవము' లోనైన పద్యములును, కొన్ని వచనములును వేం. శా. గారి వున్నవి. వానినన్నిటిని ఉభయకర్తృకములుగనే షష్టిపూర్తికమిటీవారు ప్రచురించుచున్నారుగదా! అందలి పద్యముల కుభయకర్తృకత్వ మెట్లు మనవిమర్శకబుధుఁడుగారికి సంగతమయ్యెడిని? 'బొబ్బిలి పట్టాభిషేకము,

గూడఁ దిరుపతి వేంకటీయమే. ఇవియన్నియు విమర్శకునకు నసంగతములే యని తేలినది. ఇట్టి ప్రాజ్ఞులకొఱకే కాఁబోలును కాటూరి వేంకటేశ్వరరావు జాతకచర్యపీఠికలో నీక్రింది యక్కరములు లిఖించినాఁడు. "ఈ గ్రంథము వేంకటశాస్త్రులవారి పృథగ్రచనమే యైనను- "ఒక్కరు రచియించి రేనియును గాఁదగుఁ దిర్పతి వేంకటీయమై" అను వారి సమయము చొప్పున నుభయకర్తృకముగానే ప్రకటించితిమి." పైరీతి నంగీకరించి ప్రకటించినవారికి మన విమర్శకుఁడుగారికిఁ గల్గిన సందేహము కలుగలే దనుకోవలయునా? ఈసమయము ప్రస్తుతవిమర్శకుఁడుగా రెఱుఁగ రనుకోవలయునా? లేక యెఱిఁగికూడ నీవిషయమున విమర్శకుఁడు తన యనంగీకారమును లోకమునకుఁ దెల్పుటకే యీప్రాఁత వ్రాసియుండు ననుకోవలయునేమో? తుది యభిప్రాయము కూడ నిలువదు. ఏమందురా? అట్లైనచో తి. వేం. కవుల సమయము నుదాహరించి పిదపఁ దన యసమ్మతిని దెలుపవలసి యుండును. అట్లొనర్పలేదుకదా? అదియును గాక తి. వేం. కవులసమయమును కాదనుటకీవ్యక్తి కేమి యధికారము? ఇంతవఱకెవ్వరును దీని నంగీకరింపనివారు లేరే? పైఁగా వీరి కీమైత్రి యెట్లింతకాలము నిలిచిన దని యక్కజపడుచు ప్రశంసించుట జగత్ప్రసిద్ధమే కావున విస్తరింపను. తి. శా. గారి స్వర్గతికిఁ బిమ్మట నొకపుష్కరమునకు మగుకాలమునకు జరిగిన నా షష్టిపూర్తిసందర్భములో నొకరు తిరుపతిశాస్త్రిగారుకూడ వచ్చి యీ సభ నలంకరించినట్లే భావించినారు, చూడుఁడు. "తిరుపతి దివ్యరూప మరుదేరెను మీ దగుషష్టిపూర్తికిన్" కవికి ముఖ్యమైనది భావనాశక్తి. అట్టి శక్తిని పైపద్యములో తత్పద్యకర్త ప్రదర్శించినాఁడు. ఇఁక తి. శా. గారి కొమారుని భావశక్తి నుపపాదించి విషయాంతర ముపక్రమింతును. "వేంకటేశ్వరురూపమ్మున నున్నతండ్రికి నమోవాకమ్ము లర్పించెదన్." ఆయీభావనలవలన లోకులు విద్యాసందర్భమున వారొనర్చుకొన్న సమయము పేరుమాత్రమో కాక పూర్తిగా నామోదించుచున్నట్లు స్పష్టము. ఈ విషయమున నుదాహరింపవలసినచో నెన్నియో కలవు. విస్తరభీతిచే సూచించి విడిచితిని. విమర్శకుఁడుగా రట్టిలోకులలో నొకరుకదా? ఏ రీమార్గమును వదలి "నేల విడిచిన సాముకు దిగు" టెట్టిదో? బందరులో కారణాంతరమున నొకరికైకొన్న గండపెండేరము వేఱొకరికిఁ గూడ నున్నట్లే సమన్వయించుకొన్నట్లును, కాకినాడలో నిం దొకరుమాత్రమే జయించిన రాజరాజేశ్వరీవిద్య యుభయులకును గలిగినట్లే సమన్వయించుకొన్నట్లును ప్రథమాంకమునందలి శుచిముఖివాక్యములవలన సుబువ్యగాఁ దేలుచున్నను విమర్శకుఁడుగారు "ముంజేతి కంకణమునకద్దము" ను గోరినట్లు "ఏవతః కవేః ప్రష్టవ్యమ్" అని యీ వృథావ్యాపారమునకు దిగిన కారణమేమో? మఱియు జాతక

చర్యలో "ఆ, యయలకు లేదు భేద మరయంగఁ గుటుంబములందుఁ దక్కినన్." అని కంఠోక్తిగాఁ జెప్పఁబడియున్న దే! మాకు జరిగిన విద్యావిషయపుసమ్మానములు నూటఁ దొంబది తొమ్మిదిన్న అవఱకు జంటగానే జరిగినవి. తక్కినయవియు ప్రత్యేకించి జరిగినను అయ్యదికూడ నిరువురము జమ కట్టుకొనువారము. ధనవిషయమునఁ గూడ నిట్లే యని యెఱుఁగఁదగు నని చదువరులకు నాయొనర్చు విజ్ఞప్తి. సుమారు నలువదియేండ్ల నాఁడు నేను జీవితసంశయావస్థలో నున్నపుడు (శ్రీ)జయంతి రామయ్యపంతులవారు నరసరావుపేటలో డిప్యూటీకలెక్టరుగా నుండి మమ్మవధానార్థ మాహ్వానించిరి. అపుడు తి. శా. గారుమాత్రమే వెళ్లిరి కాని, అట జరిగిన సన్మానము తి. శా. గా రింటనే యున్న నాకును బంచిపెట్టిరి. బందరు నేను ప్రవేశించుటకును న్నొకటి రెండు వత్సరములుమాత్రము మాలో మా కీవిషయమునఁ గొంత చర్చ జరిగి పృథక్త్వము తటస్థించినది. అప్పటిదే (శ్రీ)కాకుళము, మందసా, నూజివీడు లోనగు కొన్నిసభలలోని సమ్మానము. అదితప్ప పృథక్కరణము మా కెన్నఁడును ద్రవ్యవిషయమున లేనేలేదు. రచనలో నపుడును లేదు. అంత నేను బందరు ప్రవేశించితిని. వెంటనే (శ్రీ) వానమామలస్వామివారి యాహ్వానము సంఘటించినది. కలిసియే వెళ్లితిమి. పిమ్మట బందరులో నన్ను సమ్మానించుటకై పౌరులు చేసినసభ బొత్తిగా కవిత్వమునకు సంబంధించినది కాకపోఁబట్టి ఆసభలో తి. శా. గారి ప్రసక్తి యేమియు లేనికారణమున దానికతఁడు నల్వురు పండితులతోపాటుగ నాహ్వానింపఁబడియు రాలేదు. పదపడి యతని జీవితాంతమువఱకును కలిసియే అన్నవరోత్సవాదుల కరుగుచుండుట ప్రసిద్ధమే. అతని స్వర్గతియనంతరమునఁ గూడ నేను అన్నవరపు వార్షికమును గొన్ని వత్సరములవఱకు నాతనికుటుంబమునకు సరిగా పంచిపెట్టుట ఆ జమీందారు లెఱిఁగిన దే! పిమ్మట జమీన్దారులే పంచిపెట్టకుండ నాఁపుచేసి, తి. శా. గారి కొమరునకు వేఱుగా వార్షికము నేర్పఱచిరి. మఱియు నేలూరిలో తి. శా. గారి స్వర్గతికిఁ జాల నిటీవల (శ్రీ) మోంతే నారాయణరావుగారు మామృచ్ఛకటికమును ప్రదర్శించుచు నన్నాహ్వానించి నూటపదాఱులు సమ్మానించిరి. అది సైతము నేను పంచి యిచ్చితిని. ఇంత యెందుకు వ్రాయవలసి వచ్చిన దనఁగా, మాకుఁగల కవితాసంబంధ మిట్టి దని తెల్పుటకే. అతనిబంధుగు లెల్లరు నన్నతనినింబలెఁ ప్రేమించి వరుసవావులతో గౌరవింతురు. నాబంధువు లతనింగూడ నట్లే. ఈవిషయము ప్రస్తుత విమర్శకబుధుఁడుగా తండ్రిగారును, పెద్దతండ్రిగారునుగూడ నెఱిఁగినదే. జీవితకాలమునందలి యవినాభావమును గూర్చి కొంతయు, తి. శా. గారి జీవితముతరువాతి యవినాభావమును గూర్చి కొంతయు సంగ్రహముగా వివరించితిని. భవిష్యద్దప్వ

యమున నాయభిప్రాయ మెటు లున్నదో తిలకింపుఁడు. ఇటీవలి చర్యనుండి,

"తే. గీ.—

కొడుకు నామేనగోడలికొడుకుఁగూడ
శతవధానంబు నాఁ జను స్యందనంబు,
నడపుటకు నాకు మిగుల నానంద మయ్యె
మనములో నున్న కోరిక మఱపురాదు."

"చ. తిరుపతి నేనునుంబలెనె
తిర్పతిపుత్రుఁడు మత్సుతుండు ని
ర్వురు గవగూడి సత్సభలఁ
బొంపిరివోయెడిపాండితిన్ బర
స్పర మవధానమున్ సలిపి
పండితులం గరఁగించుచో యశ
స్కర మగు మాకు నిర్వురకు
సర్వవిధమ్ములనంచు నెంచెదన్."

"తే. గీ.—

ఇందులకుఁ దగ్గ సామగ్రి యేఱుపడియుఁ,
బట్టదయ్యె నీదృశమహాభాగ్యగరిమ,
వచ్చుతరమున నేని తిర్పతివనుమలు,
నామనుమలు తీర్తురుగాక నాదుకోర్కె."

విస్తర మెందులకు? తి. వేం. కవుల యవినాభావ మెఱుఁగనివా రెవరు? "గోల్లా రోకల్లం బాడినకూఁతము లెపు డింత దాఁచి కొన్న నణఁగునే?" అయ్యది దేవీభాగవతము నందలి శివశక్తుల యభేదమువంటిది.

"ఆ. వె.—

అతఁడ యేను నేన యాతఁడు భేదం బొ
కింత యేని యుండ దిరువురకును,
బుద్ధిమంతులైన పురుషు లెఱుంగుదు
రెఱుఁగలేరు బుద్ధిహీనజనులు."
—దేవీభాగవతము, 3 స్కంధము.

తి. శా. గారి బిరుదములు. వేం. శా. గారికి, వేం. శా. గారి బిరుదములు, తి. శా. గారికి సమన్వయించినట్లే, ఆయన ప్రతిఫలన మీయనకును, ఈయన ప్రతిఫలన మాయనకును కడు సులువుగా సమన్వయించు నని మున్ముందే నిరూపింపఁబడినది. వాస్తవమునకు హంసములు రెండుగాని యొక్కటిమాత్రమే కా దనుట నిర్వివాదము. విమర్శకుఁడుగారు హంస మొక్కటిమాత్రమే వసుదేవునియాగమునకు వెళ్లియుండలే దనునంశమును బోధింపఁగల యక్కరముల నొక్కచోటమాత్రమే కాక రెండుచోట్ల నుదాహరించియు నీయంశము స్ఫురింపక కాఁబోలు లేనిపోని వికల్పములకుఁ గడంగెను. హంసములు రెండైనను దేనియం దెవరు ప్రతిఫలించిరో యనునంశము విడఁదీయవలసిన యావశ్యకత లేదు. నాటక మొక్కరే మొదలిడినను నిరువురు మొదలిడినట్లే తి. వేం. కవులసమయ మని వ్రాసి, అందులకుఁ గల యాధారమును ప్రస్తావన నుండి యుదాహరించియున్నాను. వసుదేవునిజన్మము నప్పుడు శుచిముఖియు వేఱొకహంసమును జంటగా నుండి *శతవధానము చేసినట్లు స్పష్టముగాఁ దెలియు నక్షరములు నాటకమునఁ గలవు. శుచిముఖితో జంటగానున్న హంసముపేరు వ్రాయవలసిన యావశ్యకత లేమిం జేసి వ్రాయలేదు.

ఆ ప్రశ్నము జనకమహారాజుభార్యపే రేవ రనుటవంటిది. ఇది యిటు లుండె. తి. వేం. కవులకు దేవీభాగవతములోని శివశక్తుల యవినాభావ మున దాహరణ మీయఁబడినదిగదా! వీరిలో నెవరికిఁ బ్రాధాన్యము అను చొప్పదంటుశంకకూడ రావచ్చును. కావునఁ గొన్నియక్కరము లప్రస్తుతములే యైనను వ్రాయుదును. ద్వంద్వసమాసమును గుచ్చి కొందము. 'శివకేశవులు.' ఇట నిరువురకును ప్రాధాన్యము తుల్యమే యైనను నొకరి కొక పరియును, వేఱొకరికి వేఱొకపరియును పర్యాయముగా ప్రాధాన్యము వివక్షింపవలసివచ్చును. కారణ మేమన? సమాస మెట వచ్చునో యచట నేకార్థీభావరూపసామర్థ్య ముండితీర వలెను. ఆసామర్థ్యములోని ముఖ్యాంశము విశేష్యవిశేషణభావము. అయ్యది ద్వంద్వమునందలి పదముల కితరసమాసమునందలి పదములకుంబలె సులభముగా లగింపదు. అక్కతమున నెటులో కల్పించుకోవలసివచ్చును. దానిస్వరూప మిట్టిది. 'శివసహితః కేశవః' అని యొకపరియు, 'కేశవసహితశ్శివః' అని యొకపరియు వారివారియిచ్ఛ ననుసరించి చెప్పకొందు రనుకొందము. అప్పు డొకరి కొకప్పుడును, వేఱొకరి కింకొకపరియును ప్రాధాన్యాప్రాధాన్యములు వచ్చినట్లే, తి. వేం. కవులలోఁగూడ వివక్షించుకోవలెను. జంట కవులుగదా యని సభలలో మాటలాడు నపుడుగాని, యింటఁగూర్చుండి కవిత రచించు నపుడుగాని కంఠస్వరములు కల్పియే యావాక్యము లుచ్చరింతు రనుకొనువా రుండరు. ఎప్పు డెవరు మాటలాడుదురో వారు ప్రధానులు, రెండవవా రప్రధానులు. ఆయీవిషయ మాబాలగోపాలముగా నెఱిఁగినదే యయ్యును దీనినిగూడ నవగతము చేసికొనేరని విమర్శకుఁడు మాకర్మము కాలి మాకుఁ దటస్థించుటచే నింత చెత్త ప్రసంగము వ్రాయవలసివచ్చినది. ఇందుల కుదాహరణముగూడ నిత్తును.

"ఒకచరణం బతండు మఱియొక్కటి నేను మఱొక్క టాతఁడున్." ఈ పద్యము గద్వాలరాజుగారినిగూర్చి మాటలాడుసందర్భములోనిది. పేరులేనందున తి. శా. గా రుచ్చరించినదో, వేం. శా. గా రుచ్చరించినదో నిర్ణయము చేయువలనుగాదు గాని యిరువురును కంఠస్వరములు కల్పి యుచ్చరించిన దని మాత్ర మెవ్వరును చెప్పరు. మఱియొకటి:

"తిరుపతి యతండు వేంకటేశ్వరుఁడ నేను, నెరసి తిరుపతి వేంకటేశ్వరుల మేము" ఈపద్య ముచ్చరించినది వేంకటశాస్త్రి యని స్పష్టము. అపుడు తి. శా. గా రూరక యుందు రనుట సుగమము. ఇట్లే తి. శా. గారు చదువుచున్నప్పుడు వేం. శా. గా రూరక యుందురు. అవధానసమయము ననో? చెరియొకచరణమునుగా నొడువుదురు. కాని అపుడుగూడఁ బ్రత్యేకరచన కొంత యుండును. ఇది పలువురు ప్రేక్షకు లెఱిఁగినదే. ఇఁక ప్రస్తుత ముపక్రమింతము. ప్రథమాంకములో శుచిముఖి మాటలాడుచు



నాట్యకళాప్రపూర్ణ టి. రాఘవాచార్యులు, దుర్యోధనుడు

లక్ష్మీఫిలిమ్సువారి "ద్రౌపదీ మానసంరక్షణము"



డా. కూచిభట్ల శివరామకృష్ణయ్య, కర్ణుడు

న్నది. ఆంధ్రకృతి. తి. వేం. కవులకుఁగల ప్రజ్ఞలు వ్యంగ్యమర్యాదచేతఁ గనుపట్టుచున్నవి. అట్టిచో నయ్యవి తి. శా. గారి ప్రజ్ఞలా, వేం. శా. గారి ప్రజ్ఞలా యని శంకించుకోవలసి యేమి వచ్చెను? ఇరువుర ప్రజ్ఞలును గూడఁ గావచ్చునే? రచనకు మొదలిడినవారిరువురా, రొకరా యని శంకింపనేల? ఒకరు మొదలిడినను ఇరువురు మొదలిడినట్లే వ్రాసికొనుట తి. వేం. కవుల యాచార మైనట్లు ప్రస్తావనలోని వాక్యమే ఘోషించుచున్నది కదా! వారు మొదలిడిరి, వీరు మొదలిడిరి అని వ్రాయుటకు మా యుత్తరపుస్తకములలో నెక్కడో కాని యాధారములే దొరకవు. మధ్యకాలమున, తి. శా. గారు స్వర్గతులగుటచే స్వాయముగా నీవిషయ ముపోద్ఘాతములో వ్రాయుటవలన విమర్శకుఁడు దానిం బట్టి వ్రేలాడఁదొడఁగెను. అంతమాత్రమున తి. వేం. కవులసమయ మేమగును? సమయము నెఱిఁగియో యెఱుఁగకో యేవో కొన్ని పుటలు భారతిలో వ్యర్థముగా వమ్మొనర్చినను, ఈవిమర్శకుని విషయమున నింతగాఁ గలుగఁజేసికోఁదలఁపను గాని యితని హృదయమునఁ గొంత దురభిప్రాయమున్నట్లు కనుపట్టుచున్నది. అది యెట్టి దన? ఇరువురజీవితకాల మైనచో మాయిరువురకును, ప్రస్తుతము మాయిరువురకుటుంబములకును విరోధము కల్పింపవలయు ననునట్టిదియే. ఈవిషయ మాయనవిమర్శనవ్యాసములోని యక్కరములను సవిమర్శముగాఁ జదివిన బుద్ధిమంతులు గ్రహింపఁగలరు గాన విస్తరింపను. ముఖ్యాంశము, వసుదేవునియాగమున శతవధాన మొనర్చినది శుచిముఖమాత్రమే కాదు; వేఱొకహంసముకూడ నున్నది. ఇది వాచ్యవృత్తిచేఁ దెలియుచునే యున్నది. శుచిముఖిమాత్రమే మాటలాడినపుడు వ్యంగ్యమర్యాదచే స్ఫురించుచున్న విద్యావిశేషములు తి. వేం. కవు లిరువురకును సమన్వయించుకొనుట కేవిధమైన యభ్యంతరమును నుండదు. ఇట్టిస్థితిలో విమర్శకుఁ డంత వ్రాఁత వ్రాయుటయు, నాచే నింత వ్రాయించుటయు 'జలతాడనము' వంటిది. అయినను వ్రాసినందులకుఁ జదువరులు నన్ను క్షమింతురుగాక—

"ముంజేతికంకణమ్మునకద్దమేల?" అన్నటు లున్న మా యీప్రతిఫలనమే యీ విమర్శకునికిఁ గుదురలేదుకదా, మహాభారతమునందలి యీక్రిందిపద్యము సమన్వితమెట్లగునో చూతమని యుదాహరించి యిప్పటి కిద్దానిని ముగింతును.

"చ. పరమగురూపదేశమునఁ
బార్థుఁడు పార్థివరత్నశేఖరుం
డరిదిబలమ్మునన్ భుజబ
లాతిశయమ్మున నీశుఁ బన్నగా
భరణుఁ బ్రసన్నుఁ జేసి దయఁ
బాశుపతాదికదివ్యబాణముల్
హరసురరాజదేవనివ
హమ్ములచేఁ బడసెన్ గ్రమమ్మునన్."
—ఆది. 3 ఆ.

ఇట్టి చొప్పదంటుశంకలు నేఁడే మాకుఁ దటస్థింపలేదు; విద్యార్థిదశనాఁటినుండియు నెవరో చేయుటయు, నుత్తర మిచ్చుటయుఁ గలదని చదువరు లెఱుఁగనిది కాదు. విద్యార్థి దశలో మాతోఁ జదివికొనునొకరు,

"శ్లో. పశుపతిదయితాతృతీయపుత్రౌ
తిరుపతివేంకటశాస్త్రిణౌ..."

అను ధాతురత్నాకరశ్లోకములో మీ కిరువురకును తృతీయపుత్రత్వ మెట్లు సిద్ధించునని శంకింపఁదొడఁగిరి. దానిం గూర్చి చెప్పిన సమాధాన మిపుడు ప్రస్తుతము గామిం జేసి యిట నుదాహరింపక ప్రస్తుతపుశంకకును దానికిని గొండొక పోలిక యుంటచే స్పృశించి విడుచుచున్నాను.

"సీ. ఏమహాత్ములు గల్గ భూమీశసభలలోఁ
గవులకు బహుళవిఖ్యాతి గల్గె"

అది యటు లుంతము. ఇఁక నొకటి మఱచితి. ఈనా వ్రాసినవ్రాఁతగూడ తిరుపతి వేంకటీయ మనియే ముందు సంపుటముల లోఁ బ్రకటిత మగును. అది విమర్శకునకు సమయము ననుసరింపనిచో నెట్లు సమన్వయించునో? 'శాంతం పాపమ్'.

---



# రసాభాసము

## శ్రీపాద వెంకటేశ్వర్లు

కావ్యమునకు రసమే జీవితము. ఔచిత్యమును పాటించి జాగరూకుడై రసమును పోషించుచు కవి కావ్యనిర్మాణముం జేయవలెను.

విభావై రనుభావైశ్చ
సాత్త్వికై ర్వ్యభిచారిభిః,
ఆనీయమానః స్వాదుత్వం
స్థాయీ భావో రస స్స్మృతః.
(ప్రతాపరుద్రీయము-రసప్రకరణము)

విభావానుభావాదులచే స్థాయి చక్కగ పరిపుష్ట మయినపుడే రస ముదయించును. అట్లు పరిపుష్టముగానిచో నాభాసమాత్రము. అచ్చట రస ముదయింపదు. దీనినే మనవారు రసాభాసమని వ్యవహరించిరి. శృంగార రసాభాసము నిట కొంత వివరింతము. శృంగారరసాభాసస్వరూపమును ప్రతాపరుద్రీయమున విద్యానాథు డిట్లు నిర్వచించినాడు:

ఏకత్రైవానురాగశ్చే
త్తిర్యఙ్మ్లేచ్ఛగతోఽపివా,
యోషితో బహుసక్తిశ్చే
ద్రసాభాస స్త్రిధా మతః. (రసప్రకరణము)

౧. నాయికానాయకులలో నొకరియందే రతి వర్ణితమైనచో నది రసాభాసమట—

భుజపంజరే గృహీతా
నవపరిణీతా వరేణ వధూః,
తత్కాలజాలపతితా
బాలకురంగీవ వేపతే నితరామ్॥
(రసగంగాధరము-ప్రథమాననము)

ఇచ్చట నాయకునియందే రతి వర్ణితమైనది.

౨. మఱియు తిర్యగ్గతమైనటులగాని, మ్లేచ్ఛగతమైనటులగాని వర్ణితమైన నదియు రసాభాసమేనట.

"ప్రాసాదగర్భవలభీషు కపోతపాళ్యాం
పారావతీం రమణచుంబితచంచుకోటిమ్,
ఆవిర్భవత్స్మరతహజితరక్తకంఠీ
మాలోక్య కాకతివిభుః స్మిత మాతనోతి.
(ప్రతాపరుద్రీయము-రసప్రకరణము)

ఇచ్చట రతి పారావతగతమై వర్ణింపబడినది.

లఘుని తృణకుటీరే క్షేత్రకోణే యవానాం
నవకలమపలాలస్స్తరే సోపధానే,
పరిహరతి సుషుప్తం హాలికద్వన్ద్వ మారా
త్కుచకలశమహోష్మాబద్ధరేఖ స్తుషారః.
(దశరూపకము-చతుర్థప్రకాశము)

ఇచ్చట రతి హాలికగతమై వర్ణింపబడినది.

3. స్త్రీకి బహునాయకవిషయకరతి వర్ణితమైన నదియు రసాభాసమేనట.

భవనం కరుణావతీ విశన్తీ
గమనాజ్ఞాలవలాభలాలసేషు,
తరుణేషు విలోచనాబ్జమాలా
మథ బాలా పథి పాతయాంబభూవ.
(రసగంగాధరము-ప్రథమాననము)

ఇచ్చట బహునాయకవిషయక రతి వర్ణితమైనది.

ఔచిత్యానుసారముగ విభావాదులు వర్ణితములయినపుడే సామాజికులకు చక్కగ రస మనుభవయోగ్యమగును. రసోత్పత్తికి ముఖ్యసాధనములగు నాయికానాయకులలో నొకరియందే రతియుండిన నౌచిత్యమునకు భంగము వాటిల్లును. అప్పుడు సామాజికుల కానందము కలుగదు.

ఒకవిషయము. తిర్యఙ్మ్లేచ్ఛ గతరతిని వర్ణించినపుడుకూడ రసాభాస మనిరి. ఏలనో తెలియకున్నది. ఇచ్చట నాయిక, నాయకుడును గలరు. ఇద్దరియందును రతి గలదు. రాజదంపతులయందు - బ్రాహ్మణ దంపతుల యందు- సామాన్యదంపతులయందు తత్తదనుగుణముగ రతి వర్ణింపబడినటులే యిచ్చట గూడ తదనుగుణముగా వర్ణింపబడును. అట్టి తరి రస మేల కాగూడదు ?

నాయికానాయకులు విదగ్ధులుకారుగనుక విభావాదిజ్ఞానము లేదనుట యొకయుక్తిగాదు. రసోత్పత్తిలో విభావాదిజ్ఞాన మనపేక్షితము; విభావాదిసత్తయే యపేక్షితము. మఱియు రస మనుకార్యనిష్ఠము కాదు. అయిన నలౌకికమైన యఖండానందమున మగ్నుడగు రసజ్ఞునకు పూర్వావస్థయందు గూడ విభావత్వేన విభావాదిజ్ఞాన మనావశ్యకము.

తిర్యఙ్మ్లేచ్ఛ దంపతులుగూడ విభావాదిజ్ఞానము లేకపోయిన నుద్యానవనముల జూచి యానందింపకపోరు. చంద్రికయం దుత్సాహముతో విహరింపకపోరు. విలువయైన భూషణాదులు లేకపోయిన నుచితమైన కుసుమములచే నలంకరించుకొనెదరు. పరస్పరము ప్రేమించుకొనెదరు. శృంగారచేష్ట లుండును. ఇట్లు రసోత్పత్తికి గావలసిన సామగ్రియంతయు నుండ నిచ్చట రస మేలకాగూడదు ?

అందుచేతనే రసాభాస విషయమును జెప్పుచు రసగంగాధరమున జగన్నాథుడు "అనుచితవిభావాలంబనత్వం" అని రసాభాసకు చక్కని లక్షణ మిచ్చియున్నాడు. అనుచితవిభావము వర్ణితమైన రసాభాసము. అనౌచిత్యము లోకాశ్రయము. సహృదయులకు తెలియును. అందు తిర్యఙ్మ్లేచ్ఛగతరతి యాభాసమైనటుల నుదాహరణముల నాత డిచ్చియుండలేదు. అది రసాభాస మని యాత డూహించినటుల గనబడదు.

ఇక నాయిక కనేకనాయకవిషయక రతి వర్ణిత మయినపు డదియు రసాభాస మనిరి.

దక్షిణనాయకున కనేక నాయికానురాగము వర్ణితమయినపుడు రస మగుచుండ నాయిక కట్టి యనురాగమును వర్ణించిన రస మేల కాగూడదు?

"దక్షిణోఽస్యాం సహృదయః" అని గదా దక్షిణనాయకునిస్వరూపము. అయిన నొకనాయికయందే యనురాగ మని చెప్పుట సమంజసము కాదు.

ఏలనన వత్సరాజు దక్షిణనాయకు డని వ్రాయుచు ధనికు డిట్లు వ్రాసినాడు:

"న చోభయో ర్జ్యేష్ఠాకనిష్ఠయో ర్నాయకస్య స్నేహేన నభవితవ్య మితివాచ్య మవిరోధాత్. మహాప్రబంధేషుచ :—

స్నాతా తిష్ఠతి కున్తళేశ్వరసుతా
వారోఽంగరాజస్వసుః
ద్యూతే రాత్రి రియం జితా కమలయా
దేవీ ప్రసాద్యాద్యచ, ।
ఇత్యంతః పురసుందరీః ప్రతి
మయా విజ్ఞాయ విజ్ఞాపితే
దేవేనాప్రతిపత్తిమూఢమనసా
ద్విత్రాః స్థితం నాడికాః. "

ఇత్యాదా వపక్షపాతేన సర్వనాయికాసు ప్రతిపత్త్యుపనిబంధనాత్. తథాచ భరతః:—

"మధుర స్త్యాగీ రాగం
నయాతి మదనస్య నాపి వశమేతి,
అవమానితశ్చ నార్యా
విరజ్యతే సఖు భవే జ్జ్యేష్ఠః"

ఇత్యత్ర నరాగం యాతి నమదనస్య వశమేతీత్యనే నాసాధారణ మేకస్యాం స్నేహో నిషిద్ధో దక్షిణస్య."
(దశరూపకము-ద్వితీయప్రకాశము)

సాహిత్యదర్పణమున విశ్వనాథకవిరాజు గూడ "ఏషు త్వనేకమహిళాసమానురాగో దక్షిణః కథితః" అని దక్షిణనాయకుని స్వరూపమును జెప్పినాడు. రెండవనాయికయందు దను వృత్తిమాత్రము గలవాడు శఠుడని యాతని కిట్లు స్వరూపమును జెప్పెను: "శఠోఽయ మేకత్ర బద్ధభావో యః,దర్శితబహిరనురాగో విప్రియ మన్యత్ర గూఢ మాచరతి."

అట్టి దక్షిణనాయకునే శిశుపాలవధ వ్యాఖ్యానమున మల్లినాథుడు "ఇతి కృత వచనాయాః......యోషితాం విగ్రహేషు" (౧౧ సర్గ, ౩౪ శ్లోకము) అను శ్లోకమునకు వ్యాఖ్యానము జేయుచు నిట్లు చూపినాడు: "అయంచ సహృదయః, అన్యథా రసాభాస ఇత్యాహుః."

మఱియు నాయికలలో పరకీయ యొని నాయిక. పరకీయ యన్యోఢ, కన్య యక యిరుదెరంగు లగు. అం దన్యోఢాగతరతిని శృంగార మందురు.

పరకీయాలక్షణమును జెప్పుచు దశరూపకమున "ఇయం త్వంగిని ప్రధానే రసే నక్వచి న్నిబంధనీయేతి నప్రపంచితా" యని వ్రాయబడినది. దీనినిబట్టి యంగరసములో నుండు నని తోచును. దర్పణమున :—

"స్వామీ నిశ్వసితేఽప్యసూ యతిమనోజిఘ్రః సపత్నీజనః
శ్వశ్రూ రింగితదైవతం నయనయో రీహాలిహో యాతరః
తద్దూరా దయ మంజలిః కిమమునా దృగ్భంగిభావేన తే
వైదగ్ధీమధుర ప్రబంధరసికవ్యర్థోఽయ మత్ర శ్రమః"
(సాహిత్యదర్పణము-తృతీయపరిచ్ఛేదము)

అని పరనాయిక కుదాహరణము. ఇచ్చట శృంగారరసమే యగునుగాని యాభాసగాదని వ్యాఖ్యానకారుడు "ఇతి పరనాయికోదాహరణంతు న శృంగారాభాసః, తథాత్వే శృంగారే పరనాయికోదాహరణ మనర్థకం స్యాదితి ధ్యేయమ్"అనువాక్యములచే నిర్వచించినాడు.

ఇట్లు పరనాయికాగతరతి రసమగుచుండ బహుసక్తయోషిద్గతరతి రసముగాక యాభాసమగు టెట్లు? వీరిరువురకు గల భేదమేమి?

కనుక దక్షిణనాయకగతరతిని, పరనాయికాగతరతిని రసమని యంగీకరించి బహుసక్తయోషిద్గతరతిని రసముకాదనుటలో విని గమకము గాన్పింపదు.

పైహేతువులనుబట్టి తిర్యఙ్మ్లేచ్ఛగతరతి, బహుసక్తయోషిద్గతరతియు వర్ణితములయిన-స్థలములగూడ తప్పక రసమేగాని యాభాస మెంతమాత్రము గాదని తోచెడిని.

# అహోబలపండితుఁడు

మక్కపాటి వేంకటరత్నము

ఈయన గుంటూరుజిల్లా బాపట్లతాలూకా సంతరావూరు వాస్తవ్యుఁడును, ఆగ్రామకరణములలోనివాఁడునునై యుండెను. చిన్నతనమున విద్యావాసన లేక హాలిక వృత్తి నుండెను. ఈతనిపేరు గాలి ఓబళయ్య. ఆర్వేలనియోగిబ్రాహ్మణుఁడు. భారద్వాజసగోత్రుఁడు. తండ్రి నరసింహయ్య. తల్లి లక్ష్మీదేవమ్మ. తనయింటిపేరు ప్రభంజనవంశ మని అహోబలపండితీయమున నీతఁడు వ్రాసికొనెను. తనతండ్రి మొదలగు కరణములు గ్రామముపై వసూలైన సర్కారుదస్తును హరించి జమీన్దారుల యొత్తిడికిఁ బరారి కాఁగా రాజభటు లీతనిని బట్టుకొనిపోయి ప్రభువునాజ్ఞమేరకుఁ గారాగృహస్థుని జేసిరి. ఈతఁడు చదువరి కాకున్నను శ్రావ్యముగఁ బాడఁగలవాఁడై యుండెను. కారాగృహమునం దొకదినమునఁ బాడుచుండఁగాఁ బ్రభువు మొదలగువారు విని యతనిం బిలిపించి పాడించి విని సంతసించి నీ వెవర వని యడుగ నాతఁడు తన వృత్తాంతమును జెప్పి, తాను చిన్నవాఁడ నగుటచే నిష్ప్రయోజకుఁడ ననియు, విడిపించినచో తన మేనమామయగు పోలూరి మాధవసోమయాజులుగారియొద్దకుఁ బోయెద ననియు మనవిచేసి వేఁడికొనెను. మాధవసోమయాజులుగారు జగద్విదితులగుటచేఁ బ్రభువు విని సంతసించి యతనిని విడిపించెను. అంత నాతఁడు తన తల్లితోఁగూడ వినుకొండతాలూకా గోకనకొండ (గోకర్ణగిరి) గ్రామమునకు మేనమామలయింటికిఁ జేరెను. మామగారింటనుండు వారందఱు స్త్రీలుసహా విద్వాంసులగుటచే నీతనిఁ బరిహసించుటయు, నితఁడు రోషపడి దేశాటనమున కేఁగెద నని మామగారికిఁ జెప్పఁగా వారు వలదని వారించి "నీ కొక మంత్రము చెప్పెదను" దానిని జపించుకొను మని నృసింహమంత్రము నుపదేశించెను. అంతట నీతఁ డచటఁగల కొండగుహయందుఁ జేరి తపము సేయఁగా స్వామి యొక మనుజాకృతిని వచ్చి యేమో నాలుకపై వ్రాసి నీ యింటికిఁ బోదము రమ్మని యొకరాత్రి తోడ్కొనివచ్చి పిలువ నింటివారు తలుపు తీయఁగా నాతఁ డదృశ్యుఁడయ్యెను. ఈతఁ డొక్కఁడే యింటఁ బ్రవేశించియుండెను. ఓబళయ్య నాఁటినుండి కుశాగ్రబుద్ధిగలిగి మామగారియొద్ద విద్య నేర్చి పండితుఁడై నవద్వీపము మొదలగుచోట్ల కేఁగి మిక్కిలి విద్యాభ్యాసము చేసివచ్చెను. మేనమామనే తన గురువని యహోబలపండితీయమునఁ జెప్పెను. శ్రీరామభక్తుఁడై అహోబలపండితీయమును, కవిశిరోభూషణ మనుపేర

నన్నయభట్టీయమునకు వ్యాఖ్యయు వ్రాసి అభినవనన్నయసూరి అని బిరుదము గాంచెను. పిదపఁ గాళిందీపరిణయమను ఆఱాశ్వాసముల పద్యకావ్యమును వ్రాసెను. ఇది ఆంధ్రసాహిత్యపరిషత్పత్రికయందుఁ ప్రకటింపఁబడినది. కాని గ్రంథ మన్యహస్తగతమై గ్రంధపాత మేర్పడి మొదటిభాగ ముత్పన్న మగుటంజేసి పీఠికవృత్తాంతములు తెలియకున్నవి. అందైన విశేషములు వ్రాసియుండలేదు. కాళిందీపరిణయ మొకటి (పద్యకావ్యము) ౧౮౯౨ సం. శ్రీ రా. బ. పనప్పాకం అనంతాచార్యులవారివలన వైజయంతీపత్రికయందుఁ బ్రచురింపఁబడినది. దీని కవి యెవరైనది తెలియదు.

ఈతఁడు పిదప రాజాశ్రయమున మైదవోలు, నారాయణపురము అను అగ్రహారములు సంపాదించినట్లు తెలియవచ్చుచున్నది. ఇందు నారాయణపురము వినుకొండ తాలూకా గోకనకొండసమీపమున గుండ్లకమ్మ యొడ్డుననుండి యేటిపోటునకుఁ గొట్టుకొనిపోయెనని చెప్పెదరు. ఈజాడ లిప్పటికిని గనుపట్టుచున్నవి. ఈ రెండు గ్రామములను గూర్చి యీకవి వ్రాసినవనెడి రెండు పద్యముల నిం దుదాహరించుచున్నాను. ఇవి వాడుకవలనఁ జెడి నిర్దుష్టములుగ లేకున్నవి. దొరకిన రీతినే వ్రాసినాఁడ—

సీ. శ్రీమించుఁ దూర్పున సిరులకుఁ బట్టైన
కులిశాయుధుని వీడు గొట్టెపాడు
ఆగ్నేయదిశయందు నఖిలవేదాంతార్థ
మహిమకు నిలయము మైదవరము
దక్షిణదిశయందుఁ దనరారుచున్నటి
జమ్ములమడక సౌజన్యనడక
నైఋతిపార్శ్వాన నరుల కద్భుతపట్ల
పురుహూతుని మెట్ట పూరిమెట్ల
రాజిల్లు కొండలరాయని పాలెంబు
భూజనాళికిఁ గల్పభూరుహంబు
వాయవ్యదిశయందు వఱలు గోకనకొండ
నిరతార్థిజనులకు సిరులు నిండ
ఉత్తరదిశయందు నున్నతస్థితి గాంచు
నాగులవరము భూనాకపురము
ఈశాన్యదిశయందు భాసిల్లు కీర్తిచేఁ
గవికల్పవల్లి కూకట్లపల్లి
తే. గీ. అష్టపురమంతరస్థాయియైన
శాశ్వతైశ్వర్యములకును సదనమైన
ప్రబలనారాయణపురంబు పాలకడలి
పట్టిమెఱనున్న నవరత్నపతక మనఁగ.

సీ. జానకీపతి లేఁతసజ్జరొట్టెలపాలు
కొంపల కప్పెల్ల గొడ్లపాలు
సంవాసములు దొంగజాగిలంబుల పాలు
నయనముల్ జాగరణంబుపాలు
గట్టిపొత్తపు త్రాళ్లు కట్టెమోపుల పాలు
*మృదువైన చేతులు మొండ్లపాలు
భూరిసంధ్యావిధుల్ బురదనీళులె పాలు
నాలుక దీనోక్తిజాలిపాలు
తే. ఘనతరస్నేహ మది తుచ్ఛజనముపాలు
చిత్త మేవేళ నతిదీర్ఘచింతపాలు

* మొత్వంపు చేతులు అని యుండిన నుండును.

హాహాహా! దేహ మంతయు నలత పాలు
పైదవోలున నుండుట మాకుఁ జాలు.

ఈయన అభినవ నన్నయ భట్టారక బిరుదు వహించి

క. గట్టిగ నభినవనన్నయ
భట్టాచార్యాభిధానపటుబిరుదాంకం
బిట్టట్టనక వహించిన
దిట్టను ననుఁబోలఁగల సుధీవరు లేరీ?

అని చదువుచుండెడివాఁడఁట. ఈతఁడు గోకన కొండ కొండగుహాయందుఁ దాను తపస్సు చేసినచోట నృసింహాలయము గట్టించి ప్రతిష్ఠించెను. ఇది యిప్పటికిని గలదు.

కా ల ము

ఈకవికాలమును నిర్ణయించుటకు నాధారము లెంతయత్నించినను లభింపవయ్యె. కాని యీతని కుమారుఁడు రామభద్రప్పశాస్త్రులుగారు శా. శ. ౧౬౭౦ శుక్లనామ సం. శ్రావణ శు. ౧౫ లున శ్రీ రాజా మల్రాజు రామారాయణింగారి వలన వినుకొండతాలూకా ముమ్మడివరము నగ్రహారమును బొందెను. ఇందును బట్టి అహోబలపండితుఁడును, రమారమి ౨౦౦ యేండ్లక్రిందటివాఁడని చెప్పనగును. ఈకవి వంశస్థు లిప్పటికిని ముమ్మడివరము నగ్రహారముగ ననుభవించుచున్నారు. ఈ వంశము వారు ముమ్మడివరము, నర్సారావుపేట తాలూకా కొణిదెనమజరా మర్లాయపాలెము సంతరావూరు గ్రామములందుఁ గలరు. ఈ క్రిందఁ జూపినరీతిని యీకవివంశస్థులు పండితులయి స్వామికృపచే దినదినాభివృద్ధి నొందుచున్నారు.

అహోబలపండితుఁడు
|
రామభద్రప్పశాస్త్రి
|
రామచంద్రశాస్త్రి
|
నరసింహశాస్త్రి
|
చినపిచ్చయ్యశాస్త్రి
|
సుబ్రహ్మణ్యం
|
సాంబయ్య

లక్ష్మీఫిలిమ్సువారి "ద్రౌపదీ మానసంరక్షణము"



మిస్ కమలాబాయి, ద్రౌపది

# నరసభూపాలీయము

బులుసు వేంకటరమణయ్య

ఆంధ్రవాఙ్మయమున గల అలంకారశాస్త్ర గ్రంథములలో [౧]నరసభూపాలీయమను నామాంతరముకల 'కావ్యాలంకారసంగ్రహ' మొకటి. కాలమును బట్టి యిది చిన్నకోటపెద్దయకవి రచించిన కావ్యాలంకారచూడామణికి తరువాతిది. అలంకారవస్తునిరూపణము, విషయవివేచనము, గ్రంథప్రాశస్త్యములనుబట్టి పయిదాని కిది మొదటిది.

సంస్కృతమున విద్యానాథపండితుడు రచించిన ప్రతాపరుద్రీయము దీనికి స్థూలమూలము. ఇప్పటివఱకు పండితలోక మట్లే తలచుచున్నది. ఈ తెలుగునరసభూపాలీయమునకు మూలము సంస్కృతనరసభూపాలీయ మొకటి యున్నదనియు, దానిని ఏతద్గ్రంథకర్తృసమకాలికు డగు నొకకవి (ఇతని పితృష్వస్రపుత్రుడు) వ్రాసెననియు శ్రీ మానవల్లి రామకృష్ణకవిగా రొకపుడు చెప్పినారు. అట్లు చెప్పుటయేకాక మూలగ్రంథము తమ వద్ద నున్నదనియు, నీగ్రంథమునుగూర్చి యొకవ్యాసమును తాము వ్రాయుదు ననియు వారు సెలవిచ్చినారు. నరసభూపాలీయకర్త తన గ్రంథమునం దెచ్చటను మూలగ్రంథప్రశంస నొనరింపకుండుట పయివాదమున కనుకూలము. శ్రీ రామకృష్ణకవిగారు సప్రమాణముగ తమ వాదమును సమర్థించువఱకు దీనిమూలము ప్రతాపరుద్రీయమే యని యనుకొనుట తప్పనిసరి.

నరసభూపాలీయమును రచించిన మూర్తికవియు, వసుచరిత్రహరిశ్చంద్రనలోపాఖ్యానములను రచించిన రామరాజభూషణకవియు అభిన్నులను వాద మొకటియు, భిన్నులేయను వాద మొకటియు కలవు. భేదవాదులు స్వమతమున క్రింది ప్రమాణముల నుదాహరించుచున్నారు—

౧. మూర్తికవితండ్రి వేంకటరాయభూషణుడు; రామరాజభూషణుని తండ్రి సూరపరాజు. ౨. నరసభూపాలీయముగద్య లౌకవిషయముగను, వసుచరిత్ర, హరిశ్చంద్రనలోపాఖ్యానములగద్య లింకొకరీతిని కలవు. 3. నరసభూపాలీయశైలి యప్రౌఢము; తక్కిన గ్రంథముల శైలి ప్రౌఢము.

పయియుక్తులపయి ఖండనమండనము లనేకములు వెలసినవి. ఇప్పటికి పయియిరువురు వేర్వేరు వ్యక్తులు కారని తేలినది. భట్టుమూర్తికవి కృష్ణదేవరాయలయల్లుడగు రామరాయల యాస్థానమునకు భూషణప్రాయుడగుటచే రామరాయ లతనికి 'రామరాజభూషణు'డను బిరుదము నొసగెననియు, నట్లే యతనితండ్రియగు సూరపరాజునకు పత్తోపకుడు వేంకటరాయలు వేంకటరాయభూషణుడను బిరుదము నొసగెననియు, బాల్యమున వ్రాయబడిన నరసభూపాలీయములోని శైలి యితరగ్రంథములప్పటి నప్రౌఢముగ నుండుట బాధకము కాజాలదనియు, గ్రంథములలోని గద్యలు వేర్వేరుగ నున్నను, అన్నింటను కవి 'హనుమత్పుత్రుడ' నని చెప్పికొనుట సమానమనియు, భట్టుమూర్తికవి వసుచరిత్రమును వ్రాసెనను జనశ్రుతి, వసుచరిత్రప్రాచీనవ్యాఖ్యాత సోమనాథకవి, ఆంధ్రకౌముదీకర్త మొదలగు వారి వాడుక పయి యభేదవాదమున కనుకూలము లనియు నభేదవాదులలో నొకరగు శ్రీ. వఝ్ఝల చినసీతారామస్వామిశాస్త్రిలుగారు వ్రాసియున్నారు.[౨]

---

౧. ఈ గ్రంథమున ఆశ్వాసాంతగద్యములలో '.........ప్రణీతంబైన కావ్యాలంకార సంగ్రహంబను మహాప్రబంధంబునందు.. ......' అని యున్నది. (చూ. వావిళ్లవారి ప్రతులు.)

౨. చూ. హరిశ్చంద్ర నలోపాఖ్యాన, వసుచరిత్రముల విమర్శనములు.

భేదవాదులలో గొందఱు 'రామరాజభూషణు' డనుపదము బిరుదవాచకము కాదనియు, భట్టుమూర్తి రామరాజసభాభూషణుడు కాని రామరాజునకు భూషణభూతుడు కాడనియు, నిది బిరుదమేయైనచో 'రామరాజసభాభూషణ'వంటి దేదో యొకటి యుండవలె ననియు చెప్పుచున్నారు. కాని శాకప్రియుడగు రాజు శాకపార్థివుడును, సూపప్రియుడగు బ్రాహ్మణుడు సూపబ్రాహ్మణుడు నయినట్లు మధ్యమపదలోపసమాసమాశ్రయణమున విరోధము లేదు.

నరసభూపాలీయము, వసుచరిత్ర, హరిశ్చంద్రనలోపాఖ్యానములు శైలిలో జాల భేదించుచున్నవను నాక్షేపణకు అభేదవాదులు 'నరసభూపాలీయమును మూర్తికవి చిన్నతనమున రచించెను' అని సమాధానము చెప్పికొననక్కఱలేదు. నరసభూపాలీయ మలంకారశాస్త్రగ్రంథము; తక్కినవి ప్రబంధములు. కవిత్వవిషయమున పయిరెండువిధముల గ్రంథములను సరిపోల్చుట పాడిగాదు.[3] మూర్తికవి నరసభూపాలీయము కావ్యమని, ప్రబంధమని చెప్పినను అది యలంకారగ్రంథమే యగును కాని కావ్యము కాజాలదు.

నరసభూపాలీయము పలువురచే బహుసారులు ముద్రింపబడినది. కాని విమర్శనపూర్వముగ సమగ్రముగ గ్రంథమును పరిశోధించి ముద్రించినవారుమాత్రము ఇంతవఱకును లేరు. ఉన్నప్రతులలో శ్రీవావిళ్లవారి ప్రతియే కొంతమేలు. వారు తనుమాత్రపు విమర్శనము (పీఠిక)తో దానిని ప్రకటించినారు. కాని యా విమర్శనము ప్రబంధవిమర్శనమునుబోలి కవిత్వమును, కల్పనములను, రేఫద్వయమైత్రిని మాత్రము విమర్శించునదయియున్నది. ఈగ్రంథ మలంకారశాస్త్రమును దృష్టితో బరిశీలించినచో విమర్శింపదగిన విశేషములిం దనేకము లున్నవి. తద్విమర్శనమే యీవ్యాసమునకు బ్రధానోద్దేశము.

విషయాంతరసాంకర్యము లేక, సమగ్రముగ అలంకారశాస్త్రవిషయములను వివరించిన ఆంధ్రగ్రంథములలో నరసభూపాలీయమే మొట్టమొదటిది. తత్పూర్వము వెలువడిన కావ్యాలంకారచూడామణియందు అలంకారవిషయములతో బాటు ఛందోవ్యాకరణవిషయములును చర్చింపబడినవి. అనంతుని రసాభరణము రసస్వరూపమాత్రప్రతిపాదకము.

ప్రతాపరుద్రీయ మీ నరసభూపాలీయమునకు మూల మయినను కొన్నియెడల మూర్తికవి మూలము నతిక్రమించి స్వతంత్రవిషయములను వ్రాసెను. మూలమున గల నాయకగుణములు-మహామహిమత్వ, పాండిత్యములు విడువబడి, నాయకస్వరూపనిరూపణమున క్రొత్తగ 'కావ్యగీతిప్రియత్వ' మిందు చెప్పబడినది; స్వీయాది నాయికల లక్షణము తీయబడినవి. మూలమందలి శాస్త్రీయచర్చ లనువాదమున విడువబడినవి. మూలమునగల ఇరువదినాలుగు గుణములలో పదియే యిందు గ్రహింపబడినవి. నాటకప్రకరణ మనువదింపబడనేలేదు. అప్పటికి ఆంధ్రమున నాటకవాఙ్మయము లేకపోవుటచే లక్షణనియమ మనావశ్యకమని మూర్తికవితలంపును తజ్జ్ఞులు నిశ్చయించుచున్నారు.

మూర్తికవి కవులలో మిన్నయనుటకు సందేహములేదు. కాని పాండిత్యమున - అందును అలంకారశాస్త్రపాండిత్యమున కూడ నట్టివాడే యనుటకు వీలులేదు. కవిత్వము వేరు; పాండిత్యము వేరు. కవులుగ ప్రసిద్ధిజెందినవారు శాస్త్రనిర్మాతలగుట అరుదు. ఒకవేళ కవులు శాస్త్రనిర్మాత లయినను సిద్ధాంతములపట్టుల లోపములు కనుపించుట సహజము.

నరసభూపాలీయమునందు కవిత్వము మంచిపాకమున బడినది. కాని శాస్త్రవిషయప్రతిపాదనమున చాల లోపములు కానవచ్చుచున్నవి. అందు కొన్నింటి నీక్రింద వివరింతును.

౧. మూలగ్రంథకారు డగు విద్యానాథుడు "పూర్వేభ్యో భామహాదిభ్యః సాదరం విహితాంజలిః" అని ప్రాచీనాచార్యనమస్కృతి నొనరించెను; కాని భామహాదు లే యే విషయములను ప్రతిపాదించిరో

3. ఉ... నీవొనరింపఁబూనిన యనేకమహాకవివాఙ్మయోపకారావహమైన కావ్యము మదంకితమై వెలయుఁగ... [నరస-౧-౧౬] కావ్యాలంకారసంగ్రహంబను మహాప్రబంధంబునందు...(ఆశ్వాసాంతగద్యము)

చెప్పలేదు. మూర్తికవి యంతటితో తృప్తిపొందక "సీ. నిజరూపమునకు వన్నియదెచ్చు శేఅొక్క-బెళుకొందు ధ్వనిహీరకళిక లమర ......... భామహాదుల నని శంబు ప్రస్తుతింతు" [ఆశ్వా. ౧. పద్య ౧౪.] అని భామహాదులు యోగ్యముగా నొనర్చిన కావ్యసామగ్రిని కూడ వివరించెను. ఈనిరూపణ సరికాదు. భామహుని కాలము నాటికి ధ్వనివాదము ఫుట్టనేలేదు. అత డలంకారమార్గవాది. మూలకారుడు ఏయంశమును చెప్పక తప్పుకొనెను. మూర్తికవి విపులీకరించి తప్పుచెప్పుటకు తలపడెను.

౨. ధీరోదాత్త, ధీరోద్ధత, ధీరలలిత, ధీరశాంతులని నాయకులు నాల్గువిధములుగ నుందురు. వీరందరు విభిన్నులు; ధీరోదాత్తు డెప్పుడును ధీరోద్ధతుడుకాని, ధీరలలితుడుకాని, ధీరశాంతుడుకాని కాజాలడు. మూలకర్త ప్రతాపరుద్రుని ధీరోదాత్తునిగను, భటులను ధీరోద్ధతులుగను, కాకతీంద్రుని ధీరలలితుని గను, బ్రాహ్మణులను ధీరశాంతులగను, వర్ణించెను. మూర్తికవి ధీరోదాత్తునిగ చెప్పిన నరసరాజునే తిరిగి "ఉ............యింతుల రత్నహారముల- నెల్లధనంబుల నిచ్చి కొల్వ నిశ్చింతతఁదాల్చు నోబయనృసింహుఁడు భోగకళాప్రవీణుఁడై." [ఆశ్వా. ౨. ప ౪.] అని ధీరలలితునిగ చెప్పెను. ఇది అసమంజసము.

3. "ఒక్క నాయికయందు విశేషానురాగము కలవాడు అనుకూలనాయకుడు; అపరాధము వ్యక్తమయినను భయములేనివాడు - అనగా సిగ్గులేనివాడు ధృష్టుడు" అనిమూలమున కలదు. [ఏకస్యాం నాయికాయాం విశేషానురక్తోఽనుకూలనాయకః; వ్యక్తాగా గతభీః ధృష్టః] అనుకూలునకు భార్యలు పెక్కుమంది యుండవచ్చును; అందరియెడను అతని కనురాగము నుండవచ్చును. ఒక్కనాయికయందు ఎక్కువ యనురాగమున్న జాలును.

అట్లే తన యపరాధము తేటతెల్లమయినను భయపడకుండుట ధృష్టుని లక్షణము. పయిలక్షణముల కును మూర్తికవిలక్షణములకును భేదము కలదు. మూర్తి కవి "చ. ....................ఒక్కకాంతకే, వలచి గుణాభిరాము డగువా డనుకూలుడు; సాపరాధుడై యలుగనివాడు ధృష్టుడు ........." [ఆశ్వా. ౨. ప. ౧౦.] అని చెప్పెను.

ఈఅనుకూలలక్షణముబట్టియు, "-తాన రమాప్రియుడయ్యె నెంతయున్." అను నుదాహరణభాగము నుబట్టియు నాయికకు నాయకునియం దనురాగ ముండవలె నను విపరీతార్థము కలుగుచున్నది. ఇది సరికాదు.

౪. ఉపమేయమును కప్పివేసి ఉపమానోపమేయముల కభేదము చెప్పుట అధ్యవసాయము. దానితో కూడిన లక్షణ సాధ్యవసాయలక్షణ. మూలమున దీనికి 'కాకతీయవంశపారావారమున చంద్రుడు పుట్టెను." అని ఉదాహరణ మీయబడెను. అచట ఉపమేయమగు ప్రతాపరుద్రుడు చెప్పబడలేదు. కాన ఇది కుదిరినది. పయిలక్షణ కుదాహరణముగ మూర్తికవి "క......... పోచిరాజవంశ. స్థిరరత్నస్తంభమున నృసింహుడు పుట్టెన్" (ఆశ్వా. ౨. ప. ౬౫.) అని వ్రాసెను. ఇచటి నృసింహశబ్దము ఉపమానవాచకమే కాదు; ఉపమేయవాచకముకూడ నగును. ఇది సాధ్యవసాయలక్షణోదాహరణము కావలెనన్న నృసింహశబ్దమును తీసివేసి వేరొకశబ్దమును చెప్పుట ఉచితము.

౫. వాచ్యార్థముకాని, లక్ష్యార్థముకాని స్ఫురింపజేయునర్థము వ్యంగ్యము. కావున వ్యంగ్యార్థ మర్థాంతరముతో కూడియుండునని చెప్పవలెను. లక్షణామూల వ్యంగ్యము రెండువిధములు. అం దర్థాంతరసంక్రమిత మొకటి. ప్రకృతానుపయుక్తమగు నర్థము వ్యంగ్యార్థమున సంక్రమించిన అర్థాంతరసంక్రమిత మగును. రాముడు తన్నుగూర్చి చెప్పికొనినపుడు "రాముడనుగాన సర్వమును సహింతు" అనుచో 'రాముడ' నని వేరుగ చెప్ప నక్కఱలేదు. ఆ పద మనుపయుక్తమయి సీతావియోగాదులను సహించినవాడను వ్యంగ్యార్థమున సంక్రమించుచున్నది. ఈఅర్థాంతరసంక్రమితము నరసభూపాలీయమున చాలచోట్ల 'అర్థాంతరసమేత' మని చెప్పబడినది. అర్థాంతరసమేతత్వము వ్యంగ్యసామాన్యధర్మము. అదివ్యంగ్యభేదమును తెలుపజాలదు.

౬. వాచ్యార్థానుపపత్తి, వాచ్యార్థముతోడి సంబంధము కల లక్షణ ననుసరించి కలిగిన వ్యంగ్య మత్యంతతిరస్కృతావివక్షితవాచ్య మగును. 'గంగ యందు గొల్లపల్లె కల'దని చెప్పినపు డట్లుండుట అసంభవము కావునను, గంగాతీరములకు సామీప్యసంబంధ ముండుటవలనను 'గంగాతీరమున గొల్లపల్లె కల'దను నర్థము (లక్ష్యార్థము) కలిగి తన్మూలముగ పల్లెయొక్క చల్లదనము, పవిత్రత మొదలగునవి వ్యంగ్యము లగును. మూర్తికవి పయిధ్వనికి "క. ఖరఖుర............ ఖురకరతురగోత్కరమై, కర మమరు నృసింహభాటి కాహాయము...'అని యుదాహరించి అతిక్రమింపబడిన సామ్యముగల సూర్యాశ్వములు కల దను బహువ్రీహిసమాసమున "తిరస్కృతస్వార్థము" కలదని వ్రాసెను. [ఆశ్వా ౨.ప.౧౧౩,౧౧౪.] కాని యిది సరికాదు. బహువ్రీహిసమాసములలో వాచ్యార్థ మనుపపన్నము కాదు. ఇందలి వ్యంగ్యార్థమేమో చెప్పబడలేదు. బహువ్రీహియందు 'కలవాడు, కలది' అనునవి వాచ్యములు కాకపోవుటచే ఆ సమాసము అత్యంతతిరస్కృత మని భట్టుమూర్తి పొరపడియుండవచ్చును. [పుట ౩౪.]

౭. పయికీతి నీ యిందలి 'అర్థాంతరసంక్రమితావివక్షితవాచ్యధ్వని' న్యుదాహరణము కలదు. అది కుదురదు. 'నరసేంద్రుడు మత్స్యయంత్రమును తెగనేయ మత్స్యదేశపురాజు అడవులకు భయమున పాఱిపోయె' నని యిందలి యుదాహరణము. ఇచట మత్స్యశబ్దసామ్యమువలన ఈవ్యంగ్యము కలుగునని మూర్తికవి వ్రాసెను. అర్థాంతరసంక్రమితవ్యంగ్యస్వరూప మిదివరలో చెప్పబడినది. అది యిచట ఎట్లును సంగతము కాదు. ఇంతకును ఇచటగల వ్యంగ్యమేమి ?

౮. శబ్దశక్తిమూలాలంకారధ్వనికి "కోమలి పద్మిని; నరసరాజు సూర్యుడు;" అని యుదాహరణము. "ఇందు ప్రకృతములగు వధూనృపకుమారకంబులు; అల పద్మినీనశబ్దంబు తెలిమి కమలినీభాస్కరుల దెల్పగలుగుట నిచట శబ్దశక్తిమూలధ్వనియనియు, ఉపమాలంకారము వ్యంగ్యమనియు లక్షణసమన్వయుపద్యము కలదు. ఇచట శబ్దశక్తిమూలధ్వని లేదు. అనేకార్థములు కల శబ్దము ప్రస్తుతార్థమును తెలిపినట్లు అప్రస్తుతార్థమునుగూడ తెలుపును. ప్రస్తుతాప్రస్తుతములు రెండింటికిని ఒక సంబంధ మేర్పడినగాని అట్లొనర్చుట కుదురదు. ఆ సంబంధమే ఉపమానోపమేయభావము. అదియే అలంకారధ్వని యనగను. ఈసిద్ధాంతమునకు పయి ఉదాహరణముతోగాని, సమన్వయముతోగాని ఏమాత్రపుసంబంధము లేదు.

ఇచటి అలంకారము వాచ్యముగనే ఉన్నది; కాన వ్యంగ్యముకాదు. ఆ అలంకారమును రూపకము కాని మూర్తికవి వ్రాసినట్లు ఉపమకాదు. [పుట ౩౪.]

౯. స్వతః సిద్ధార్థశక్తిమూలాలంకారకృత వస్తుధ్వనికి "నరసరాజు చారుయశోవధూమణికి సారసనైరి ముఖంబు; తారకల్ సారనఖాంకురంబులు; శంకరశైల, హిమాద్రులు వక్షోరుహములు ; సితాబ్జములు లోచనపంకజాతములు" అని యుదాహరణ మీయబడినది. ఇచట పరిణామము వాచ్యమగు నలంకారమనియు, దానివలన నరసవిభుని కీర్తి ముల్లోకములు నిండుననుట వ్యంగ్యమనియు సమన్వయ మొనరింపబడినది ఇచట వాచ్యమగు నలంకారము రూపకము. ఇచట కీర్త్యాదులగు నుపమేయములందు కాంతాత్వాద్యుపమానత ఆరోపింపబడినది. పరిణామాలంకారమున ఇటులుగాక ఉపమానమే ఉపమేయముగ మారుచుండును. "ఆమె దృగబ్జమున వీక్షించుచున్న" దని దాని ఉదాహృతి. ఇచట ఉపమానమగు పద్మము వీక్షణక్రియోపయోగి యగుటకు దృక్కుగా పరిణమించుచున్నదికాన పరిణామము. కాన మీది వివరణము తప్పు. మఱియు 'సితాబ్జములు లోచనము' లన్న చాలును. 'లోచనపంకజాతము' లనుట అనుచితము. [ఆశ్వా. ౨. ప. ౧౨౩, ౧౨౪.]

౧౦. కవిప్రౌఢోక్తి సిద్ధార్థశక్తిమూలాలంకారకృత వస్తుధ్వనికి ఇందు 'నరసరాజుకృపాణము శత్రురాజుల కంఠసీమలను ద్రుంచియు అంచితవిక్రమంబున మహాసమరవ్రతదీక్షచేతనో, పోషించినకారణంబుననో రక్తప్రవాహములను వాత నంటు' దని యుదాహరణ మీయబడినది. "ఇచట పోషించియుబలె ఖడ్గము రక్తము నంట దను నుత్ప్రేక్షచే ఖండనవేగరూప

ము వస్తువు వ్యంగ్యము" నని పయిదానికి వివృతి వ్రాయబడినది. ఇచ్చట ఉత్ప్రేక్షాద్యోతకములగు వలెన్, పోలెన్ మొదలగు పదములు లేవుకాన ఉత్ప్రేక్ష వ్యంగ్యమే యగును. అట్టిపదము లున్నపుడే ఉత్ప్రేక్ష వాచ్యమగుననియు, లేనిచో వ్యంగ్యమగుననియు ఆలంకారికుల అనుశాసనము. ఇచట 'పోలెన్' అనునది వివృతిలో కలదు. మూలమున కానరాదు. కావున ఇది పయిభేదమున కుదాహరణము కాజాలదు. (ఆశ్వా. ౨. ప. ౧౩౩, ౧౩౪.)

౧౧. "నాయికానాయకులలో నొక్కరికే అనురాగ మున్నను, ఉభయగతమగు ననురాగము తిర్యక్ మ్లేచ్ఛగతమయినను, ఒక్క స్త్రీకి పెక్కుగురుపురుషుల పయి ఆసక్తియున్నను రసాభాస మగు" నని మూలగ్రంథమగు ప్రతాపరుద్రీయమున గలదు. ఇంచుమించుగ అలంకారగ్రంథము లన్నిటియందు రసాభాసలక్షణ మిట్లే యున్నది. "పలువుర కొకకామినిపయి తలపున్నను, ఒక్కనారసతికి పలువురిపయి వలపున్నను, విహగాదులకు పరస్పరము ప్రేమయున్నను రసాభాసమగు"నని నరసభూపాలీయమున చెప్పబడినది. ఇది మూలముకంటె చాల విభిన్నముగ నున్నది. (ఆశ్వా. ౩. ప. ౧౮౫.) మూలమునగల 'ఒక్కరికే అనురాగముండుట, అనురాగము మ్లేచ్ఛగతమగుట' రసాభాసము లగుననునంశము తెనిగింపున విడువబడినది. ఒక్కనారస్త్రీకి పలువురిపయిగల అనురాగము రసాభాస మగునపుడు స్త్రీసామాన్యమునకంతకును బహునాయకగతమగు అనురాగము రసాభాసమగుననియే చెప్పవలసియున్నది. అట్లు చెప్పకుండుట శోచనీయము.

౧౨. "ప్రకృతోపయోగకరముగ ఉపమేయమునందు ఉపమానత్వమునారోపించుట పరిణామాలంకార"మని యిందు చెప్పబడినది. అట్టిలక్షణమున కనుగుణముగనే "దేవస్త్రీల కౌగిలికొరకు స్వర్గమునకేగు శత్రురాజులకు నరసరాజుకత్తి నీలాలనిచ్చెన అయిన"దని ఉదాహరణ మీయబడినది. [ఆశ్వా. ౫. ప. ౫౦, ౫౧.] ఇది సరికాదు. ఉపమానము ఉపమేయత్వ మారోపింపబడిన పరిణామము; ఉపమేయమున ఉపమానత్వ మారోపింపబడిన రూపకము. ఇచట ఉపమేయమగు కత్తియందు నిచ్చెనతన మారోపింపబడుటచే ఇది రూపకోదాహృతియగుట యుక్తము. పయిలక్షణముకూడ రూపకలక్షణమేయగును. ఈ గ్రంథమందలి రూపకలక్షణము అస్పష్టముగ "...ఆరోపితమందు రంజనము సేయఁ రూపకంబై తనరు" [ఆశ్వా. ౫. ప. ౩౫] అనికలదు. ఉదాహరణములు మాత్రము పయి పరిణామాలంకారోదాహరణమువలెనే కలవు.

౧౩. అప్రస్తుతవృత్తాంతమువలన ప్రస్తుతవృత్తాంతము గమ్యమాన మగుచో అప్రస్తుతప్రశంసాలంకృతి యగును. దాని కుదాహరణముగ ఇందు,

"క. నగలు మొనలెత్తెఁ గేసెలు
చినికెం జిగురాకు గంపెఁ జెదరె నలితతుల్
చనవున నీపూఁదీఁగకు
ఘనమైన నృసింహుపొందు కలుగఁగఁబోలున్."
(ఆశ్వా. ౫, ప. ౧౬౫.)

అని ఉదాహరణము ఈయబడినది. ఇచట పూవుదీగ వృత్తాంతమువలన నాయికావృత్తాంతము తోచుట సరిగ ఉన్నది; కాని 'ఘనమైన నృసింహుపొందు' అని వాచ్యమునకుకూడ నింపు ప్రవేశ ముండుటచేత ఇది అప్రస్తుతప్రశంసోదాహృతి కాజాలదు. 'నృసింహుపొందు'నకు అప్రస్తుతమగు నర్థము కల్పించుట అసంగతము.

౧౪. అర్థాలంకారముల పట్టికలో రసవత్, ప్రేయ, ఊర్జస్వి, సమాహితము లను నాలుగలంకారముల పేళ్లు ఈయబడినవి. కాని వాని లక్షణోదాహరణములు లేవు. వానిం గూర్చి వ్రాయుచు మూర్తికవి ఇవి "అప సమరసప్రకరణమున రసభావాద్యుపనిబద్ధరసములు గానన్ ఇచట వివరింపఁగ లే"దని సమాధానము వ్రాసినాడు. [ఆశ్వా. ౫. ప. ౨౩౦] కాని రసప్రకరణమున వీని సంగతియే లేదు. రస మప్రధానమగుచో ప్రేయోఽలంకార మగునని, రసాభాస మప్రధానమగుచో ఊర్జస్వి అలంకార మగునని, భావాభాస మప్రధానమైనచో

సమాహితాలంకారమగునని ఆలంకారికుల సిద్ధాంతము. ఆయంశ మిచట చెప్పకుండుట లోపము.

౧౫. నరసభూపాలీయము వెలువడిన నాటికి ఆంధ్రమున నాటకవాఙ్మయము లేకుండుటనుబట్టి యిందు నాటకలక్షణము లేకుండుట లోపము కాదు. అట్లే యిందు మూలమునగల శాస్త్రీయచర్చలు విడువబడుటయు లోపముకాదు. కాని మూలమురీతినే ఛందోయతిభంగములనే దోషములలో చెప్పి మూర్తికవి ప్రాసభంగమును ప్రాల్మాలుట శోచనీయము. సంస్కృతమున ప్రాసనియమము లేదు; అందుచే ప్రాసభంగము దోషముకాదు. తెలుగున పద్యములలో ప్రాస యుండి తీరవలెను. కాన ప్రాసభంగము ప్రధానదోషములలో ఒకటి.

౧౬. పరస్పర విరుద్ధ విషయమున కొక ఉదాహృతి- నరసభూపాలీయమున మూలమునందలి గల్ల, కటి శబ్దములతోపాటు 'చన్నులు, కన్నులు' కూడ "గ్రామ్యము"లే యని చెప్పబడినది. ఆ దుష్టపదములతో కూడిన చక్కని పద్యము- గ్రంథకర్తృవిరచితము-లాటానుప్రాసమున కుదాహరింపబడినది. ౪ న్యాయమునుబట్టి కన్నులు మొదలగు పదములు దుష్టము లనరాదు.

ఈ గ్రంథమున కొన్నియెడల కొన్ని విషయములు చర్చింపబడి, లక్షణములు ఈయబడినను అవి చాల అస్పష్టరీతినున్నవి. అవాచకముల కూర్పు, అక్కరలేని పెంపు ఎక్కువయినది. కొన్నిట సంప్రదాయములు కొరవడినవి. మచ్చునకు కొన్ని—.

౧. 'కావ్యములు అంగనాజనవిలాసాలాపలీలాసమ్ప్రాదుర్భావములు' [పుట ౧౧] అని కలదు. కావ్యములు కాంతాసమ్మితములని దీని యర్థము. గానికొరకే ఈ పెంపు. కాంత తనయభీష్టమును ప్రియునికి మాటలచే గాక చేష్టలచేతనే తెలియజేయును. ఇందు దానికి విరుద్ధముగ 'ఆలాపలీలాసమ్ప్రాదుర్భావ—' అనిచెప్పబడినది.

౨. నాయకులు నలుగురని చెప్పుసందర్భమున ఇందు 'ధీరోదాత్తప్రముఖులు ధీరోద్ధత, ధీరశాంత, ధీరలలితు' లని వారిపేరులు చెప్పబడినవి. ఇచట 'ప్రముఖ' శబ్దప్రయోగ మనవసరము. ఇచట "ధీరోదాత్తుడు మరియును" అని యుండుట లెస్స. [పుట. ౨౫.]

౩. లక్షణలో గౌణభేదము నుదాహరించుచు మూర్తికవి "క్షోణిసురు డగ్ని యనునెడ శుచిగుణంబు, వాచ్యవిభవాభిరామమై వరలు" నని వివరించెను. 'అగ్నికి క్షోణిసురునకును భేదమున్నను అభేదమే యిచట చెప్పబడినది. వాచ్యార్థము కుదురమియు, శుచిగుణ సంబంధము నిచట నుండుటచే 'అగ్నివంటి క్షితిసురు' డను లక్ష్యార్థము కలుగుచున్నది. వివరణ మిట్లు లేదు. 'వాచ్యవిభవాభిరామమై వరలు' ననియే ఉన్నది. దాని కర్థమేమో తెలియదు. [పుట. ౩౨.]

౪. అర్థశక్తిమూలధ్వనియందలి అర్థము 'స్వతఃప్రసన్నము, కవిప్రౌఢవచనసిద్ధము, సుకవినిబద్ధోక్తిసిద్ధము' నని మూడువిధములుగ ఇందు చెప్పబడినది. అర్థము స్వతఃసంభవి, కవిప్రౌఢోక్తి సిద్ధము, కవినిబద్ధవక్తృప్రౌఢోక్తిసిద్ధము అని మూడు విధములని ఆలంకారికుల మతము. నరసభూపాలీయములోని మూడవ భేదముయొక్క నామము అసంగతము. [పుట. ౩౭.]

౫. స్థాయిభావములను వివరించు సందర్భమున ఇందు ఉత్సాహమునకు బదులు 'ప్రయత్నము' చెప్పబడినది. అది ఉత్సాహార్థమున అవాచకము. [పుట. ౪౫.]

౬. రసస్వరూపనిరూపణ సందర్భమున మూర్తికవి "వానికి దుఃఖమైన, సుఖవైభవమైన విటవిటాళియం దారయఁ బూర్ణమై సహృదయాత్ములఁ గేవలహర్షమై తనన్." [పుట. ౬౩] అని చెప్పెను.

నటులయందు కాన్పించు సుఖదుఃఖభావములవలన సహృదయులకు విగళితవేద్యాంతరమగు ఆనందము

౪. చ. ఘనత నృసింహుఁ జూడఁగల కన్నులు కన్నులు; వానికౌఁగిటం, జనువున చేఁపు మాపఁగల చన్నులు చన్నులు; వానిమోవికిం, జొనిపిన పాటలాధరము జున్నులు జున్నులు; వానిమేనఁజేర్చిన సరసాంగయష్టికల చెన్నులు చెన్నులువో తలోదరీ! [ఆశ్వా. ౪, ప. ౭౮]

కలుగునని ఆలంకారికుల మతము. పై పద్యభాగమువలన ఈఅర్థము వ్యక్తముకాదు. విటే, విటాళియందే సుఖదుఃఖవైభవములు పూర్ణములు కావు. ఆనందమనుటకు మూర్తికవి 'హర్ష'మనుపదమునే వాడెను. హర్షము సంచారిభావమాత్రము. అది సంతోషమను అర్థముననే ప్రసిద్ధము. విగళితవేద్యాంతరమగు ఆనందరూపార్థమున కది అవాచకము.

నరసభూపాలీయము పెక్కుసారులు పెక్కు ముద్రాక్షరశాలలయందు ముద్రింపబడినది. వాఙ్మయపోషకులగు శ్రీ వావిళ్లవారును దీనిని ప్రకటించిరి. ఈప్రతులన్నింటిలోను వావిళ్లవారి ప్రతియే చాల మేలు. కాని గ్రంథలోపములతోపాటు ముద్రణస్ఖాలిత్యములును ఇందు ఎక్కువగా దొరలినవి. అందు కొన్నిటి నుదాహరింతును.

౧. ఆశ్వా. ౧. ప. ౧౭. న 'నాయికానాయకోన్నతుల' అనుటకు 'నాయకనాయకోన్నతులు' అని పడినది.

౨. ఆశ్వా. ౧. ప. ౨. న 'జగత్ప్రఖ్యాతవిఖ్యాతిసాగర'కు మారుగ'జగత్ప్రఖ్యాతివిఖ్యాతసాగర' అని కలదు.

౩. ఆశ్వా. ౧. ప. ౨౯. న 'స్వర్ణరాసు'లకు 'స్వర్ణకారు' లని ముద్రింపబడినది.

౪. ఆశ్వా. ౧. ప. ౩౪ న 'కలికాలచోళవిభుఁ' డనుటకు 'కలికాలచోళవిభుఁడు' అని పడినది.

౫. ఆశ్వా. ౧. ప. ౪౩ న 'రాజమాంధాత" అనుటకు 'రాజి మాంధాత' అని కలదు.

౬. ఆశ్వా. ౧. ప. ౭౨ న 'సత్కీర్తిచే చంద్రశర దేశసరసుల' అనుటకు బదులుగా 'సత్కీర్తిచే సుధాకరదేవసరసుల' అని కలదు. ముద్రణమున యతిభంగము గమనింపకుండుట పెద్దపొరపాటు.

౭. ఆశ్వా. ౨. ప. ౧౪. న 'దనిపెదుఁగాని భావమున' అనుటకు మారుగ 'దనిపెదుఁగాని భారమున' కలదు.

౮. ఆశ్వా. ౨. ప. ౭౩ న '.....రచనాత్రిసుదతార్థ.....'కు మారుగ 'రచనాత్రిసుధతార్థ' అని కలదు.

౯. ఆశ్వా. ౨. ప. ౯౯. న '...వీని లక్ష్యము లొనర్తు' ననుటకు బదులు 'వీని లక్షణ మొనర్తు' నని కలదు.

౧౦. ఆశ్వా. ౨. ప. ౧౦౪.న 'రవిసంఖ్య' అనుటకు బదులు 'రతిసంఖ్య' అని ముద్రింపబడినది.

౧౧. ఆశ్వా. ౨. ప. ౧౩౯. న 'విబుధపంక్తుల' అనుటకు మారు 'సుకవిపంక్తుల' అని కలదు.

౧౨. ఆశ్వా. ౨. ప. ౬౭ న 'వ్యంగ్యముసుమఁ జెలంగున్' అనుటకు బదులు 'వ్యంజనాఖ్యఁ జెలంగున్' అని ముద్రింపబడినది.

౧౩. ఆశ్వా. ౨. ప. ౧౩౨ తరువాత 'కవిప్రౌఢోక్తిసిద్ధార్థశక్తిమూలాలంకారకృతవస్తు ధ్వని' అను లక్ష్యనిర్దేశము ఆవశ్యకము. ముద్రితిగ్రంథమున అది లుప్తము.

౧౪. ఛందో యతి భంగములను నివరించు సందర్భమున నరసభూపాలీయమున "కుందేందు విశదయశుఁడై, ముందుగఁ బూజించినాఁడు నరహరిని" అని యుదాహరింపబడినది. పయిరెండుదోషములకును మొదికందార్థభాగమే యుదాహృతి. ఇందు యతిభంగమే కానవచ్చుచున్నది. "కుందేందు విశదయశుఁడై" అనుదానిని "కుందేందువిశదయశుండై" అని చదివినచో అది ఛందోభంగమున కుదాహృతి కాగలదు. [పుట. ౬౭]

౧౫. ఏకవాచకానుప్రవేశసంకరోదాహరణమున "నీయసి వసిష్ఠునీ డనఁ బొల్చున్." అని యుండుటకు బదులుగ "నీయసి వసిష్ఠునీడనుబోల్చున్" అనియున్నది పుట. ౧౦౪.

ఇట్టి ముద్రణస్ఖాలిత్యములు ఇంకను చాల కలవు. తగిన విమర్శనముతో, తగిన వివరణములతో, పరిశుద్ధముగ ఈ గ్రంథము ముద్రింపబడవలసియున్నది. కేవలము ధనార్జనదృష్టి కాక వాఙ్మయోద్ధరణదృష్టి కల ఉదారులు అట్టిపనికి కడంగుట శ్రేయము.



శ్రీ యస్. రాధాకృష్ణ పండితులు

వీరు ఆక్స్ఫర్డు విశ్వవిద్యాలయమున భారతీయ వేదాంతవిద్యాగురువులుగ నియమింపబడిరి.

# కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రిగారు

జటావల్లభుల పురుషోత్తము

౧

బ్రహ్మశ్రీ కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రిగారు క్రీ. శ. ౨-౪-౧౮౬౩కు సరియైన రుధిరోద్గారిసంవత్సర చైత్ర శుద్ధ త్రయోదశీ గురువారమున తూర్పుగోదావరీ మండలమునందలి పలివెల గ్రామములో తమ మాతామహులగు మైలవరపు నరసన్నగారి గృహమున జనన మొందిరి. రాజోలునకు సమీపముననున్న కడలి గ్రామము శ్రీ శాస్త్రిగారి పూర్వుల నివాసము. వీరు తెలగాణ్య బ్రాహ్మణులు; గౌతమ సగోత్రులు. శాస్త్రిగారి ముత్తాతగారు కడలిని వీడి కాకినాడ పురములో నంతర్భాగమగు జగన్నాథపురములో నివాస మేర్పరుచుకొనిరి. నేటికిని శ్రీ శాస్త్రిగారు జగన్నాథపురములోనే స్వగృహములో నివసించుచున్నారు. వీరి తండ్రిగారగు బ్రహ్మావధాని గారు వారి పూర్వులవలెనే వేదశ్రౌతములలో గొప్ప పాండిత్యము గల్గియుండిరి. శాస్త్రిగారి తల్లిగారి పేరు సుబ్బమ్మగారు. సప్రసిద్ధ పండితులును, శ్రీరామవిజయ గ్రంథకర్తలును నగు సుబ్బయ్యశాస్త్రిగారు బ్రహ్మయ్య శాస్త్రిగారికి తమ్ములు. బ్రహ్మయ్యశాస్త్రిగారి జ్యేష్ఠ పుత్రులుగూడ బ్రహ్మయ్యనామాంచితులే. వారికుమారుడగు చిరంజీవి బ్రహ్మానందమును జూచినవారు తాతగారి ప్రతిష్ఠను నిలబెట్టువాడు కాగలడని చెప్పగలరు. శాస్త్రిగారి ద్వితీయపుత్రులు నరసింహమూర్తి సుబ్బయ్యశాస్త్రిగారికి దత్తుడు. సుప్రసిద్ధ సారస్వత సేవకులును, దేశభక్తులును నగు కోటమర్తి చినరఘుపతిరావు గారు బ్రహ్మయ్యశాస్త్రిగారి యల్లుడు. ఈ పుత్రపౌత్ర దౌహిత్రాది సంపత్తితో శ్రీ శాస్త్రిగారును, వారిధర్మపత్నియగు శ్రీమతి సూరమ్మగారును తమ వార్ధకమును సుఖముగ గడపుచున్నారనుటలో సందియములేదు.

శ్రీ బ్రహ్మయ్యశాస్త్రిగారు పిఠాపురము రాజావారి కళాశాలలో నాంగ్లవిద్య నభ్యసించిరి. మెట్రిక్యులేషను పరీక్షలో నుత్తీర్ణులై ఎఫ్. ఏ. పరీక్షకు చదువుచుండగా కుటుంబ పరిస్థితులను బట్టి వారు చదువు చాలించి యుద్యోగములో ప్రవేశింపవలసినవారైరి. ఆంగ్లపాఠశాలలో చదువుచున్న కాలముననే వీ రాంధ్రభాషలోని ప్రబంధాదికముల నన్నిటిని శ్రద్ధతో చదివిరి. ఆంగ్ల విద్యను ప్రారంభించుటకు పూర్వమే సంస్కృతమున పంచకావ్యము లను ముగించిరి. కళాశాలను వీడినపిమ్మట సిద్ధాంతకౌముదిని కట్టుదిట్టముగ జదివిరి. దానిపై వ్యాఖ్యానములను సక్రమముగ జదువకపోయినను నందలి ముఖ్య విషయములను బాగుగ పరిశీలించిరి. సంస్కృతాంధ్రాంగ్ల భాషలలో నిట్లు చక్కని ప్రవేశమును గల్పించుకొనిన పిమ్మట శాస్త్రిగారు సాదృశ్యభాషాశాస్త్రము(Philology) లో పరిశ్రమ చేసిరి. భాషాత్రయములో ప్రధానగ్రంథములను సాదృశ్యదృష్టితో పఠించిరి. ఈ సాదృశ్యపరిశీలనాసక్తి క్రమముగ సంఘమతవిషయముల లోనికి ప్రాకినది. హిందూక్రైస్తవాదిమతగ్రంథములను, మతాచారవ్యవహారములను వీరు చక్కగ నవగాహము చేసికొనిరి. తత్ఫలితముగ వీరి కదివరలోనే కల్గియుండిన గాఢమగు హిందూమతాభిమానము మరింత దృఢపడినది; హిందూమతమునకు తుల్యమగు మతమును, హిందూసంఘమునకు సమమగు సంఘమును లేవను నిర్ణయము వీరికి గల్గినది. వీరు హిందూమతముయొక్క స్థూలస్వరూపమును దెలిసికొనుటతో తృప్తినొందక హిందూమతవిజ్ఞాన సంబంధములగు వివిధశాఖలలో నతిసూక్ష్మములగు విషయములపైగూడ ప్రత్యేకజ్ఞానముల సంపాదించుకొనిరి. ప్రాయశ్చిత్తపరనిర్ణయము, పురాణస్థగ్రహణవిషయము మున్నగు నంశములపై వీరు వ్రాసిన వ్యాసములను చూచుచో వీరికి శ్రౌతము, జ్యోతిషము మున్నగు శాస్త్రములలో నెంతపాండిత్యముగలదో తెలియగలదు. గానకళ, నాట్యకళ మున్నగు కళలలోగూడ వీరికి విశేషముగ

ప్రజ్ఞ కలదు. యావజ్జీవము విద్యార్థిగ నుండుటచేతనే శ్రీ శాస్త్రిగారిన్ని విషయములలో గాఢమగు పాండిత్యమును సంపాదింపగల్గిరి. నేటికిఁగూడ వారే యాంధ్ర సాహిత్య పరిషద్గ్రంథాలయములోనో, యే కె. ఆర్. వి. కృష్ణారావుగారి లైబ్రరీలోనో పుస్తకముల నడుమనైచి కొని బాహ్యప్రపంచమును మరచియుండుట కాంచ నగును. నిరంతర గ్రంథపఠనమువలననే వారి కనుదృష్టి యెంతో పుడే నేత్రావరోధము గల్గినది. నాల్గేండ్ల క్రిందట మద్రాసులో కోమన్ నాయరుగారు వారికి మరల దృష్టినిచ్చిన నాటినుండియు శాస్త్రిగారు నూతనోత్సాహముతో గ్రంథకాలక్షేపము చేయుచున్నారు.

౩

శ్రీ శాస్త్రిగారు విశ్రాంతి నెఱుగని కర్మవీరులు. ప్రజాహితమునకు సంబంధించున నేకవిషయములలో వీరు మొదటినుండియు పనిచేయుచున్నారు. కాకినాడ ట్రెజరీ డిప్యూటీ కచేరీలో సుమారుగా నుండియుకూడ వీ రిన్ని పనులను జక్కఁబెట్టుకొనుట విశేషము. కరణాలను వీడినపిమ్మట వీ రీపనిలో ప్రవేశించి ముప్పదియేండ్లు పనిచేసి దీనినుండి విరమించి యిప్పుడు నెలకిరువదియారు రూప్యముల • ఉపకారవేతనమును దీసికొనుచున్నారు. ఆఫీసులో పనిచేసినంతకాలమును శ్రీ శాస్త్రిగారు తమవిధిని చక్కఁగ నిర్వర్తించి పై యుద్యోగుల మెప్పును బొందుచుండిరి. సాధారణముగా సమస్తాఫీసులో నంతపని చేసి యింటికివచ్చి పూర్ణవిశ్రాంతిని దీసికొందురు. శాస్త్రిగా రట్లుకాక ప్రతిదినమును కచేరినుండి తిరిగివచ్చుటతోడనే యుత్సాహముతో స్వయభిమాన వ్యాపారములలోనికి దుముకెడివారు. వారి వ్యాపారము ముఖ్యముగ నుపన్యాసము లిచ్చుటలోను, వ్యాసములను వ్రాయుటలోను నుండెను. వీనినిగూర్చి ముందు విచారింతము. ప్రజల ధార్మిక వైజ్ఞానికాభివృద్ధులకై వారు స్థాపించి పనిచేసిన సంస్థలను కొన్నిటి నిట పేర్కొనవలసియున్నది.

శాస్త్రిగారు విద్యార్థిగ నున్నపుడు మనదేశమునకు మహారాష్ట్రదేశమునుండి ధార్వాడనాటక సమాజము వారు వచ్చి క్రొత్తపద్ధతిపై నాటకముల నాడిరి. అవి మనదేశీయులను మిక్కిలి రంజింపజేసెను. కళాభిమానులగు శాస్త్రిగారానూతనపద్ధతిని నాటకకళను మనదేశమున వృద్ధి నొందింపవలెనను నూహతో 'ఆర్యబృందానంద సంధాయిని' యను పేరుతో నొక నాటకసమాజమును స్థాపించిరి. ఈ సమాజమువారు శ్రీ వీరేశలింగము పంతులుగారి 'శాకుంతలము' శ్రీ శాస్త్రిగారిచేతనే వ్రాయబడిన 'త్రిపురాసుర విజయ వ్యాయోగము' మున్నగు వాని నెన్నిటినో ప్రజారంజకముగ ప్రదర్శించిరి. కాలక్రమమున నీ సమాజము కాకినాడలోనే నూతనముగా బయలుదేరిన మరియొక సమాజములో లీనమయ్యెను.

శ్రీ శాస్త్రిగారు విద్యార్థిదశలో నున్నపుడే నవనాగరికతవలన హిందూమతమునకు వచ్చుచున్న ముప్పును బాగుగా గ్రహించి దానిని నివారించుటకై యనేకసాధనములను గనిరి. భగవద్భక్తిని ప్రజలలో గలుగజేయుట పరమకర్తవ్యమను నూహతో ౧౮౮౦ వ సంవత్సరమున వీరు 'భక్తసమాజ'మను నొకసమాజమును స్థాపించిరి. శాస్త్రిగారి నిర్మలభక్తి విశేషముచే నా సమాజము దినదినాభివృద్ధి నొందజొచ్చెను. ఆసమాజసభ్యులును శాస్త్రిగారు ననేకగ్రామములకు బోయి భక్తిపై నుపన్యాసము లిచ్చుచుండెడి. ఇటీవల నీ సమాజము హిందూమత బాలసమాజములో లీనమైపోయెను.

౧౮౯౨ వ సంవత్సరమున శ్రీ శాస్త్రిగారు "ఆర్యమతబోధిని" యను సభను స్థాపించిరి. అప్పటికి వారి వయస్సిరువది సంవత్సరములేయైనను కాకినాడలో సుప్రసిద్ధులైరి. శ్రీ కృత్తివెంటి పేర్రాజు గారు, శ్రీ నాళం పద్మనాభముగారు మున్నగు పెద్దలు వీరి మతాభిమానమును, కార్యదీక్షను మెచ్చుకొని వీరికి సహాయము నొసగజొచ్చిరి. 'ఆర్యమతబోధినీ' సభ కనుబంధముగ వివేకానంద పుస్తక భాండాగారమను నొక గ్రంథాలయము స్థాపింపబడెను. ప్రారంభమున జగన్నాథపురములో నుండిన యీ సమాజము తరువాత పెద్దవీథిలోని 'పురము' వారి సత్రములోనికి మార్చబడినది. అట సభ్యులు కూర్చుండుటకై బల్లలు, కుర్చీలు సంపాదింపబడినవి. పదిపదునైదు వార్తాపత్రికలు తెప్పింపబడుచుండెను. హిందూమత విజ్ఞానములపై గొప్ప యుపన్యాసములు

గావింపబడుచుండెను. హరికథా కాలక్షేపములుగూడ జరుగుచుండెను. ఈ సభాద్వారమున శ్రీ శాస్త్రిగారు చేసిన హిందూమతసేవ యపారము.

సనాతనమతముపై నాకాలమున హెచ్చుగ చెలరేగుచుండిన క్రైస్తవ బ్రాహ్మసామాజిక ప్రచారకుల బోధలు నిస్సారములని ఋజువుచేయుట తమ ముఖ్యకర్తవ్యమని శ్రీ శాస్త్రిగారు నిశ్చయించుకొనిరి. క్రైస్తవ ప్రచారకుల కెదురొడ్డి వారివలెనే వీధులలో బోధలుచేయుట యావసరమని గుర్తించి శాస్త్రిగారు ౧౮౮౪ వ సంవత్సరము మొదలుకొని యట్టిబోధల నెన్నిటినో చేసిరి. క్రైస్తవులవలెనే వీరును విషయముపై కరపత్రములను వ్రాసి పంచిపెట్టుచుండిరి. ఒక విధముగ ప్రజలలో మతావేశమును గలుగజేయుటకై వీరు వీధులవెంట భక్తిరసపూరితములగు పాటలను బాడుచు పోవుసమాజము నొకదానిని ౧౯౦౬ లో నెలకొలిపిరి. ఈసమాజమువారు పాడుటకై పాటలను, కీర్తనలను తామే రచించుచుండిరి.

భారతఖండమున నుద్భవించిన మహాపురుషులయు, నవతారపురుషులయు జయంతులను జరుపుట హిందూమత ప్రచారమునకు బాగుగ తోడ్పడగలదను నూహతో రామకృష్ణశంకరరామానుజాదుల జయంతులను వైభవముతో జరుపుచువచ్చిరి. నాడు శాస్త్రిగారిచే ప్రారంభింపబడిన శంకరజయంతి నేటికిగూడ కాకినాడలో జరుపబడుచున్నది. ఇటీవల దీనినిర్వహణభారమును మునిసపలు కోశాధికారులు వహించుచున్నారు.

శ్రీశాస్త్రిగారు హిందూమతవిజ్ఞానసేవకై పూనిన మఱియొకసాధనము "ఆర్యమతబోధిని" యను పక్షపత్రిక. వీరుదీనిని౧౯౦౫-వసంవత్సరముజనవరి౧-వ తేదీన ప్రారంభించిరి. అప్పటికే శాస్త్రిగారు హిందూమతమునకును, నాంధ్రసారస్వతమునకును సంబంధించిన వ్యాసములను వందలకొలదిగ వ్రాసి వివిధపత్రికలలో ప్రకటించియుండిరి. కాన యావదాంధ్రదేశమునను వారు సుప్రసిద్ధులైరి. "ఆర్యమతబోధిని" కి వేలకొలదిపాఠకులు బయలుదేరిరి. ఈపత్రికవలన నాంధ్రదేశమున బ్రాహ్మసామాజికులు మున్నగుసంస్కర్తల ప్రభావము తగ్గజొచ్చెనని శ్రీవీరేశలింగముపంతులుగారే యంగీకరించిరి. "వెయ్యాగా నెయ్యాగా నెట్టివాడే గలిచె నన్న శ్లేయన వ్రాతలు జనులను భ్రమపెట్టి నేను పూనినమహాకార్యమునకు గూడ విఘాతము కలిగించునని తోచుచున్నందున" సత్యవాదిని యనుపత్రికను ప్రారంభించితినని వీరేశలింగముపంతులు వ్రాసికొనియున్నారు. ఆర్యమతబోధిని సుమారు పదునైదు సంవత్సరములు హిందూమతవిజ్ఞానములకు నిరుపమానమగు సేవను జేసినది.

పైవిషయములనన్నిటినిగమనించుచో శ్రీశాస్త్రిగారు కేవలము వక్తలును, రచయితలును మాత్రమేకాక గొప్పనిర్మాణకౌశలముగలవారనియు, హిందూమతాభిమానప్రచారోత్సాహములు వారి కొకప్పుడావేశముచే వచ్చి మఱియొకప్పుడు పోవునవి గావనియు, నేబదియైదు సంవత్సరములనుండి వారు నిరంతరముగనచంచలబుద్ధితో హిందూమతసేవ చేయుచున్నారనియు తెలియగలదు.

౪

ఎచ్చటనైనను హిందూమతమును నిరసించుచు నొక యుపన్యాసము జరిగియున్నగాని, యొకవ్యాసము ప్రకటింపబడియున్నగాని శ్రీశాస్త్రిగారు దానికి వెంటనే సమాధాన మిచ్చుచుందురు. అంతియేకాదు, హిందూమతమును న్యాయవిరుద్ధముగ పరిహసనమునకు బదులు ప్రహసనమును, కరపత్రములు కరపత్రములకు, నాటకమునకు బదులు నాటకమును, వ్యాసమునకుబదులు వ్యాసమును నిచ్చుటయే శాస్త్రిగారి కలవాటు. ఆంధ్రదేశమున హిందూమత సంఘములను హెచ్చుగ నిరసించి సంస్కరింపబూనినవారు శ్రీకందుకూరివీరేశలింగముపంతులుగారగుటచే సహజముగ వారే శాస్త్రిగారిప్రతిపక్షులలో ప్రధానులైరి. శ్రీశాస్త్రిగారు శ్రుతిస్మృతిపురాణేతిహాస సదాచారనిబద్ధమగు హిందూమతములో లేశమాత్రముమార్పును గూడ చేయుట కంగీకరింపని స్వచ్ఛమగు పూర్వాచారపరాయణులు. పంతులుగారన్నచో యుక్తిని, కాలమును బట్టి మతసంఘములలో నెట్టిమార్పునైనను చేయవచ్చునను వాదములోనివారు.

శాస్త్రిగారి మతసంఘవిషయకములగు వ్యాసములును, నుపన్యాసములును జాలవఱకు ప్రతిపక్షుల ప్రేరణ

వలన బయలుదేరినవే. ఉదాహరణములుగ కొన్నిటిని జూతము. ఢిల్లీదర్బారుసందర్భమున నొకసభలో శ్రీ రఘుపతి వెంకటరత్నమునాయుడుగారు ప్రసంగించుచు బ్రిటిషువారు వచ్చినపిమ్మటనే శూద్రులస్థితి బాగుపడిన దనియు, నంతకు బూర్వము వారు బ్రాహ్మణులచే నణగ ద్రొక్కబడియుండిరనియు నుడివిరి. దీనికిబదులుగ శ్రీశాస్త్రిగారు 'బ్రాహ్మణులు శూద్రులకన్యాయము చేసిరా?' యనునొక చిన్నపొత్తమును వ్రాసిరి. ఇందులో శాస్త్రిగారు స్మృతులనుండియు, మహాభారతము, శుక్రనీతి మున్నగుగ్రంథములనుండియు ననేకప్రమాణవాక్యములను, నుదాహరణములను గుప్పించుచు శూద్రు లెన్నడును నీచముగ జూడబడలేదనునంశమును మిక్కిలి దక్షతతో నిరూపించిరి. మఱియొకప్పుడు కాకినాడబ్రాహ్మసామాజికులు శివలింగ మశ్లీలార్థబోధకమని నిండుసభలో నుడువుటచే దానికి సమాధానముగ శ్రీశాస్త్రిగారు శివలింగము యోగిరూపమున భావింపబడిన శివుని శిరస్సను సిద్ధాంతమును దేల్చుచు బహుశాస్త్రపరిశ్రమఫలితమగు నొకవ్యాసపరంపరను పత్రికలలో ప్రకటించిరి. ఒకతూరి వీరేశలింగముపంతులుగారు వితంతుకేశఖండనమును, పరలోకములో దంపతులు కలియుదురను హిందూభావమును పరిహసించుచు 'నారదసందర్శన'మను నొక ప్రహసనమును వ్రాసిరి. శ్రీశాస్త్రిగారు దానికి సమాధానముగ 'పర్వతనారదసందర్శన'మను నొక ప్రహసనమును వ్రాసిరి. ఒకతూరి బ్రాహ్మసామాజికులు తమమందిరమున జరిగిన సభలో విగ్రహారాధనము తుచ్ఛమనియు, హేయమనియు నిందించిరి. అంత శాస్త్రిగారు విగ్రహారాధనమును గూర్చినవాదప్రతివాదములు బహిరంగసభలో జరుగగా దాని సత్యస్వరూపమును జనసామాన్యము గ్రహింపగలదనియు తామట్టిబహిరంగసభ నేర్పఱతుమనియు, దానికి బ్రాహ్మసామాజికులు దయచేయవలె ననియు సవాలు నంపిరి. దీనికి ఫలితముగ నేర్పడిన బహిరంగసభలో శ్రీబ్రహ్మయ్యశాస్త్రిగారు విగ్రహారాధనమును సమర్థించుచు నిచ్చినయుపన్యాసము హిందూమతవాఙ్మయములో సువర్ణాక్షరములతో లిఖించుటకు దగియున్నది.

శ్రీశాస్త్రిగారు తమ నమూల్యవ్యాసములలో పరిష్కరించిన హిందూమతసంఘవిషయకములగు సమస్యలెన్నియో కలవు. 'శ్రీకృష్ణుడు జారుడా?' 'గణాధిపతి!' 'శివస్మృత మేది?' 'హిందూమతముయొక్క యావశ్యకత' 'త్రిమతములు' మున్నగువ్యాసములు హిందూమతమును గూర్చి యెఱుగగోరువారెల్లరు చదువవలసినవే. రజస్వలావివాహవితంతువివాహాదులను యుక్తిచేతను, శాస్త్రాధారముచేతను ఖండించుటలో వీరినిమించినవారు లేరని చెప్పవచ్చును.

హిందూవిజ్ఞానమునుగూర్చి కూడ శ్రీబ్రహ్మయ్యశాస్త్రిగారు చాల నమూల్యవ్యాసములను వ్రాసియున్నారు. ఆధునికపాశ్చాత్యులు పరిశోధనచే కనుగొనిన ప్రకృతిశాస్త్రవిషయములు మన ప్రాచీనగ్రంథములలో వ్రాయబడియేయున్నవను నంశము నీవ్యాసములు వ్యక్తముచేయును. 'జగము సృజింపబడినదా?' 'భూమి తిరుగుచున్నదా?' 'రాశిచక్రము, దాని వర్తులత్వము,' 'భూమితిరుగుట కాధారమేమి?' 'భూమియొక్క యాకర్షణశక్తి,' 'పంచభూతములు,' 'గ్రహణకారాదర్పణము;' 'రామాయణమునందలి వానరు లెవరు?' మున్నగువ్యాసములు శ్రీశాస్త్రిగారి యసమానప్రాక్ప్రతీచీవిజ్ఞానసమ్మేళనమును వెల్లడించును.

౫

శ్రీ బ్రహ్మయ్యశాస్త్రిగారి యఖండపరిశోధనవిమర్శనాచాతుర్యము వారిహిందూసంఘమతవిజ్ఞానవిషయకవ్యాసములలోనే కాక సారస్వతవిషయకవ్యాసములలోగూడ వ్యక్తమగుచున్నది. శ్రీశాస్త్రిగారికలము హిందూత్వమును, సారస్వతమును గూడ సమముగనే సేవించినది.

శ్రీశాస్త్రిగారు మొట్టమొదట విమర్శించిన గ్రంథము శ్రీవీరేశలింగముపంతులు గారి రాజశేఖరచరిత్రము. శాస్త్రిగారి సారస్వతవిమర్శన మెంతలోతుగ బోవుచుండునో తెలియుటకై యీవిమర్శనుండి రెండుదాహరణములను జూపుచున్నాను. పంతులుగారు రాజశేఖరుడుగారియింటిని విపులముగ వర్ణించియున్నారు. ఆవర్ణన

ప్రకారము గృహము నిర్మింపబడుట యసంభవమని శ్రీశాస్త్రిగారు సయుక్తికముగ నిరూపించినారు. మఱియు రాజశేఖరుడుగారు మంచిముహూర్తమున బయలుదేరినను దారిలో దొంగలబాధ కల్గినదని పంతులుగారు వ్రాసిరి. పంతులుగారు రాజశేఖరుడుగారి ప్రయాణమునకై కల్పించినముహూర్తమును శాస్త్రిగారు జ్యోతిషశాస్త్రముచే పరిశీలించి యాముహూర్తము చోరపంచకమున బడినదనియు, కావున మార్గమున చోరబాధ గల్గుటలో నాశ్చర్యము లేదనియు, జ్యోతిషశాస్త్రము సత్యమైనదనుటకు పంతులుగారు గల్పించిన యుదాహరణమే చాలుననియు తేల్చిరి. ఈవిమర్శనము 'వివేకచంద్రికావిమర్శన' మను పేర ౧౮౯౬లో ప్రకటింపబడినది. దీనికి రెండుసంవత్సరములపిమ్మట శాస్త్రిగారు వీరేశలింగముపంతులుగారు మంత్రిభాస్కరుని గూర్చి వ్రాసినయంశములను ఖండించుచు 'భాస్కరోదంత' మను వ్యాసమును వ్రాసి ప్రకటించిరి. ౧౯౦౧వ సంవత్సరమున శాస్త్రిగారు 'నన్నయభట్టారకచరిత్రము' ను ప్రకటించిరి. ఇందు శాస్త్రిగారు తేల్చిన యనేకసిద్ధాంతములు నేటివఱకును నాంధ్రసారస్వతప్రపంచమున ప్రమాణములై యొప్పుచున్నవి. మనువసుచరిత్రలపై శాస్త్రిగారెన్నియో వ్యాసములను వ్రాసియున్నారు. అందొకటి వెన్నేటిరామచంద్రరావుగారివ్యాసమునకు సమాధానముగ వ్రాయబడినది. మనుచరిత్రకంటె వసుచరిత్ర ప్రశస్తమైనదని శాస్త్రిగారివాదము. శ్రీశాస్త్రిగారు గావించిన మఱియొకయుత్కృష్టవిమర్శనము "కురుపాండవదాయభాగనిర్ణయము." ఇందు రాజ్యము ధృతరాష్ట్రునిదేకాని పాండురాజుది కాదని నిరూపింపబడినది. ఇందు శ్రీపాదకృష్ణమూర్తిశాస్త్రిగారు మున్నగువారు బ్రహ్మయ్యశాస్త్రిగారికి ప్రతికక్షులై యుండిరి. పాండవులు న్యాయస్థులనియు, కౌరవు లన్యాయముచేసినవారనియు చిరకాలమునుండి హిందువులు నమ్ముచున్నారు. ఈయభిప్రాయమును శాస్త్రిగారనేకసభలలోను, పత్రికలలోను ఖండించియున్నారు. శాస్త్రిగారు పూర్వాభిప్రాయముల నన్నిటిని గ్రుడ్డిగ నంగీకరించువారు కారని దీనివలన తెలియగలదు. పైనపేర్కొనబడిన సారస్వతవిమర్శలనేకాక శ్రీశాస్త్రిగారు "ఆంధ్రకవితానురక్తకవిత్వాదిప్రశంస", "అప్పకవి పోలనామాత్యులు", "ఉత్తరరామచరిత్రయందలి రసవిచారము" మున్నగు సారస్వత విమర్శనముల నెన్నిటినో వ్రాసిరి.

శ్రీశాస్త్రిగారు భాషాశాస్త్రవిషయక రచనలను గూడ గావించియున్నారు. "కాగడా" యను చిన్న పొత్తములో వీరు "కాగడా" శబ్దచరిత్రను విచారించియున్నారు. "అఱవములోని వింతయక్కరము తెలుగున గలదా?" యను శీర్షికతో వీరు వ్రాసిన వ్యాసములు మిక్కిలి ప్రశస్తములై యున్నవి. ఇంకను "దాసశబ్దార్థచంద్రిక" మున్నగు వ్యాసముల నెన్నిటినో వ్రాసియున్నారు.

౬

ఆంధ్రభాషలో బ్రహ్మయ్యశాస్త్రిగారు రచించినంతవిమర్శనావాఙ్మయమును మఱియొకరు రచించియుండలేదనుటలో నతిశయోక్తి లేదు. ఆంధ్రదేశమున విమర్శను ప్రారంభించినవారు వీరే యనువంశమును కొందఱంగీకరింపకపోయినను ప్రారంభకులలో వీరొకరని యందఱు నంగీకరింతురు. ప్రాశస్త్యవిషయములోగూడ వీరి విమర్శన మగ్రేసరమని నమ్మువారు చాలమంది కలరు. ఈ హేతువులచేత వీరి కాంధ్రసారస్వతసభవారు 'విమర్శకాగ్రేసర' బిరుదము నిచ్చియుండుటలో నాశ్చర్యము లేదు. ఆంధ్రదేశమున నేడు 'బ్రహ్మయ్యశాస్త్రి' 'విమర్శకాగ్రేసర' పదములు పర్యాయపదములుగ వాడబడుచుండుటచేతనే వీరి విమర్శకాగ్రేసరత్వము నాంధ్రులెల్లరు నెట్లంగీకరించినదియు వ్యక్తము కాగలదు. వీరివిమర్శనము సమగ్రముగనుండును. చెప్పవలసిన దేదియు మిగులదు. ప్రతిపక్షుల వాదములోని యొక్కొక్కయంశమునే తీసికొని దానిని రాచి రంపమునబెట్టుట వీరికి పరిపాటి. ఒక్కయంశమును సాధించుటకనేకములగు నుదాహరణములను విశేషమగు యుక్తివాదమును జూపుటయు ప్రతివాది చిత్తయినాననుసంగతి పాఠకునకు దెలిసినపిమ్మటకూడ నదేపనిగ బాదుచుండుటయు వీరివిమర్శలోనిలోపములని కొందఱు తలతురు. కాని శాస్త్రిగారనవసరముగనెచ్చోట్ల విమ

ర్శనాకౌశలమును ప్రదర్శించువారు కారని సానుభూతితో వారిరచనలను జదువువారికి తెలియగలదు.

మొత్తముపైన బ్రహ్మయ్యశాస్త్రిగారొక వినాశక విమర్శకులని చెప్పవచ్చునని కొందఱు తలంతురు. కాని యది న్యాయ్యముకాదు. ఏలన: (1) శ్రీశాస్త్రిగారి విమర్శలలో వినాశనమేకాక నిర్మాణముకూడ హెచ్చుగ గలదు వారు ప్రతిపక్షులు చెప్పినది కాదని బుజువు చేయుటతో తృప్తినొందరు. వారు విమర్శించుచున్న యంశముయొక్క సత్యస్వరూపమును పాఠకునకు తెల్పుదురు. మతవిషయములోను సారస్వతవిషయములోను నితరులెవ్వరును తెల్పియుండని యనేకనూతనాంశములను వారు తెల్పియున్నారు. ఒకరిని విమర్శించుమిషతో తెల్పినంతమాత్రమున నీయమూల్యాంశములన్నియు వినాశకగ్రంథములలో జేరవలసినవేనా? కృష్ణు డర్జునుని నిమిత్తమాత్రునిగ జేసికొని లోకమునకు మహాసత్యములను చాటినట్లే శ్రీశాస్త్రిగారు ప్రతిపక్షులను నిమిత్తమాత్రముగ చేసికొని యాంధ్రలోకమునకు మహావిషయములను చాటియున్నారు. శాస్త్రిగారును, వారి ప్రతిపక్షులును గతింపవలసినవారే. కాని శాస్త్రిగారు ప్రతిపక్షులను నిమిత్తముగ చేసికొని చెప్పినయంశముల నాంధ్రాళి చిరకాలము కంఠస్థముచేసికొని గౌరవింపగలదు. (2) శాస్త్రిగారొక్క విమర్శకులుమాత్రమే కారు. వారు విమర్శయొక్కటియు వ్రాయకుండినను నాంధ్రులచే చిరకాలము స్మరింపబడదగిన రచనలను, సేవను జేసియున్నారు.

౬

శ్రీ బ్రహ్మయ్యశాస్త్రిగారు సారస్వతమునకు సంబంధించిన శాఖలన్నిటిలోను కూడ స్వతంత్రగ్రంథములను వ్రాసియున్నారు. మంగతాయి, సైంధవవధ, ఉత్తరసరస్వతీనారదవిలాపము, వీరరాఘవము నను నాటకములును, వేనురుపాకజనార్దనశతకమును, ప్రశ్నోత్తరపద్యములను చిత్రపద్యావళియు, కోకిలగీతము, భారతీస్తుతిగీతములు, గణికాపుత్రిక, అభినవకవితాప్రశంస, ఆంధ్రకవితామాహాత్మ్యస్థాపనము అను ఖండకావ్యములును, రావణచరిత్ర, సుభద్రావిజయము (ద్వ్యర్థికావ్యము) నను గద్యకావ్యములును, మనుష్యావయవసంఘసంస్కారసభ, మనమోహములకు చెల్లువేసికొందుముగాక!, అప్పుడు ఇప్పుడు, రూపాయదండకము, ముద్దులు - ముచ్చట్లు నను హాస్యగ్రంథములును, సీతాలక్ష్మణసంవాదము(విగ్రహారాధనముగూర్చి), రామకృష్ణసంవాదము (శారదా శాసనముగూర్చి), గోమహిషసంవాదము (గ్రాంథికవ్యావహారికభాషలనుగూర్చి) నను సంవాదములును, తారకతారావళి నిర్గద్యనిరోష్ఠ్యనిష్కంఠ్యజీర్ణచేలచరిత్రయు, విజారలచారి, నాటింఖలలోకసందర్శనము నను పద్యకావ్యములును, సీతాకల్యాణమను హరికథయును, దీపావళీవర్ణనము, మద్యపాననిషేధము, శ్లోకమ్ముడుబండి యను సీసమాలికలును పేర్కొనదగియున్నవి. వీరిరచనలలో హాస్యము ప్రధానముగనుండును.

శ్రీశాస్త్రిగారు చారిత్రకగ్రంథములనుగూడ వ్రాసియున్నారు. తునిసంస్థానమువారు వీరిచేత రెండేండ్లుద్యోగమునకు సెలవుపెట్టించి యాకాలములో తామే వీరికుటుంబమును పోషించుచు వీరిచేత పెద్దాపురసంస్థానచరిత్రను వ్రాయించిరి. నెయ్యూనాయపదార్లు వీరికి బహుమానము నిచ్చిరి. ఈగ్రంథము చదువువారికి శాస్త్రిగారి చారిత్రకపరిశోధనాదక్షత యవగతము కాగలదు. శ్రీశాస్త్రిగారు వ్రాసిన యితరచరిత్రములలో 'మాధవవిద్యారణ్యులవారు,' 'శిష్టుకృష్ణమూర్తికవి,' 'చేమకూరి వేంకటకవి,' 'కృష్ణదేవరాయలు,' 'సంకుసాల నృసింహకవి,' 'నారాయణభట్టు,' 'సారంగులమ్మయ్యకవి,' 'భీమకవి,' 'పిల్లలమఱ్ఱిపినవీరభద్రుడు,' 'నాచనసోముడు' అనునవి పేర్కొనదగును.

శాస్త్రిగారు లలితకళలనుగూర్చికూడ వ్రాసియున్నారు. వీరు దేశ్యాన్యతగానములనుగూర్చి డెబ్బదిపుటల గ్రంథమును రచించియున్నారు 'కవిత్వము - చిత్రలేఖనము' నను వ్యాసములో నీరెండుకళలకు గల సంబంధమును వివరించియున్నారు. శాస్త్రిగారికి చిత్రరచనలో మంచిప్రావీణ్యము కలదు. విమర్శవ్యాసములలో నిగూఢమగు కొన్నిభావములను స్పష్టపఱచుటకై వారు పటములను గీసి చూపుచుందురు.

సారస్వతములోవలెనే మతవిషయములోఁగూడ శ్రీ శాస్త్రిగారు వివాదాస్పదములుగాని సర్వజనసమ్మతములగు రచనలను గావించియున్నారు. వీనిని హిందువులలోని సంస్కర్తృగణమేకాక మతాంతరులుగూడ మెచ్చుకొందురు. వీ రుద్యోగములో నుండినకాలమున క్రైస్తవులగు పాశ్చాత్యులచే నడుపబడుచుండిన రవి పత్రిక యిట్లు వ్రాసినది: "బ్ర. శ్రీ. కే. బ్రహ్మయ్యగారు - వీరు రవిపత్రికకు నుపవిలేఖకులుగ నుండి తరుచుగా మంచివిషయములను చక్కనిశైలిని వ్రాయుచుండెడివారు. వీరు కలెక్టరుకచ్చేరీలో అక్కౌంట్సు డిపార్టుమెంటులో లేఖకులుగ నుండిరి. వీరి నిప్పుడు కొవ్వూరుతాలూకాకు బదలీచేసిరని విని మేము చాలగ విచారించుచుంటిమి. వీరి మతభావములతో మేమేకీభవింపకపోయినను విద్యార్థుల హృదయములలో దేవునియందు భక్తినియు, సన్మార్గప్రవర్తకులై యుండుట పరమధర్మమనియు నవకాశముదొరికినప్పుడెల్ల వీరు బోధించుచుండిరని విని చాలగ సంతసించుచుంటిమి. ఉపన్యాసపీఠమునుండి వీరు చెప్పువిషయములు మృదుమధురములై ఆహ్లాదకరములుగ నుండునని విద్యార్థులవల్లను, ఉపాధ్యాయులవల్లను వినియుంటిమి. విశ్రాంతిదొరికినప్పుడెల్ల తెలుగుభాషావిషయమగుకృషిలోనే వీరుకాలముపుచ్చెడువారు. ఇట్టివారి సాంగత్యము కాకినాడ కింతటినుండి దొరకజాలదనియు, వీరినాయకత్వము విద్యార్థులకు తప్పుచున్నదనియు వగచుచున్నాము. వీరి నీపురమునందే నిలుపుతెరవును భాషాభిమానులగు అధికారులాలోచింతురని కోరదగియున్నది." ఇట్టి విజ్ఞాపనలవలన శ్రీశాస్త్రిగారి బదలాయింపు కొలదిదినములలోనే రద్దుచేయబడినదని తెల్పుట యిందు నప్రస్తుతము కాదు.

బ్రహ్మయ్యశాస్త్రిగారి రచనలను గూర్చిన యొక శోచనీయాంశమేమన: వానిలో చాలభాగ మిప్పుడేమూలనో ప్రాత పత్రికలలో పడియున్నవేకాని గ్రంథరూపమున లేవు. మతవిషయకములగు వ్యాసములను కొన్నిటిని సంగ్రహించి శ్రీ నందిరాజు చలపతిరావు పంతులుగారు 'ఉపన్యాస పయోనిధి' యను పేరుతో నైదువందల పుటలుగల సంపుటము నొకదానిని ముద్రించి ప్రకటించిరి. శాస్త్రిగారి రచనల నన్నిటిని గలిపిన నిట్టి సంపుటము లిరువది కాగలవు. పత్రికలలో ప్రకటింపబడిన పెద్దవ్యాసములలో కొన్ని యొక్కొకటొక్కొక చిన్ని పొత్తముగ ముద్రింపబడినవి. ఇదివఱలో ముద్రితములై యున్న గ్రంథములుగూడ నేడు కొనదలచువారికి లభింపవు. శ్రీ శాస్త్రిగారి యీ యమూల్య విధానము వలన రాగల్గిన లాభమును నేటి యాంధ్రలోకమే కాక రాబోవు తరములవారు గూడ పొందునట్లు వారిరచనలను సంపుటములుగ ప్రకటించు బాధ్యత యుదారులగు నాంధ్రులపై గలదు. శ్రీ శాస్త్రిగారు హిందూమత సముద్రమును తరిచి బయటకుబెట్టిన యమూల్యరత్నములు నేడో రేపో వాడిపోవుపుష్పములవలెకాక చిరకాల మాంధ్రులు గర్వముతో ధరింపదగిన కంఠహారములుగ నేర్పఱచుటకు తగియున్నవి గాన వానిని సంపుటరూపమున కూర్పవలసిన బాధ్యత మఱింత హెచ్చుగ కలదు.

వ్రాతలోను, వక్తృత్వములోను గూడ సమానచాతుర్యము గల కొలదిమందిలో శ్రీ బ్రహ్మయ్యశాస్త్రిగా రొకరు. శాస్త్రిగారి వ్యాసములను ప్రకటించియుండని పత్రికలవలెనే వారియుపన్యాసములను వినియుండని పట్టణములు గూడ మిక్కిలి కొలదిగ నుండును. వీరియుపన్యాస మెందు దుడుకుబాటులేని గంగాప్రవాహమువలె నుండును. సభలో ప్రతిపక్షు లెంత యల్లరి చేయబూనుకొనినను తొణకక బెణకక మాట్లాడుటలో వీరు పేరొందిరి. వీరు మాట్లాడుచున్నప్పు డెవరైన నడ్డుప్రశ్నలను వేయుచో నప్పుడు వీరుకనుపఱచెడు సమయస్ఫూర్తి మిక్కిలి ప్రశంసనీయము. మృదుమధురములగు పదములతోనే యెట్టి తీవ్రభావమునైనను వెల్లడించుటలో వీరు కడునేర్పరులు. వీ రుపన్యాసములలో గూడ గ్రాంథికభాషనే వాడుదురు. వీరసంఖ్యాకములగు సభలలో నుపన్యసించుటయేకాక కొన్నిముఖ్యసభల కధ్యక్షతనుగూడ వహించియున్నారు. అట్టిసభలలో యావదాంధ్రదేశమునకును సంబంధించిన ఆంధ్రసారస్వతసభయు (బరంపురములో జరిగినది), నిఖిలాంధ్రదేశ వర్ణాశ్రమధర్మమహాసభయు (గుంటూరులో జరిగినది) పేర్కొనదగినవి.

౧౦

బాలుని మొదలు వృద్ధునివఱకును, పామరుని మొదలు పండితునివఱకును గల యందఱిపట్లనుగూడ శ్రీ బ్రహ్మయ్యశాస్త్రిగారు మిక్కిలిమర్యాదతోను, ప్రేమతోను మెలగుచుందురు. వారిరూపమునుండియు, మాటలనుండియుగూడ శాంతరస ముట్టిపడుచుండును. పొడుము, కాఫీ మున్నగు నలవాట్లేమియు వారికి లేవు. వారు న్యాయ్యమని నమ్మినదానిని చేయుట కెన్నడును భయపడలేదు. వారు ప్రభుత్వమువారి కొలువులోనుండియుగూడ తమదేశము బ్రిటిషువారు వచ్చినపిమ్మటనే బాగుపడినదనుభావము నెన్నడును సహింపరైరి; మనపూర్వుల పరిపాలనాప్రాశస్త్యమునుగూర్చి వ్రాసియుండిరి. మహాసారస్వతసేవకై శాస్త్రిగారుగావించిన స్వార్థత్యాగము మిక్కిలి ప్రశంసనీయము. ఆసేవలో వారు నిమగ్నులై తహసీల్దారీ మున్నగు పదవుల కర్హత గల్గించు పరీక్షలకు చదువుటనుగూడ మానుకొనిరి. శ్రద్ధపట్టినచో నాదినములలో శాస్త్రిగారు తహసీల్దారు పదవికి చేరుకొనుట యొకకష్టము కాదు. కాని వారి దృష్టి నిరంతరము వారుతలపెట్టిన మహాకార్యములపైననే యుండెను. శ్రీశాస్త్రిగారికి నుద్యోగవేతనముగాక భూములపై సంవత్సరమునకు సుమారు మూడువందల రూప్యములు వచ్చుచుండెను. ఇట్టిస్థితిలోగూడ వారు స్వీయవ్యయముతోనే పుస్తకములు, కరపత్రములు మున్నగునవి ప్రకటించుట, యుపన్యాసములకై దేశాటనము చేయుట మున్నగునవి తలచుచో వారు తలపెట్టిన కార్యమునకై తా రెంతత్యాగము చేసినదియు తెలియగలదు. అంతేకాక వీరికిగల మతాభిప్రాయములకు వీ రెన్నియోబాధలు పడిరి. పైన పేర్కొనబడిన కొవ్వూరు బదలాయింపట్టిబాధలలో నొకటిమాత్రమే.

౧౧

నేటియాంధ్రదేశమున శ్రీశాస్త్రిగా రనేకవిధములచే నద్వితీయస్థానము నలంకరించియున్నారు. వారివలె నేబదియైదుసంవత్సరములు నిర్విఘ్నముగ సంఘమతసారస్వత సేవచేయుభాగ్యముగలవా రుండుట యరుదు. ఆంధ్రదేశము వీరికి చూపవలసినగౌరవమును పూర్ణముగ గాకపోయినను కొంతవఱకైనను ప్రదర్శించినది. నేడు యావదాంధ్రదేశములోను విఖ్యాతులైన కొలదిమంది యాంధ్రులలో వీరొకరు. గడచినరెండుసంవత్సరములలో వీరి నాంధ్రదేశములోని వివిధప్రాంతములవారు తీసికొనిపోయి యథాశక్తిని గౌరవించియున్నారు. వివిధసంస్థలవారును, వివిధప్రాంతములవారును వీరి కనేకములగుబిరుదముల నిచ్చియున్నారు. ఈమార్చినెలలో యావదాంధ్రదేశపక్షమున నొకగొప్పసన్మానము వీరికి కాకినాడలో జరుగుచున్నది. ఎవ రెన్నిసన్మానములను గావించినను శ్రీశాస్త్రిగారు ప్రజలుతమరచనలవలన పొందదగినలాభమునంతను పొందిననేకాని తమజన్మము సఫలమయినదని నమ్మరు.

---



అగ్ని నాట్యము-కన్నులు, నాట్యము ఉజ్జ్వలముగ నున్నవి. P. P. A.



మిస్. శకుంతల (భానుమతి)
ద్రౌపదీ వస్త్రాపహరణము, సరస్వతీటాకీసు, బెజవాడ.

డాక్టరు నేలటూరి వెంకటరమణయ్యగారి

# విజయనగర సామ్రాజ్య తృతీయవంశచరిత్ర పరిశోధనలు *

డా. పుట్టపర్తి శ్రీనివాసాచార్యులు

విజయనగరసామ్రాజ్యచరిత్రము గూర్చి మొన్న మొన్నటివరకును చరిత్రకారులు శ్రద్ధ తీసుకొననేలేదు. 'విస్మృతసామ్రాజ్య'మని సూయల్ దొరగారు రమారమి 30 ఏండ్లక్రిందట ఒకపుస్తకము ప్రకటించినప్పుడు హీరాస్ దొరగారి ఆరవీటివంశచరిత్ర మచ్చుపడువరకును విజయనగరసామ్రాజ్యమును గూర్చి వ్రాసినచరిత్రకారులు నలుగురే. వీరిలో కృష్ణస్వామిఅయ్యంగారును, కృష్ణశాస్త్రులును శాసనములపైననే యాధారపడిరిగాని కైఫీయతులను, ప్రబంధాదిసమకాలీన గ్రంథములను సమగ్రముగ పరిశోధింపరైరి. చిలుకూరివీరభద్రరావుగారును, మల్లంపల్లి సోమశేఖరశర్మగారును ఇట్టిపని కుపక్రమించి సమగ్రముగ కృషిజేసి కార్యము నిర్వహింప శక్తికలవారలైనను కార్యాంతరములచే నీచారిత్రక భాగమునకు సంపూర్ణదృష్టి నొసగరైరి.

ఇట్టిస్థితిలో విజయనగరసామ్రాజ్యమునుగూర్చి జరిగిన పరిశోధనమంతయు విజయనగరరాజుల చరిత్రమును గురించియేగాని, ఆకాలపు రాజ్యవిధానమును గూర్చిగాని, దేశపరిస్థితులనుగూర్చిగాని సమగ్రముగ తెలుపుటకై ఒక్కరును ప్రయత్నింపరైరి. ఇట్టిలోపమును నివారించుటకై మల్లంపల్లి సోమశేఖరశర్మగారు "విజయనగరసామ్రాజ్యవిధానము"ని శారదలో రెండు వ్యాసములను ప్రకటించినను అవి తెలుగునందుండుట చేతను, శారదాపత్రిక త్వరలోనే అంతరించిపోవుటచేతను, శర్మగారు మరల ఆవిషయమై ఎచ్చటను వ్రాయనందునను ఆవిషయమునుగూర్చి ఏమాత్రము జనబాహుళ్యమునకు తెలియకపోయెను. ఇట్టి సందర్భమున డాక్టరు సాలెతొరేగారు "విజయనగరసామ్రాజ్యమునందలి రాజకీయ సాంఘికపరిస్థితులు" అని రెండు పెద్దసంపుటములను ప్రకటించిరి. రాజకీయచరిత్రమునకన్న సాంఘికజీవనముపైనను, రాజ్యతంత్రముపైనను చరిత్రకారుడు దృష్టిని ప్రధానముగ కేంద్రీకరింపవలెనని యభిప్రాయపడు నేటి పాశ్చాత్యచరిత్రకారుల యుపదేశానుసారముగ తయారుజేసిన ఈగ్రంథమునందు ఉపయోగకరములైన యంశము లెన్నియో కలవనుటలో నాశ్చర్యమేమున్నది? ఇంతేగాక ఇటీవల కుందూరి ఈశ్వరదత్తుగారుకూడ విజయనగరరాజ్యతంత్రమునుగూర్చి కొన్ని వ్యాసములను ప్రకటించిరి.

అట్లైనను ప్రత్యేకముగ విజయనగరసాంఘికాది పరిస్థితులను గూర్చి ఇంకొకసమగ్రమైన బృహద్గ్రంథ ముండవలసినయావశ్యకత డాక్టరు వెంకటరమణయ్యగారి గ్రంథమువలననే నిరూపణమగుచున్నది. వెంకటరమణయ్యగారి గ్రంథమున గోచరించు విశేషవిషయము లివి:

మొట్టమొదటనే ఎన్నదగినవిషయము కాలపరిమితి. డాక్టరుసాలెతొరేగారు ఒకపరిమితమైన రాజ్యకాలమును నిర్ణీతముజేసికొనక ప్రతిష్ఠాపకులదగ్గర నుండియు ప్రతివిషయముయొక్క పరిణామమును స్థూలముగ సూచించుచువచ్చినందువలన, విజయనగరకాలమునకే వర్తించుపరిణామము నిశితముగ బోధపడుటలేదు. తృతీయవంశకాల మంతయు రెండుమూడుతరములకు మించదు కాన అంతమాత్రముకాలమును ఒకవిభాగముగ దీసికొని ఆవిభాగమునందలి పరిణామమునే తెల్పుచు వచ్చుట ఈగ్రంథమునందలి విశేషము.

ఇంకొకవిషయమునగూడ డాక్టరు వెంకటరమణయ్యగారు ఉత్తమమార్గము నవలంబించిరి. ఉత్తమచరిత్రకారుని యాదర్శము విషయప్రదర్శనముమాత్రమే.

* మదరాసు విశ్వకళాపరిషత్తు ప్రచురణము. వెల రు. ౫-౦-౦

సాంఘికపరిస్థితు లెట్టులున్నవో చూపి వానిగుణదోషము లనుగూర్చి చదువరులే నిశ్చయించుకొనునట్లు చేయుట చరిత్రకారుని ప్రధానకర్తవ్యము. అట్లుగాక చరిత్రకారుడే స్వీయాభిప్రాయములను, ఇష్టానిష్టములను అనుసరించి నాటియాచారములను ఖండించుట సమంజసము గాదు. ఉదాహరణముగ విజయనగరసామ్రాజ్యమునందలి పణ్యస్త్రీసంఘమును గైకొందము. ఆకాలమునందలి సాంఘికపరిస్థితుల నర్థముచేసుకొనవలెనన్నచో వారకాంతల కష్టసుఖస్థితిగతులను తెలిసికొనకతీరదు. సాంఘికజీవనమున వారకాంతల కంత ప్రాముఖ్యము నొసగుట సరియా, కాదా యనుచర్చతో చరిత్రకారుని కేమియు సంబంధము లేదు. డాక్టరు వెంకటరమణయ్యగారు ఉన్నదున్నట్టుగ విషయమునంతయు ఆమూలాగ్రముగ విశదీకరించియున్నారు. కాని తమగ్రంథమునం దెక్కడను అప్పటిపరిస్థితులు మంచివా చెడ్డవా యను సమస్యావాదములకు బోక వానిని సమర్థించుటకుగాని, ఖండించుటకుగాని ధర్మశాస్త్రప్రమాణములను వెదకుచు కాలహరణము జేయక చారిత్రకధర్మమునెవ్విధమునను ఉల్లంఘించక కడుజాగరూకులై మెలగియున్నారు.

ఇంతటివిషయము సర్వసమగ్రమనుటలో సందియము లేదు. ఇదివరకే కొంతమట్టుకు ప్రచురింపబడిన శాసనసముదాయమునుమాత్రమే గాక ప్రాచీనపుస్తకగ్రంథాలయమునందలి మెకంజిగారి పుస్తకసముదాయమునంతను, ఆంధ్రప్రబంధములను, ఆమూలాగ్రముగ పరిశోధించియున్నారు. ఇదివరకు ప్రభుత్వమువారు కొన్ని శాసనముల మూలమునుమాత్రమే ప్రకటించిరిగాన ఈ మెకంజీపుస్తకములందున్న శాసనముల నకలులును, కైఫీయతులును చరిత్రకారుని కెంతయుపయోగమో చెప్పనలవిగాదు. ప్రబంధవాఙ్మయమును సమగ్రముగ పరిశోధించి అందలివిషయములను శాసనాధారముతో విమర్శించి ఉపయోగించుకొనుటలో మార్గదర్శకులు రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారని వెంకటరమణయ్యగారు ఒకచోట చెప్పియున్నను ఈనూతనమార్గమును త్రొక్కి ప్రబంధములను చరిత్రకొరకు సంపూర్తిగ నుపయోగించుకొని పూర్వకాలమునాటి తెలుగువారి జీవితమును సమగ్రముగ తెలుపుటకై ప్రయత్నించినవారలి దివరకు వెంకటరమణయ్యగా రొక్కరుమాత్రమే. వీరిప్రయత్నమువలన ఆంధ్రవాఙ్మయము, చరిత్రను పుష్టిగాదిద్దుకు ఎంతవరకుతోడ్పడగలదో తెలియుచున్నది.

ఈపుస్తకము చారిత్రకగ్రంథమైనను సాంఘికాది పరిస్థితులను గూర్చి ఏనవలకంటెను నాటకముకంటెను విశదముగను, మనోరంజకముగను తెలియజేయునని చెప్పిన ఈగ్రంథప్రాశస్త్యమును తెలిసికొనుటకు చాలును. మనము కృష్ణదేవరాయలకాలములో నున్నామనుకొందము. మన మేమేమి చూచియుందుము? ఎటువంటి ఇండ్లలో మనము కాపురముండియుందుము? ఎట్టి వేషములు ధరించియుందుము? ఏయాభరణముల నలంకరించియుందుము? ఎట్టి సుగంధద్రవ్యముల నుపయోగించియుందుము? ఎట్టిపాన్పులపై పవళించియుందుము? భోజనమజ్జనతాంబూలాదులందు ఎట్టిసౌఖ్యము ననుభవించియుందుము? ఏపానీయములచే మన గ్రీష్మాతపతృష్ణను ఉపశాంతిచేసికొనియుందుము? ఎట్టిక్రీడలచే కాలహరణము చేసియుందుము? ఇంతయేల? జీవితమెట్లు గడిపియుందుము? అను నీయంశములను సప్రమాణముగ, హృదయరంజకముగ, సమగ్రముగ తెలియజేసిన వెంకటరమణయ్యగారికి తెలుగువారెంతయు కృతజ్ఞులు. చరిత్రకారులు సాధారణముగ ఇట్టివిషయము లముఖ్యములని పరిగణింతురు. అట్టిచో ఈయపవాదమును పోగొట్టి నన్నూరేండ్లనాటి తెలుగువారిజీవితమును, అభిరుచులను ప్రత్యక్షమునకు దెచ్చి చారిత్రకవిమర్శనయందున్న తమ యాకాంక్షను గనుపరచిన వెంకటరమణయ్యగారు ఎంతయు మాననీయులు

నాటి వర్తకవ్యాపారపరిస్థితులనుగూర్చియు, వర్ణాశ్రమమతధర్మపరిస్థితులనుగూర్చియు, రక్షకబృందమునుగూర్చియు, న్యాయవిచారణమునుగూర్చియు, పన్నులనుగూర్చియు, వ్యవసాయాభివృద్ధికై యొనరించిన జలాధారవసతులనుగూర్చియు వ్రాసిన దంతయును మిక్కిలి తృప్తికరముగ నున్నది. రాజ్యవిధానమునుగూర్చి ఇదివరకే కొంత ఇతరులు వ్రాసియున్నను ఎవరును ఇంత సమగ్రముగ వ్రాయలేదు. అదియునుగాక చంద్రప్రభు

త్వమునకును స్థానికప్రభుత్వములకును గలసంబంధమును డాక్టరు వెంకటరమణయ్యగారు విశదపరచియున్నారు. ఈభాగములన్నియు పెక్కునూతనవిషయములతో నిండి వెంకటరమణయ్యగారి పరిశోధనాసక్తిని, శక్తిని విశదము చేయుచున్నవి.

ఈపుస్తకమునందలి ప్రథమభాగమున అచ్యుతరాయలకాలపు రాజ్యాంగవ్యవహారములు చక్కగ చర్చింపబడినవి. సూయలుకు పిమ్మట ఇంగ్లీషున ఇదివరకు ఇంత చక్కగ అచ్యుతరాయలకాలమునందలి చరిత్రను దెలుపు వ్యాసము లేలేకున్నను తెలుగునమాత్రము ఆంధ్రవిజ్ఞానసర్వస్వమున 'అచ్యుతరాయలు' అను శీర్షిక క్రింద నొక చక్కని వ్యాసము రెండుమూడేండ్లకు పూర్వమే ప్రకటితమైనది. కాని ఈవ్యాసమున లేని కొన్ని క్రొత్తవిషయములు డాక్టరు వెంకటరమణయ్యగారి గ్రంథమున గనుపట్టుచున్నవి.

అచ్యుతరాయునికి పూర్వము విజయనగరము పరిపాలించినవారికిని ఉమ్మత్తూరు సంస్థానాధీశులకును ఉన్న పరస్పరసంబంధములనుగూర్చియు, కొండవీడును పరిపాలించిన రాజప్రతినిధులనుగూర్చియు, అచ్యుతరాయల మరణానంతరమున సంభవించిన క్లిష్టపరిస్థితులను గూర్చియు, ఇటువంటివిషయము లింకను కొన్ని డాక్టరుగారు ఎంతో విపులముగను, విశదముగను చర్చించిరి. అచ్యుతరాయల రాజ్యారంభదశయందే జరిగిన గోల్కొండగజపతిప్రభువుల దండయాత్రలగూర్చియు, అచ్యుతరాయని దక్షిణదేశదిగ్విజయయాత్రనుగూర్చియు డాక్టరుగారు వ్రాసినదానికిని, ఆంధ్రవిజ్ఞానసర్వస్వమునందలి వ్యాసమునందు చెప్పినదానికిని అంతభేదము గానరాదు. ఇక భేదము గనిపించునది ఒక్క విజయనగర విజాపురరాజ్యవ్యవహారముల సంబంధమునందును, అళియ రామరాయని చరిత్రమునందును మాత్రమే

బారస్, నన్నీజు మొదలగు పోర్చుగీసు వారి వృత్తాంతములును, ఫెరిస్తా మొదలైనవారు వ్రాసిన మహమ్మదీయ వృత్తాంతములును, అచ్యుతరాయాభ్యుదయాదులును ఈ విషయములనుగూర్చి కొంతవరకు తెలుపును కాని వీనిలో పరస్పరవిరుద్ధములైన యంశములును, విషయములును ఎన్నో కలవు. ఒకదానివల్ల తెలియవచ్చు విషయమునకు మరియొకటి విరుద్ధము. ప్రమాణముగ గ్రహించవలసిన గ్రంథములన్నియు ఇట్టివిరుద్ధవిషయములతో నిండియున్నవి. వీనినన్నిటిని సమన్వయించి సత్యచరిత్ర నిర్ణయించుట చాలకష్టమే. అట్టిచో సంవత్సరములకొలది కష్టపడి పఠించి వ్రాసిన డాక్టరుగారిచరిత్రమును విమర్శించుట సులభముగాదు. రామరాయల గుణాగుణపరిశీలనమునకై అత్యంతప్రాముఖ్యములగు నీయంశములు చారిత్రకపండితులకేగాక పామరులకును గూడ విశదముగ వలెనను నభిప్రాయముతో ఈవిషయములనుగూర్చి డాక్టరుగారేమి వ్రాసినారో కొంత సంగ్రహముగ దెలుపుచున్నాను

దక్షిణదేశదిగ్విజయానంతరమున అచ్యుతరాయడు విజయనగరమునకు మరలివచ్చి, తనరాజ్యారంభకాలమునందే కోల్పోయినముద్గల్లు, రాయచూరుదుర్గములను సాధించుటకై వేచియుండెను. అప్పటికి విజాపురరాజకీయపరిస్థితులు అతనివాంఛితార్థసిద్ధికి అనుకూలముగ మార్పుచెందుచుండెను.

క్రీ. శ. ౧౫౩౪ వ సంవత్సరమున ఇస్మాయిల్ ఆదిల్ షా చనిపోయి అతనిఇద్దరుకుమారులకును కలహము సంభవించి కడకు పెద్దవాడైన మల్లు సింహాసనమెక్కెను. మల్లుకును, రాజ్యమునందలి ప్రముఖులకును సరిపడకపోవుటచేతను, తమ్ముడైన ఇబ్రహీము కడునేర్పుగ రాజ్యలాభమునకై పోరాడుచుండుటచేతను మల్లుకు నాటినాటికి కష్టము లెక్కువాయెను తనయధికారమును సమగ్రముగ నిర్వహించుకొనలేని ఇట్టిస్థితిలో విజయనగరరాజు దండెత్తివచ్చుటకు సిద్ధమాయెను. రాజ్యమునందలి ప్రముఖులలో నొక్కడును, కడుసమర్థుడును నైన అసదుఖానునకుకూడ రాజకీయాందోళనమున కొంత పాలుండియుండునని సందేహించి, మల్లు అతనిని రాజధానికి రమ్మని యాజ్ఞాపించెను. అందుల కాసదు తాను ముసలివాడనయ్యాననియు, ఇక ఐహికవిషయములతో నేమియు పనిలేదనియు ఏమేమో వ్రాసిపుచ్చి రహస్యముగ సుల్తానుపై పోర్చుగీసువారితో కుట్రలు పన్న

జొచ్చెను. ఈకుట్రలఫలితముగ పోర్చుగీసువారు గోవా పరిసరప్రాంతమును ఆక్రమించుకొని దాని సంరక్షణార్థము రాచోల్ దుర్గమును నిర్మించిరి. ఆసదు పోర్చుగీసు వారితోనే గాక విజయనగరరాజుతో గూడ కుట్రపన్ని యతని యాహ్వానముపైన నవరాత్రియుత్సవములను జూచుటకై తన ౧౩ వేలకాల్బలముతో ,౨౦౦ ఏనుగులతోను విజయనగరమునకు ప్రయాణమై వచ్చెను. అచ్యుతరాయు డాతనిని సన్మానించి యాతనిఖర్చులకై సుంగి, తురుగాల్ అను రెండుపట్టణముల నిచ్చెను. పిమ్మట విజయనగరసైన్యము ఆసదుఖానుతో బయలుదేరి విజాపురరాజ్యమునందలి ఒకానొకదుర్గమును ప్రప్రథమమున సాధించిరి. పిమ్మట విజాపురమునందలి నానాభాగములను కొల్లగొట్టుచున్నందున మల్లు కోపోద్దీపితుడై తనసేవకుడగు ఆసదును బట్టియిమ్మని విజయనగరరాజున కొకజాబు వ్రాసెను. దీనిని అచ్యుతరాయడు ఆసదునకే జూపించెను. ఆసదు ఇప్పటినుండియు రహస్యముగ సుల్తానుతో ఉత్తరప్రత్యుత్తరములు జరుప ప్రారంభించెను. అచ్యుతరాయడు రాయూరుపట్టుకొనుటకై పయనమాయెను. సుల్తానుగూడ అచ్చటికే వచ్చుచుండెను. ఇంతలో ఆసదుఖాను సుల్తానుతో కొంతవ్యవహారము జరుపుచున్నాడని అచ్యుతరాయనికి తెలిసి అతనిని పట్టుకొనుటకై ప్రయత్నించి విఫలమనోరథుడాయెను ఆసదుసుల్తాను లేకమైరి. రాయూరివద్ద వీరికిని విజయనగరసైన్యమునకును గొప్పయుద్ధము తటస్థమై అందు అచ్యుతరాయనికి సంపూర్ణవిజయము సేకూరెను. మల్లు ఓడిరిగ పారిపోవలసివచ్చెను. అచ్యుతరాయడు రాయూరిని స్వాధీనముచేసికొని శత్రుసైన్యమునందలికొన్ని ఏనుగులను అశ్వములను బట్టుకొని మరల కృష్ణానదీప్రాంతమున యుద్ధమునకై వేచియుండెను. గాని సుల్తాను ఆసదుఖానునందు విశ్వాసములేనివాడై యుద్ధమునకన్న సంధియే మేలని అచ్యుతరాయనితో సంధిగావించుకొనెను. ఈసంధిప్రకారము కృష్ణానదియే రెండురాజ్యములకును సరిహద్దుగ నేర్పడెను.

ఇంతకాలమును ఏమరుపాటులేక కడువిశ్వాసముతో విజయనగరమునుండి రాజ్యవ్యవహారములను జరిపించుచుండిన రామరాయలకు నేటినుండి (అనగా రమారమి క్రీ. శ. ౧౫౩౬-వ సంవత్సరము నుండి) దుర్బుద్ధులు పొడమజొచ్చెను. ఇందునకు అచ్యుతరాయడే కొంతమట్టుకు కారణభూతుడాయెను. తనకు ప్రత్యర్థిగ నున్న తనయన్నకొడుకు క్రీ. శ. ౧౫౩౩-వ సంవత్సరమునందే మరణించియుండుటచే అచ్యుతరాయడు నిర్భయచిత్తుడై రాజ్యవ్యవహారములందు రామరాయనితో సంప్రతించుటమాని కడకు కొంతకాలమునకు అతనిని ప్రధానామాత్యపదవినుండియే తొలగించి తనబావమఱదియగు సలకము పెదతిరుమలదేవుని ఆస్థానమున నియోగించెను. కాని రాజ్యమునందు రామరాయనికి ఎక్కువపలుకుబడి యుండెను. రాజ్యభారమును నడపినంతకాలమును రామరాయడు తన భావ్యాభివృద్ధియందే ఏకాగ్రచిత్తుడై రాజ్యమునందు పెక్కుమార్పులను గావించెను. ముఖ్యస్థానములందు తన నాప్తమిత్రులను బంధువులనే నియోగించెను. విజాపురసుల్తానగు ఇబ్రహీము తనసైన్యమునుండియు, దేశమునుండియు తరుమగొట్టిన విదేశీయులందరికిని రక్షణయొసంగి తనసైన్యమున జేర్చుకొనెను. ఇట్లు విజయనగరమునందు తనస్థానమును దృఢపరచుకొన్న రామరాయలు పదవినుండి తొలగినంతనే దుర్బుద్ధియుతుడై చెలరేగి అచ్యుతరాయని బందీకృతునిగావించి రత్నసింహాసనమును తానే యధిష్ఠింప నుద్యుక్తుడాయెనుగాని రాజధానియందలి ప్రముఖుల యసమ్మతికి వెరచి అచ్యుతరాయని యన్నకొడుకగు సదాశివుని సింహాసన మెక్కించెను. సదాశివరాయడు వయసున చిన్నవాడుగాకున్నను తనయాజ్ఞాబద్ధుడుగ నుండుటుగాన సర్వాధికారమును తానే నిర్వహించవచ్చునని రామరాయడు తలచెను.

రాజధానియందలి ఈకలహములు దూరసామంతులకు దుర్బుద్ధుల బుట్టించెను. దక్షిణదిశాంత్యమున నున్న కొందరు మాండలికులు ఇదేసమయమని స్వాతంత్ర్యము వహించి కప్పముగట్టుట మానివైచిరి. వీరినందరిని లొంగదీయుటకు రామరాయలు తానే విజయనగరమునుండి బయలుదేరవలసి వచ్చెను. తన నాప్తసేవకుని నొకనిని విజయనగరమున నుంచి రామరాయ లీపనికై బయలు

దేరెను. ఈ దక్షిణదండయాత్రను సులభముగ ముగించుటకు వీలులేకపోవుటచేత రాజధానియందలి కోశము నుండి ధనమును బంపింపమని రామరాయలు తనసేవకునికి వ్రాసెను. బొక్కసమునందలి ధనరాసు లీసేవకుని యాశలను పెంపొందించెను. అతడు రామరాయలపై తిరుగుబాటు చేయదలచి, అచ్యుతరాయలను చెఱనుండి విడిపించి సలకము పెదతిరుమలదేవునితో గలిసి సైన్యమును సమకూర్చ నెంచలిడెను. సలకము పెదతిరుమల దేవుడు కడు మేధావి. నీచుడైన ఆసేవకుని నమ్ముట యెప్పటికైనను ప్రమాదజనకమని తలచి సలకము పెద తిరుమలదేవు డాతనిని జంపించి తానే కార్యనిర్వహణాధికారము వహించెను.

ఇంతలో రామరాయలు యుద్ధమునాపి విజయనగరమునకు మరలివచ్చెను గాని ఇబ్రహీము ఆదిల్‌షాయును, అసదుఖానును విజయనగరముపై దండెత్తివచ్చి యుండుటను గాంచి తన జాగీరునకు పారిపోయెను. సుల్తాను స్వల్పసైన్యముతోనే వచ్చి నాగలాపురమును నేలమట్టము గావించి గర్వించుచున్నను తన భావమనముల యాలోచనపైననే సమగ్రముగా నాధారపడిన అచ్యుతరాయలు, రామరాయ సుల్తాను లిరువురును కలిసి తిరస్కరించినయెడల అనర్థము వాటిల్లునని భయము జెంది స్వల్ప సైన్యయుతుడగు సుల్తాను నెదిరించి జయించుటకు బదులు అతని స్నేహమును సంపాదించుటకే ఉద్యుక్తుడాయెను. ఇంతలో సుల్తాను తన యదృష్టమునకు గర్వించి తనకు అనిష్టులగు అమీరులను అందును ముఖ్యముగ అసదుఖానునే పర్యాగుచందు బెదిరించెను. అసదు విసుగుజెంది సుల్తానువినాశనముకొరకై కుట్రలు పన్నజొచ్చెను సుల్తాను బలహీనుడనియు, యుద్ధము సంభవించినచో తాను సుల్తానుతో జేరక తటస్థుడుగా నుండెదననియు చెప్పి రామరాయలను యుద్ధమునకు పురికొల్పెను. అదేసమయమున అసదు అహమ్మదునగర సుల్తానుతోకూడ కుట్రలుపన్ని విజాపురముపై దండెత్తివచ్చునట్లు జేసెను. ఇబ్రహీము అచ్యుతరాయలతో సంధియొనరించుకొనవలసి వచ్చెను. అచ్యుతరాయలుగూడ రామరాయలు మరల విజయనగరమునకు వచ్చుచున్నాడని

తెలిసి అతడు వచ్చి ఇబ్రహీము ఆదిల్‌షాను కలిసికొనుటకు ముందే సంధి యొనరించుకొనుట మంచిదని నిర్ధరించెను. ఈసంధిప్రకారము అచ్యుతరాయలు ౧౦ లక్షల వరహాలధనమును, లక్షవరహాల విలువగల యాభరణములను ఇచ్చుటయేగాక రాయచూరు దుర్గమునుగూడ ఇచ్చివేయుటకు ఒప్పుకొనెను. రామరాయలు విజయనగరమును సమీపించిన వెంటనే యతనికి ఈసంధినిగూర్చి తెలిసెను. రాజకీయపరిస్థితులు తానను కొన్నవిధముగా నుండనందుకు చింతిల్లుచు అతడుగూడ సుల్తానుతో సంధియొనరించుకొనెను. సామ్రాజ్యవిషయములందిక నెన్నటికిని రామరాయలు జోక్యము కలుగజేసికొనకుండునట్లును, తన జాగీరునందే సుఖముగ కాలము గడుప అచ్యుతరాయలు అనుజ్ఞ నొసంగునట్లును అచ్యుతరాయ రామరాయలకు ఒక ఒడంబడిక జరిగెను. ఈ ఒడంబడికకుగూడ సుల్తానేకారణమని డాక్టరుగారు వ్రాయుచున్నారు. ఇందులకు కృతజ్ఞుడై అచ్యుత దేవరాయలు సుల్తానుకు సుమారు ఒకలక్ష విలువయగు అమూల్య వజ్రములను బంపించెనట.

పై విషయములను విపులముగ డాక్టరు వెంకటరమణయ్యగారు విశదీకరించియున్నారు. పరస్పర విరుద్ధవిషయములను పైరీతిని డాక్టరుగారు సమన్వయించినను సందేహములకు అవకాశము లేకపోలేదు. విజయనగర విజాపుర ప్రభువుల రాజ్యవ్యవహార సంబంధములను రెండు ప్రత్యేక విభాగములుగజేసి క్రీ. శ. ౧౫౩౬ వ సంవత్సరమునకు పూర్వము రాచూరి యుద్ధమునకు సంబంధించినంతవరకును ఒక భాగముగను, ఆసంవత్సరమునకు పిమ్మట జరిగిన రామరాయ అచ్యుతరాయ కలహమునకు సంబంధించినంతవరకును రెండవ భాగముగను డాక్టరుగారు పరిగణించియున్నారు. ఇట్టి విషయవిభాగమువలన కొన్ని ముఖ్య సందేహములు కలుగుచున్నవి. కృష్ణరాయలు జీవించియుండగనే క్రీ. శ. ౧౫౨౯ వ సంవత్సరమునుండి రాజ్యకాంక్షియై దురాశాపీడితుడైన రామరాయలు కృష్ణరాయల కుమారుని యనంతరము క్రీ. శ. ౧౫౩౬ వ సంవత్సరమువరకును అచ్యుతరాయనికి విధేయుడైయుండి అతని యుద్ధములలో కష్టపడు

చున్నంతకాలమును ఊరకుండి అతడు దక్షిణదేశము నందును రాయచూరునందును విజయుడై బలిష్ఠుడై విజయనగరమునకు మరలివచ్చి రామరాయని నిర్లక్ష్యము జేసి యాతనిని పదవినుండి తొలగించిన పిమ్మటనే అతనిని ధిక్కరింప ప్రయత్నించెననుట విశ్వసనీయముగ దోపదు. అది యొకవేళ ఒప్పుకొన్నను బలయుతులగు బావమరదులతో నున్న అచ్యుతరాయని స్థానచ్యుతుడగు రామరాయ లేవిధముగ చెరబట్టి సదాశివుని సింహాసన మెక్కించ గలిగియుండును?

ఇంతమాత్రమేగాక ఇబ్రహీము చర్యలందు గూడ కొంత యసమంజసము దోపకమానదు. రాయచూరు ప్రాంతములను మరల సంపాదించుటకు అనుకూల పరిస్థితు లేర్పడినవని ఆసదుఖాను లాకీ సలహా యొసంగినందుననే విజాపుర సుల్తాను విజయనగరముపై దండెత్తి వచ్చెనని డాక్టరు గారు చెప్పియున్నారు. ఈయుద్దేశ్యమే సరియైనచో ముందుగ రాయచూరుదుర్గమును వశపరచుకొనక ఏల అనాహూతముగ ఇబ్రహీము ఆసదుఖానులు విజయనగరమునకు వచ్చి దండువిడిసిరో తెలియరాదు. ఆసదుఖాను సలహాపైననే దండెత్తివచ్చి విడిసినపిమ్మట సుల్తాను ఏల ఆసదును నిష్కారణముగ బెదిరించెనో, ఆసదునకును సుల్తానునకును ఇంతకుపూర్వము ఏమేమి తగవులుండెనో తెలియరాదు. దండువిడిసి చాలకాల మచ్చటనే యుండుటలో సుల్తాను అభిప్రాయమేమి? ఈ అంశములు విశదముగ లేవు.

ఇక రామరాయల ప్రవర్తనము దురవగాహముగ నున్నది. తన ప్రత్యర్థులగు అచ్యుతరాయ సలకము పెద తిరుమలదేవులపై సుల్తాను దండెత్తివచ్చియున్నాడని తెలిసియు కూరుపడు రామరాయ లేల పారిపోయెనో యర్థముగాకున్నది. రామరాయ సుల్తాను లిద్దరును ఏకమై తన్నెక్కడ బాధింతురోయని అచ్యుతరాయలు అంత ఎక్కువగ భయపడుట కవకాశమున్న స్థితిగతులలో రామరాయడు పారిపోవుటకు ఏమి కారణము నొసంగవలెను? ఇక సుల్తానునకును రామరాయలకును ఉన్న సంబంధమెట్టిది? సుల్తానేల రామరాయలతో నేకీభవింపకపోయెను?

అచ్యుతరాయ లేల అట్టి కఠినసంధిషరతుల కొప్పుకొనెనో తెలియరాదు. నిష్కారణముగ తనపై దండెత్తివచ్చిన సుల్తాను బలహీనుడనియు, ఆసదుఖాను అహమ్మదునగరము సుల్తానుతో కుట్రలుపన్ని సఫలమనోరథుడైనాడనియు, రామరాయ లేలకో తా ననుకొన్న విధంబునగాక సుల్తానుతో జేరకయే పారిపోయెననియు తెలిసియుగూడ అచ్యుతరాయ లట్టికఠినషరతుల కొప్పుకొనుట యర్థముగాదు. అట్టిసంధి యనంతరము తన రాజ్యసంరక్షణార్థ మాతురపడి విజాపురమునకు మరలిపోక సుల్తానేల రామరాయలతో సంధియొనరించుకొన వలసివచ్చెనో, దానిపిమ్మట రామరాయ అచ్యుతరాయలకు ఒడంబడిక జరుగుటకై సుల్తానేల ప్రయత్నింప వలసివచ్చెనో తెలియదు

క్రీ. శ. ౧౫౩౬ వ సంవత్సరమునకు పూర్వోక్తవిషయములందుగూడ చాలసందేహము లంకురించుచున్నవి. విజాపురరాజ్యమునందలి విషమపరిస్థితులనుగూర్చి తెలిసియు సంపూర్ణవిజయలక్ష్మితో విరాజిల్లుచుండిన అచ్యుతరాయ లేల తనరాజ్యారంభదశయందే పోగొట్టుకొనిన పైతృకమగు రాయచూరుదుర్గమును సాధింప సమకట్టక ఆసదుఖాను పట్టుల నామోదించుచు అతనిని నవరాత్రియుత్సవములకు విజయనగరమునకు రమ్మని వ్రాసెను? ఒకవేళ అచ్యుతరాయనికి ఆసదుఖానునందు అపూర్వస్నేహ ముదయించెనన్నను ఎట్టిపరిస్థితులందును తురుష్కులతో మైత్రిని సహించని రామరాయలు అప్పటికింకను ప్రధానామాత్యపదవియందుండిగూడ దీని కియ్యకొనెనో యర్థముగాదు. గజపతి గోల్కొండ ప్రభువులను అన్యసహాయములేకయే తనరాజ్యారంభమునందే ఎదుర్కొని జయించిన అచ్యుతరాయ లేల విజయలక్ష్మీకటాక్షము తనపై పరిపూర్ణముగ ప్రసరించిన పిమ్మట భీతుడై రాయచూరిదుర్గమును ముట్టడించుటకు వెనుకంజవైచి ఆసదుఖానుని సహాయము గోరెనో తెలియరాదు

ఇక ఆసదుఖానుని ప్రవర్తన మింతకేనియు సమంజసముగ నున్నట్లు దోచదు. ఆసదుమల్లునకు ప్రబలవిరోధియై అచ్యుతరాయనితో తానే ఉత్తరప్రత్యుత్త

రములు ప్రారంభించి తన సుల్తానును తాను కోరిన విధముగ ఇక్కట్టులకు దెచ్చి తీర తన పగదీర్చుకొను సమయమున నేల అచ్యుతరాయని వదలి సుల్తానును జేరి రణరంగమున నోడిపోవలసివచ్చెను? ఒకవేళ ఇది నిజమే యైనచో ఆసదుఖానునే నమ్మివచ్చిన అచ్యుతరాయలు, ఆసదు అట్టి విషమ సందర్భములలో శత్రురాజులతో జేరినప్పుడు తాను నిస్సహాయుడై యుద్ధమునకు బూనుకొనునా? అట్లు పూనుకొనినను అంత సంపూర్ణముగ ఆదిల్షా ఆసదుఖానుల సైన్యద్వయమును ఓడి పగలిగి యుండునా? ఇది అసంభావ్యము.

మొదటినుండియు ఇబ్రహీముతో స్నేహముగ నుండిన ఆసదుఖాను విజయనగరాంతఃకలహములు కలిగినప్పుడు సుల్తానును ఆనగరముపై దండెత్త ప్రోత్సహించి, యతనితో బాటు తానును విజయనగరముపై దండెత్తివచ్చెనని డాక్టరుగారు చెప్పియున్నారు. ఆసదుఖాను చెప్పినట్లుగనే ఇబ్రహీమునకు ప్రప్రథమమున సర్వమును సుకరముగ నేయుండెను. స్వల్ప సైన్యముతో వచ్చియు నాగలాపురమును నేలమట్టము గావించి రణభేరి మ్రోయించుచున్నను, బలిష్ఠుడును విజేతయునైన అచ్యుతరాయలు అంతఃకలహముల కారణమున ఎదురించుటకు బదులుగ సంధి యొనరించుకొనుటకై సంసిద్ధుడై యుండెను ఇట్టిస్థితిలో ఆసదుఖాను చెప్పిన సలహాకు మెచ్చి అతనియందు స్నేహభావమును జూపుటకు మారు సుల్తానాతనిని బెదరించుటకేమికారణము గలిగెను? మొదటినుండియు తనయందు విశ్వాసము కలిగి మల్లుతో విరోధించి తనకు రాజ్యము సంపాదింప ప్రయత్నించిన ఆసదుఖానునెడ నేల ఇబ్రహీమునకు కనుచూపుమేరలో విజయలక్ష్మి పొడసూపుచున్నప్పుడు ఇట్టి ద్వేషభావ మంకురించెనో దురూహముగనున్నది ఒకవేళ ప్రమత్తుడై సుల్తాను వట్టి బెదరింపుమాటలను పలికినను అతిమేధావియగు ఆసదుఖానేల అంతమాత్రమున భయవిత్తుడై సుల్తానునెడ తన కదివరకును ఉన్న విశ్వాసమును గోల్పోయి రామరాయ అహ్మదునగర సుల్తానులతో కుట్రల పన్నవలసివచ్చెను? కుట్రలు ప్రారంభించిన పిమ్మట తన పన్నుగడలు ఫలించుచున్నవనియు, అహ్మదునగర సుల్తాను విజాపురముపై దండెత్తివచ్చెననియు, రామరాయ కూడ తాను చెప్పిన విధముగ విజయనగరమునకు వచ్చుచున్నాడనియు తెలిసి కూడ ఏలఅంతటితోనే తనకుట్రల నాపి మరల సుల్తానుతో చెయి గలిపి విజయనగరముతో సంధియొనరించుకొనెనో తెలియరాదు ఆసదుఖాను అతిమేధావి యనియు, రాజ్యతంత్రమునందు కడునేర్పరియనియు మనకు తెలియును. అట్టివాడు సరిగయోచింపక తొందరగ కుట్రలప్రారంభించి వానిని సగములోనే నిష్కారణముగనే వదలివైచి చంచలచిత్తునివలె ప్రవర్తించె ననుట సరిగాదు.

ఈ కారణములనుబట్టి పై విషయసమన్వయము సరిగ గన్పట్టదు. విజయనగర విజాపుర రాజ్యములకున్న సంబంధమంతయు రామరాయ అచ్యుతరాయల కలహములనాటిదే యన్నచో ఈసందేహములకు ఎడముండదు. దీనికిని రాచూరుదుర్గసాధనమునకును సంబంధమున్నట్లు తోచదు.

దక్షిణదిగ్విజయయాత్ర ముగించి విజయనగరమునకు మరలివచ్చిన కొంతకాలమునకే అచ్యుతరాయలు రాచూరిదుర్గమును, ఆపరిసరప్రాంతమును సాధించినట్లు దోచుచున్నది. ఈదుర్గములను సాధించుట కష్టమేయైనను అంతకంటెను మిక్కిలికష్టమైనది వానిని కాపాడుట. కృష్ణరాయని మరణానంతరమున అచ్యుతరాయని రాజ్యారంభదశలో ఈ దుర్గము లెంతయవలీలగ సుల్తాను స్వాధీనములయ్యెనో, అంతయవలీలగ ఇస్మాయిల్ మరణానంతరమున మల్లు రాజ్యారంభదశలో విజయనగరాధీనములై యుండెనని తోచుచున్నది. విజాపుర ప్రభుత్వమాకాలమున మిగుల దుర్బలస్థితిలో నుండెను. ఇస్మాయిల్ కోరిక ప్రకారము అతని పెద్దకొడుకగు మల్లు రాజ్యమునకు వచ్చియుండెను. ఆసదుఖాను ప్రప్రథమమున అతనియందు స్నేహబుద్ధితోనే యుండి ఇస్మాయిల్ కోరికమేర రాజ్యభారధురంధరుడై యుండినను, మల్లు స్త్రీలంపటుడును, మద్యపాయియు, దుష్ప్రవర్తకుడును నగుటచేత విసుగుజెంది తనజాగీరునకు వెడలిపోయెను. విజాపుర ప్రముఖులలో చాలమంది మల్లు దురాచారములకు కినిసి అతనితమ్ముడగు ఇబ్రహీం పక్ష

మునసే యుండిరి. అట్టిచో మల్లు, యుద్ధమునం దారితేరిన అచ్యుతరాయనితో బోరి గెలువగలఁడా ? ఓడి రణరంగమునుండి పారిపోవలసివచ్చెను. అచ్యుతరాయలు మరల కృష్ణానదీతీరమున తనసైన్యముతో యుద్ధసన్నద్ధుడై యుండ, మల్లు పరాజయమునకు వెఱచి సంధిగావించుకొనెను. రాచూరు విజయనగరాధీనమాయెను.

ఇక అంతఃకలహములనుగూర్చి విచారింతము. తానే రాజ్యమేలవలెనను ఆశ రామరాయలకు మొదటినుండియే యున్నందున అచ్యుతరాయడు విజయనగరమున లేనంతకాలమును పలువిధముల పదిలపఱచుకొనుచు సమయమునకై వేచియుండెను. అచ్యుతరాయలు విజేతయైనను చాలకాలము విజయనగరమున లేకపోవుటచేత అతనిపలుకుబడి అంతసన్నగిల్లెను మరల విజయనగరమునందు కొంతకాలముండి అతడు పలుకుబడి సంపాదించుకొనుటకు పూర్వమే రామరాయలు తొంటనుండియే పన్నుచున్న పన్నుగడను సాధించెను. అచ్యుతరాయలు పట్టుబడెను. సదాశివుడు సింహాసనమెక్కెను సలకము సోదరులు ఇంకను పలుకుబడి సంపాదించలేనిదానివల్ల చేయునదేమియు లేక యూరకుండిరి.

కాని దైవవశమున దక్షిణదేశాధిపతుల తిరుగుబాటు సంభవించెను రామరాయడు సలకము పెదతిరుమలదేవునిగాని, అచ్యుతరాయని సైనికుల నెవ్వరినిగాని పంప నిచ్ఛగించియుండడు. విశ్వాసపాత్రులైన సమర్థులు కనపడని కారణమున రామరాయలే యుద్ధమునకై విజయనగరమునుండి వెడలిపోవలసివచ్చెను.

విజయనగ రాంతఃకలహములందు మహమ్మదీయులకు జోక్యము కలుగుటకు సలకము పెదతిరుమలదేవుడే కారణము రామరాయలకు భయపడి యతడు ఆసదుఖాను లారీ సహాయము వేడెను. తన సైన్యమునకగుఖర్చులుగాక పైగా దినమునకు 3 లక్షల హొన్నులనిచ్చెదనని సలకము పెదతిరుమలదేవుడు చెప్పియుండెను గాన ఆసదు అందులకియ్యకొనెను. మతవిషయమై ఇబ్రహీమునకును తనకును అదివరకే ద్వేషమున్నందున విజయనగరముతోడిమైత్రి ఆసదునకు అప్పుడు అత్యంత వాంఛితమాయెను. నవరాత్రి పండుగ రానుండెను గాన బహిప్రకటనమున కొక మంచి సాకుకూడ దొరికెను. ఇట్టి స్థితిలో రామరాయడు నిస్సహాయుడై ఆసదుఖానుతో జేరిన అచ్యుతరాయని సైన్యము నెదుర్ప వీలులేక పెనుగొండ సుత్తి దుర్గములకు పారిపోవలసివచ్చెను.

ఇక బిజాపురసుల్తాను విజయనగరముపై దండెత్తివచ్చుటకు ఆసదుఖానేకారణము. తనయధికారమును ధిక్కరించి తనయాజ్ఞలకు విరోధముగ బహిరంగముగనే పిత్యూరిదుల ననుసరించుచు పోర్చుగీసువారితోను, విజయనగరప్రభువులతోను తన కపాయకరముగ కుట్రలు పన్నుచున్న ఆసదుఖానుని ఊరక వదలివేసినచో అనంతరము ముప్పు వాటిల్లగలదను భీతితో సుల్తాను కొంత సైన్యమునుమాత్రమే దీసికొని విజయనగరమునకు వచ్చెను. విజయనగరము నందుండు క్లిష్టపరిస్థితులలో తనకుగూడ ఏదో కొంతలాభ ముండునను నూహకూడ నుండియుండును. అంతియేకాని అతడు ప్రత్యేకము విజయనగరరాజ్యవిజిగీషువై రాలేదు. అందులకే అతడు స్వల్ప సైన్యమునే గైకొనివచ్చెను. వచ్చియు విజయనగరముతో కయ్యము నాశించక తనసేవకుని తన కొప్పగింపవలసినదని న్యాయసమ్మతముగ విజయనగరాధీశునికి జాబువ్రాసెను. అట్టిచో అచ్యుతరాయ లేనెపముపై యతనితో బోరగలడు?

ఇంతలో రామరాయలు విధేయుడై జాబులు వ్రాసి తానెన్నటికిని ఇక విజయనగరరక్షసింహాసనమున కవిధేయుడై ప్రవర్తించననియు, మహమ్మదీయులతోడి సంబంధము ఎందున అపాయకరమనియు, అనర్థదాయకమనియు ప్రస్ఫుట వర్ణనములతో వ్రాసి తన విశ్వాసమునుగూర్చి వాగ్దాన మొనరించెను. అచ్యుతరాయనికి విషమసమస్య ఏర్పడెను. ఆసదును పిలిపింపజేసిన భయహేతు వంతటితో అంతరించిపోవుటచేత అతని కేమియు చేయుటకు తోచదాయెను. వ్యర్థముగ సుల్తానుతో నిష్కారముతప్ప ఇక ఆసదుతో నేమిప్రయోజనము ? ఊరక ఇబ్రహీం ఆసదులకు నెత్తిమీదికు దెచ్చుకొన్నందుకు ఏదోవిధముగ వారినిద్దరిని సరిపుచ్చి పంపుటయే ఉత్తమకర్తవ్యము.



సి. యస్. ఆర్. ఆంజనేయులు (కృష్ణుడు)
ద్రౌపదీ వస్త్రాపహరణము, సరస్వతీటాకీసు, బెజవాడ.



తాంబేటి స్వారీ P. P. A.



లండను జంతుశాలలో ఆడ, మొగ తాబేళ్లు, తాబేటిగ్రుడ్లు G. S. A.

ఈసంగతులను కుశాగ్రబుద్ధియగు ఆసదుఖాను కనుగొనియే యుండును. రామరాయలు విధేయుడైన వెంటనే ఇక తనతో అచ్యుతరాయనికి పనిలేదని అతనికి తెలియును. రామరాయలచే ప్రేరేపించి తాను తన పక్షము వహింతమన్న అతడు తనవిశ్వాసవచనములకు లొంగడాయెను. ఇక భావికర్తవ్య మేమి? తాను సమర్థుడనియు సామాన్యుడు గాదనియు విజాపురసుల్తానునకు తనయందు కొంతభయమును గౌరవమును కలిగింపగలిగెను. ఇక ఇట్టిస్థితిలో సుల్తానుఅండ జేరుటయే మంచిది. ఇట్టియుద్దేశములతో ఆసదుఖాను సుల్తానుతో ఉత్తరప్రత్యుత్తరములుజరుపప్రారంభించి తాను విజయనగరముతోను పోర్చుగీసువారితోను చేసినకుట్రలన్నియు తాను సుల్తానులాభమును పురస్కరించుకొని చేయుచున్న ఆటలోని ఎత్తులేయనియు ఏమేమో చెప్పి సుల్తానును క్షమింపవేడెను. సుల్తానునకు ఆసదునందు ఇంతమాత్రముచేతనే సంపూర్ణవిశ్వాసము కుదరకపోయినను ఆసదునంతటివానిని ఏదోవిధముగ లొంగదీయుటయే మంచిదని తోచియుండును. అదియునుగాక ఆసదుతో తనమైత్రివలన అచ్యుతరాయలకు తనయందు భయము హెచ్చును. కష్టములేకయే తనకత్యంతయనుకూలములగు సంధిషరతులను ఏర్పరచవచ్చును. ఇట్టియుద్దేశములతోనే సుల్తాను ఆసదును క్షమించి సన్మానించినను విజయనగరముతో నేలాటితగవును జేసికొనకుండ సంధి గావించుకొనియెను. కాని సంధి కంగీకరించుటకు పూర్వము అచ్యుతరాయని కొంత బెదరింపవలెనను యుద్దేశముతో విజయనగరమును వదలి సైన్యసమేతుడై రాచూరివైపు వెడలిపోయెను. ఆసదుగూడ అతనిని వెన్నంటినను అతనికిని సుల్తానునకును మైత్రి యేర్పడినదని అప్పటి కింకను అచ్యుతరాయలకు దెలియదు. గాన అతడు సుల్తాను బహుశః రాచూరిదుర్గమును ముట్టడించునని అభిప్రాయపడి రామరాయలదివరకే లొంగియుండుటచే ఇక విజయనగరమునకెట్టిభయమును లేదనితెలిసి తానుగూడ సుల్తాను వెంట నంటెను. కాని ఆసదు సుల్తాను లేకమైరని తెలిసినవెంటనే యుద్ధమునకన్న సంధియే మేలని నిశ్చయించియుండును. ఆసదు సుల్తానుతో జేరకయే యున్నచో అచ్యుతరాయ లట్టి కఠినషరతుల కియ్యకొనియుండడు. కాని యంతఃకలహములలో పరులకు ఆస్పదమొసంగినచో యిట్టులేయని గమనించి చేయునదేమియు లేక సంధిషరతుల కొప్పుకొనవలసియుండును.

ఇది ఒకరీతి సమన్వయము. ఏసమన్వయ మైనను, భావిపరిశోధనమునగాని స్థిరపడజాలదు. పైన జూపిన రీతిని భిన్న సమన్వయము జేసినప్పటికిని ఈయమూల్యగ్రంథమున కెంతమాత్రము ప్రాముఖ్యముతగ్గదు. క్లిష్టసమస్యలను పరివిధముల పరీక్షించినగాని యవగాహనము చేసికొనుటకు సాధ్యముకాదు. విజయనగర చారిత్రమును గూర్చి తుదిమాట పల్కుటకు ఎవ్వరికిని ఇప్పుడే సాధ్యముగాదు. డా॥ వెంకటరమణయ్యగార్లు అయిదారు సంవత్సరములు కష్టపడి వ్రాసిన ఈగ్రంథము విద్యార్థులకును, ఉపాధ్యాయులకును, చరిత్రకారులకును, పామరజనములకును గూడ అత్యంతాకర్షకరముగను, ఉపయోగకరముగను నున్నది. విషయవిభజనమునందేమి, అచ్చుతప్పులను దిద్దుటయందేమి, ప్రమాణనిదర్శనమునందేమి, అకారాది సూచియందేమి డా. వెంకటరమణయ్యగారు అతిజాగరూకులై ఈఘనకార్యమును నిర్వహింపగలిగినారు. ఐదురూప్యముల కింతటి యమూల్యగ్రంథము నొసంగ సమకట్టిన మద్రాసు విశ్వవిద్యాలయమువారి యుద్యమ మెంతయు ప్రశంసనీయము. ఈగ్రంథము సకల జనసన్మానమును బొందగలదని నే నెంతయు విశ్వసించుచున్నాడను.

విజయనగరచారిత్రమునే యభిమానవృత్తముగ బెట్టుకొని పనిజేయుచున్న వెంకటరమణయ్యగారికృషి వల్ల విజయనగరసామ్రాజ్యవైభవము వెల్లడియై ఆంధ్రులకీర్తి చిరస్థాయి అవుగాత యని కోరుచున్నాను.

---



నీలగిరి యినుపదారి.

బండిక్రిందికి జరుగకుండ నడుమనున్న పండ్లకు ప్రేరుపడుచుండును. K V.A.P.R.

# బ్రతుకు తెరువు

పడ్లమన్నాటి కుటుంబరావు

## నౌకరి దొరకినపిమ్మట

### తొలిశ్రద్ధ

నౌకరీని సంపాదింపవలెననెడి ఆతురతతో నున్న యువకుడు కంటికి కనుపడు ప్రతి కార్యాలయమునందును తిరుగుట అవ్యక్తము. ఎట్లో ఒకఖాళీ లభించినను నేనే యెట్టి యోచనయు లేక ఆ నౌకరీకి తన అంగీకారమును సూచించి దానికి వొప్పుకొనుట గూడ అవ్యక్తమే. మంచి చెడుగులు, ఉచితానుచితములు పాటింపక దొరకినదే తడవుగ నౌకరీని అంగీకరించిన యువకులు కొందరు ముందుముందు చాల కష్టములపాలయ్యెదరు.

అట్టికష్టము సంభవించిన తరువాత అప్పుడు మరొక నౌకరీని వెదకుకొనుట బహుప్రయాస. ఇట్లు తరుచు ఒక వ్యాపార సంస్థనుండి మరొక వ్యాపారసంస్థకు మారుచుండుట యువకునకు నష్టమేగాక ఆతని నుంచుకొను యజమానులకు గూడ చాల కష్టముగ నుండును. అట్టి యువకుడు ఒకచోట స్థిరముగ నుండువాడు గాడని స్పష్టమగును. ఒక యజమాని నౌకరీ నిచ్చుటకు అంగీకారమును సూచించినప్పుడు యువకుడు యోచింపవలసిన విషయములు కొన్ని కలవు. కొన్ని వేళలందు ఆ యజమానికి తన ప్రత్యుత్తరమును వానియెదుటనే తెలుపవలసియుండును. యజమాని నౌకరీ నిచ్చెదనన్నప్పుడు యువకు డెట్టి తడబాటును అగుపరచ రాదు. అట్టి తడబాటు, సందేహము నగుపరచిన యువకునకా నౌకరీ లభ్యపడుట గూడ సందేహాస్పదమే. అయినను యువకు డొకక్షణము యోచనచేసి తన స్థితిగతులు పరామర్శించుకొని, సమయము కనిపెట్టి క్షిప్తముగ, చాకచక్యముగ, యుక్తియుక్తముగ నొకటి రెండుమాటలలో ముగియు నటుల యజమానికి చెప్పవచ్చును. ఈ చాకచక్యము ఒంకపు పాడిపలె నతికి యువకుని ప్రయత్నమునకు విజయమును కలిగించవచ్చును. పై విషయమెల్ల తపాలుమూలమున జరుగుచున్నచో యోచనచేయుటకు కొంతేని యవకాశముగలదు.

## ఆరోగ్యమే మహాభాగ్యము

యువకుడు పనిచేయ నిశ్చయించిన కార్యాలయము మంచి ఆరోగ్యప్రదేశమున నుండునట్లు చూచుకొనవలెను. ధనము, గౌరవపదవులు మున్నగు నన్నిటికంటె మానవున కారోగ్యము మహాభాగ్యము. శ్రేష్ఠమగు నారోగ్యము కలిగియున్నచో ధనము, గౌరవపదవులు మున్నగునవి సంపాదించుట సులభము. ఆరోగ్యహీనుడు వాటిని సంపాదింప ప్రయత్నించుటకు గూడ నసమర్థుడై యుండును. ప్రతివిషయమునకు ఒక పరిమితి గలదు. పరిమితికి మించి ఒకానొక కార్యము నుద్దేశించినను, దార్ఢ్యమునకు మించిన శరీరకష్టమొనర్చినను, సామాన్య ఆరోగ్యలక్షణములనేని పాటింపకుండెడు కార్యాలయములందు నౌకరీచేసెనను నేడుగాకున్న మరికొన్ని దినముల పైన తగినశాస్తి యువకు డనుభవించితీరును.

ఆంగ్లేయుల వ్యవహారకర్తృత్వము నందున్న యేవో కొన్ని వాణిజ్యసంస్థలు తప్ప మిగత అన్నియు బహు అనారోగ్యకరములుగ నుండును. వెలుతురుండదు, గాలి చొరదు. పగలు గూడ దీపముల సహాయమున పనిచేయవలసి యుండును. ధారాళముగ నిరువురు తిరుగుటకు సరిపోనంత స్థలమైన నుండదు. చెత్త, చెదారము, దుమ్ము, బూజు, తేళ్లు, పాములు, మండ్రగబ్బలు మున్నగువాటికి కావాసమై యుండును. ఇట్టి నికృష్ట ప్రదేశములను ప్రతిదినమును శుభ్రపరచుటకు వీలుండదు. సంవత్సరమున కొకతూరి సంవత్సరాదినాడో, దసరాకో, దీపావళి, సంక్రాంతి మొదలగు నేదో ఒక ముఖ్యమగు పండుగకు మాత్రమో చెయ్యిచేసుకుని శుభ్రపరతురు. ఇక నేల వానకాలములందు తేమగ నుండును.

కొన్ని షాపులు మ్యునిసిపలు రోడ్లకంటె పల్లపు ప్రదేశ ములలో నుండుటచేత నేమాత్రపు చినుకు పడినను నీరు లోనికే చొరబడును. ఇక వేసంకాలములందు రోడ్లమీద ఎడతెరిపి లేకుండ పరుగెత్తెడు మోటార్లవల్ల లేచే దుమారముచే యీ షాపులలో పనిచేసెడివా రెంత శ్రమపడుదురో, ఎంత హైరాను చెందుదురో చెప్ప నశక్యముకాదు.

ఇక విశ్రాంతిని గూర్చి యోచింతమన్న నదియు నంతంత మాత్రమే. - వారమున కొకపూట మాత్రమే షాపులు మూసియుంతురు. అదే విశ్రాంతి. పండుగ పబ్బము వచ్చినను శలవు దొరకదు. చావు, పెళ్లి వచ్చినను సందేహమే. ప్రతినిత్యము ఉదయము 8 గంటల మొదలు రాత్రి 10 గంటలవరకు సమము విరామమెరుగనంతటి పని. ఇక విశ్రాంతి యనున దెక్కడిది? అట్టి అనారోగ్య పరిస్థితుల నడుమ సేవ చేయవలసి వచ్చిన యువకుని కాపురస్థల మైనను ఆరోగ్యవంతముగ నుండినచో కొంత శ్రేయో దాయకము. కాపురస్థలము పట్టణముల నడుమ నుండ తగదు. ఫ్యాక్టరీల పొగ, మోటార్లరొద, దుమారము, మిరపకాయ సీకాయ పొడరు వెదజల్లు మరలలోనుండి లేచే ఘాటు, రబ్బరు చక్రములులేక దడదడ శబ్దములతో నడుపబడెడు బండ్లమోత, మూరి క్రుళ్లిపోయిన పండ్ల దుర్వాసన, కుళ్లాయినీరు, ఒకటే జలవిసర్జించే మల విసర్జన స్థలములు మొదలైనవాటికి దూరముగ నుండెడు పట్టణ పరిసరప్రాంతములందు కాపురముండుట యుచితము.

## నడకగూడ నొక వ్యాయామము

ఆరోగ్యవంతమగు ప్రదేశములకు షాపును విడిచి నిలువబడి రెండుమైళ్లు పోనవసరములేదు. నాలుగైదు మైళ్లదూరమున నివసించిన చాలును. ప్రయాణసౌలభ్య ముండి, తక్కువ వ్యయముతో, త్వరలో కార్యాలయము నకు చేర్పగల వాహనసౌకర్యములున్న ఎంతదూరమున కాపురమున్నను చిక్కుండదు. మానవునకు నడకను మించిన వ్యాయామము మరొకటి లేదు. నడకనైనను వ్యాయామముగ లక్ష్యముతో నడచిన నెంతయో మేలు. 'ఎందుకువచ్చిన నడకరా దేవుడా' యనుకొనుచు నడచుట వ్యాయామ మనిపించుకొనదు, ప్రయోజన ముండదు. పైగా అనారోగ్యము ప్రవేశించినదని స్థిరపరచు కొనుటకు హేతువుగ గ్రహింపవచ్చును. కాన కాపుర స్థలము షాపునకు మిక్కిలిదూరమును, మరీ సమీపమును గాక వ్యాయామముగ నడచిపోయి రాగలుగునంతటి దూర మున మంచిప్రదేశమును చూచుకొనుట శ్రేయము.

## నౌకరీ యియ్యబడుటలో షరతులు

స్వల్పవేతనమును మాత్రమే యిచ్చు నౌకరీ లభిం చినచో యజమానికిని, యువకునకును నడుమ నౌకరీ విష యమై కంట్రాక్టు ఉండకపోవచ్చును. కాని సహజ ముగ నియామకపు ఉత్తరువు అనునదొకటి యువకున కియ్యబడును. దీనిని యువకుడు భద్రముగ నుంచుకొన వలెను. ముందెప్పుడైనను దీనితో అవసరము కలుగ వచ్చును.

అట్టి నియామకపు ఉత్తరువు యజమానియొద్దనుండి గ్రహించునప్పుడు అందుదాహరింపబడవలసిన ఒక ముఖ్య విషయమును గూర్చి యువకుడు శ్రద్ధగ నుండ వలెను. కొంతకాలమైన పిమ్మట యజమాని యువకుని మానుకొనవలసినదిగ కోరవచ్చును. లేదా యువకుడే అక్కడి నౌకరీ మానుకోవలసిన అవసరము కలుగవచ్చును. అట్టి సందర్భమున యిరుపక్షములవారికి కష్ట, నష్టములు లేకుండునట్లు ఒక కాలపరిమితి నోటీసుగ ఒకరొక రిచ్చుకొనునట్లు అందుదాహరింపబడుట శ్రేయము. అట్టి కాలపరిమితి సర్వసాధారణముగ వాణిజ్యపుషాపులలో ఒకమాస ముండెను. నౌకరీ స్థిరపడబోవు సందర్భమున యిరువురు నీవిషయమై ప్రస్తావింపక పోవచ్చును. అయినను నియామకపు ఉత్తరువు పుట్టినప్పుడైన యీ విషయమై స్థిరపరచుకొని రికార్డు చేసియుంచుట యిరు వురకు శ్రేయము.

## నౌకరీలో చేరవలసిన ప్రథమ దినము

నౌకరీ లభ్యమై, కార్యాలయమునందు ప్రవేశింపవల సిన ప్రథమదివసమునందు యువకుడు ఉదయమున సాధా రణముకంటె పెందలకడనే నిద్రనుండి మేల్కొను టుచితము. రేపుదయము పెందలకడనే నిద్రలేవవలెనని

సందుకొని, అది మరచి అలక్ష్యభావముచే ఆలస్యముగ లేచు యువకులే యిప్పుడు జాస్తిగ గలరు. నిద్రనుండి త్వరగ మేల్కొనుట అసాధ్యకార్యముగాదు, పట్టుదల ఒకటి ఉండవలెను గాని. పట్టుదలకంటె కూడ కొన్ని సాధనల మూలమున దానిని సాధింపవచ్చును. గతరాత్రి నిద్రకు పోవునప్పుడె నాలుగాలుకంటె అరగంట ముందుగ ప్రక్కచేరుటవల్ల ఆజాడ్యము కొంతవరకు మరల వచ్చును. నౌకరీలో చేరవలసిన దినమున యువకుడు నాలుగాలుకంటె ముందుగ నిద్రనుండి లేచుటవల్ల కొన్ని అవకతవకలు తప్పించుకొనవచ్చును. తీసుకొనవలసిన సామగ్రి నంతటిని ఒక్కదానిని గూడ మరువక సేకరించుకొన గలుగును. క్రొత్తగా నడుపబడిన కార్యాలయమునకు చేరే మార్గము తప్పిపోకుండ సకాలమునకు చేరగలుగును. కార్యాలయమునందు చేరబోవు ప్రథమ దినమునందు యజమాని యువకుని నడవడికను, ఉనికిని, ధరించువస్త్రములతీరును, సకాలమున చేరినాడా లేదా యను విషయమును బహు జాగరూకుడై పరిశీలించును. మొదటిదినమంతటి పృచ్ఛను రెండు, మూడు దినములు గడచిన వెనుక చేయ్యకపోవచ్చును. పై విషయములలో యువకుని జాగ్రతయు, శ్రద్ధయు నగపడచక పోయినను ప్రమాదము లేదుగాని ముందు నెప్పుడైన పొరపాటు, విమర్శనకు నవకాశము కాగలదు. ఆ కార్యాలయమునందు ఆయువకునకు స్థానము కల్పింపబడుట లాభదాయకమా, నష్టదాయకమా యని యజమాని బేరీజు వేసికొనుచుండును. ఈ యువకునికన్న ముందుగ చేరి పనిచేయుచున్న యితర కార్యాలయోద్యోగులనేకులు గూడ నా యువకుని నడవడికను గుర్తించుచుందురు. యువకుని నడవడిక ఉనికి వచ్చినప్పుడే వారు రహస్యాపడుచుందురు. కార్యాలయమునందు విధింపబడెడు పెక్కుపనులయందు యువకుడు అప్రమత్తుడై యుండవలెను. మొదటిదినమున శ్రద్ధగనుండి క్రమేపి ఆ శ్రద్ధను అశ్రద్ధగ మార్చుజనదు. అది నెప్పటికిని ముప్పునకు కారణమగును. ఉద్యోగులకు యజమాని అధికవేతనముల నియ్యబోవునపు డిది అడ్డు తగలును.

నిర్ణీతసమయమునకు కొంచెము ముందుగనే కార్యాలయముచేరు టుత్తమము. ఇదే అలవాటుగ పరిణమించిన మరియు మేలు.

పరిశుభ్రమగు దుస్తులు ధరింపవలెను. చినిగి చెలికలైపోయినవి, మకిలియైనవి, దుర్గంధపూరితమైనవి ధరించుట నేయజమానిగూడ సహింపడు. ఒకానొకని నడవడికను కనిపెట్టుటకు అతడు ధరించు దుస్తులతీరు చాలవరకు తోడ్పడును. దుస్తులు ధరింపబడుతీరు ననుసరించి యెవ్వడు రౌడీయో, యెవ్వడు పెద్దమనిషో, యెవ్వడు ఉద్యోగియో, యెవ్వడు విద్యార్థియో, యెవ్వడు వస్తాదో, యెవ్వడు సంగీతవిద్వాంసుడో, యెవ్వడు చిత్రకారుడో, యెవ్వడు యువకవియో, యెవ్వడు ప్రాచీనకవియో గుర్తింపగలుగుచున్నాము. దుస్తులనుబట్టి వృత్తులను గుర్తింపగలుగునటులనే నడవడికనుగూడ గుర్తింప సాధ్యము. ఇదటులుండ ఒకానొక కార్యాలయమునందు నౌకరీచేయుచున్న యొకని వస్త్రధారణమునుబట్టి ఆ కార్యాలయముయొక్క స్థితిగతులగూడ నిర్ణయింపవచ్చును. ఈ సిద్ధాంతము ననుసరించి తనకార్యాలయముయొక్క ప్రతిష్ఠ, గౌరవములకైన యువకుడు శుభ్రమగు దుస్తుల ధరించుట యావసరము.

యువకుడు తన కోటుజేబునందో, చొక్కాయిజేబునందో యెల్లప్పుడును ఒక చిన్న నోటుపుస్తకమును, పెన్సిలును, రబ్బరును, వలసిన సమయమున పెన్సిలు చెక్కుకొనుటకు వీలుపడునంత పదనుతో నొక పేనాకత్తిని, చిన్నకత్తెర నుంచుకొనుట ఉత్తమము. కార్యాలయాధికారి తన తాబేదారు కప్పచెప్పుడు నియమించుకార్యమును అట్టిపుస్తకమునందు వ్రాసికొని జాగరూకుడై యుండుటకు పై వస్తువులు చాల యుపయోగపడ గలవు. దీనివిషయమై యువకుడు శ్రద్ధగనున్నచో యజమాని నియమించెడు ఒకానొక కార్యమును జరిగించుట యందు యించుక యేమరి, యజమాని కొంతతడవాగి ఆపనినిగూర్చి యువకుని ప్రశ్నించినప్పుడు తెల్లమొగము వేయవలసియుండును. ఈ అవకతవకను కమ్ముకొలచేసుకొనుటకు యువకుడు అనృతములాడ ప్రయత్నించును. పాపముల నీ విధముగ పెంచుకొనక స్వామికార్యములం

దప్రమత్తుడై యుండదలచిన యువకుడు పై వస్తువు యుపయోగమును గ్రహింపగలడు.

## నూతన శకారంభము

యువకునకు నౌకరీ దొరికినపిమ్మట తన జీవితమున క్రొత్తదశ లభ్యపడినట్లు మనసా స్మరించవలెను. ఇంతకు మున్ను యీ యువకుడు విద్యార్థి, యిప్పుడో ఉద్యోగి. కలమో యిదివరకువలె పాఠశాలగాదు. పరిహాసము చిలిపితనముల కిందు తావులేదు. ఇచట ఒకరికి గౌరవము చూపి తాను గౌరవముపొందవలెనను లోకోక్తి మరువ తగదు.

## కార్యాలయపు పనిముట్లయందు శ్రద్ధ

తన స్వంతసొమ్ము కాదుగదాయని కార్యాలయము నకు సంబంధించిన అనేకవస్తువులను పాడుచేయగూడదు. ప్రతివస్తువును స్వంతవస్తువుకంటె హెచ్చుశ్రద్ధతో జాగ్రత్తతో యువకు డుపయోగింపవలెను. కార్యాలయము లాభములతో నడచుచున్న యువకునకుగూడ లాభసాటియే. నష్టపడుచున్న యువకునకుగూడ పతనము తప్పదు. కార్యాలయముయొక్క ఉచ్ఛనీచస్థితులందు యువకునకుగూడ కొంత బాధ్యత గలదని తెలిసికొనవలెను. యువకుని వేతనము స్వల్పమే కావచ్చును. అయినను కార్యాలయాభివృద్ధికి యువకుని సేవగూడ కొంత పునాదియే. కార్యాలయపు పనిముట్లు, సామగ్రి దుబారా యగుచుండుట యేయజమానియు హర్షింపడు. ఇలాని యువకుని, లేక నౌకరుయొక్క చేయిదుబారా యని యజమాని గ్రహించునేని పెద్దపనులు అట్టినౌకరుపరము చెయ్యబడకపోవచ్చును. ఇదంతయేకాక యువకుని భావ్యభివృద్ధికిగూడ భంగపాటుగ పరిణమించును.

## కార్యాలయసమాచారములు, రహస్యములు

కార్యాలయమునకు సంబంధించిన సమాచారములు బహుభద్రముగ కాపాడవలెను. అచ్చటి రహస్యములు నౌకరు మరెచ్చటను బయలుపెట్టరాదు. ఈ దురలవాటు చాల ద్రోహకారి. అదియునుగాక అసలు నౌకరీకే భంగపాటు ఘటస్థింపవచ్చును.

కాలుజారినను తీసికొనవచ్చును గాని నోరు జారిన తీసికొనజాలము. కార్యాలయమునకు, యజమానికి సంబంధించిన విషయాలనేకముల రహస్యములగూర్చి యువకు డెవ్వరితోను స్వంతవ్యాఖ్యానముల జరుపకూడదు అట్టివ్యాఖ్యానముల నాయువకుడు లక్ష్యభావమున చేసియుండకపోవచ్చును. కాని యితరుల కయ్యవి చాల అమూల్యములు. పరిహాస మొనర్పదలచినవారికి, ప్రత్యర్థి కోటికి అవి విలువైన సామగ్రికాగలవు.

## స్థలసూచనము

నౌకరీలో ప్రవేశింపకమున్నే యువకుడు ఆసంస్థయొక్క నలుమూలలు తెలిసియుండుటమంచిది. ముఖ్యముగ హెడలిప్టులములు, వ్యాపారస్థలములు ఎరిగియుండుటావశ్యకము. యజమాని ఎక్కడికేని పోయిరావలసినది యువకు నాజ్ఞాపించినప్పుడు అదెక్కడనో తెలియదన కుండ వెంటనే వెడలగలుగునంతటి పరిచయ ముండవలెనని కొనవలెను.

టెలిఫోనులలో వచ్చెడి పిలుపుల నందుకొను నాటికి తగు సమాధానముల నిచ్చుట నేర్చుట మంచిది.

## అధికారి సహించని దురలవాట్లు

సిగరెట్లు, బీడీలు, పొగాకునమలుట మొదలగునవి చాల చెరుపు. వీని నేర్చుకొనుటకై పలుసార్లు యువకుడు తనమనసుని విడవవలసియుండును. ఈ కారణమున కార్యాలయపుపనులు సరిగ నిర్వర్తింపబడక పేరు కొనును. తననౌకరు పలుతడవలు కార్యాలయముపు వరండాలలో తిరుగుచుండుట యజమాని సహింపడు. తాంబూలచర్వణ మొనర్చుచునే అధికారులతో ప్రసంగించుట కొందరి కలవాటు. ఇట్టిదురలవాట్లు యువకుని నిర్లక్ష్యభావమును సూచించును.

## అదనపు చాకిరీ

కార్యాలయమునందు నూతనముగ ప్రవేశించి స్వల్ప వేతనమునే గ్రహించుచున్న యువకునకు పైయుద్యోగులు అనేకవిధములగు చాకిరీని నియమింతురు. ఈ చాకిరీని చేయుటకు యువకుడు జంకకూడదు, సంకోచింప

కూడదు. ఈ సందర్భమున గౌరవభంగ మనుభావమును చొరనీయకూడదు. పైఅధికారులు నిర్ణయించు ప్రతి దానిని యువకుడు చేయవలసిన బాధ్యత లేదు. అయినను కార్యాలయమునందెవ్వరో ఒక రద్దానిని నిర్వహింపక తప్పదు. అట్టి వెట్టి అరవచాకిరియంతయు స్వల్పవేతనముల గ్రహించువారిపై బడును. కనుక, విసుగుచెందక అట్టిపనుల చేయుటకుత్సాహము ననుసరచిన వేతనాభివృద్ధిసమయమున ఆ మంచితనము బహుప్రయోజనకారి కాగలదు.

నూతనముగ కార్యాలయమునందు చేర్చుకొనబడిన యువకుడు ప్రత్యేక మొకశాఖకు నియమింపబడినను యితరశాఖలలో నెవ్వరేని శలవుమీదనున్నను, మరే హేతువుచేత నైనాయితరశాఖలపనులు నిర్వర్తింపబడకున్నను నాయువకుడు యజమాని ప్రోత్సాహము మీదగాని, తనకుతానేగాని నిర్వర్తింపగలిగియుండిన చాలమంచిది. ఈ పనులను తనకు మొదటను విధింపబడిన కార్యములను ముగించిన వెనుకనే చేయవలెనుగాని తనపై గల స్వంతబాధ్యతను విడిచిపెట్టి చేయరాదు. ఇట్లొనర్చుటచేత అన్ని యితరశాఖలయొక్క పరిచయమును యువకుడు కలిగియుండి యజమాని కనుసన్నలలో మెలగుచుండగలడు.

నీచమే యనుగాక సేవకవృత్తియందును కొంత ఔన్నత్యము గలదు. యువకుడు తన నీచపదవిని దరిద్రస్థితిని తరుచు తలకెక్కించుకొని, సేవ నీచమైనదను సిద్ధాంతమును చొరనీయక మెలగినచో సేవ కూడ నొకకళయని, అందును గౌరవమర్యాదలు, ఔన్నత్యము గలవని స్ఫురింపగలదు. ఒకవాణిజ్యసంస్థకు మేనేజరు, లేక సెక్రటరీ యెట్లుఅవసరమో ఒకగుమాస్తా, లేక నలవముగ్ర విసర్జన స్థలమును దినమును పరిశుభ్రపరచు పాకీవాడును అంతే అవసరము. సెక్రటరీ, లేక మానేజరు చేయునదికూడ సేవయే. కాని ఒకరొనర్చునది ఔన్నత్యముతోకూడిన సేవ, రెండవవారిది నీచసేవ. సెక్రటరీ హెచ్చుజీతమును తీసికొను పెద్దకూలి, పెంట లూడ్చువాడు చిన్నకూలి. సెక్రటరీ వారందినములు కార్యాలయమునకు రాకున్న అతనిపనియంతయు నిలువబడియుండును. పెంటయెత్తువాడు రెండుదినములు వరుసగ రాకున్న ఆ కార్యాలయమునం దందరికిని కలరా వ్యాపించుటలో యేలాటిసందేహ మునుండదు. వాణిజ్యమనునది పదిమందితో కూడినది. ఈ పదిమందిలో ఒకరొకరికి చక్కని సహనశీలము, పరస్పరస్నేహభావము హెచ్చుతగ్గుల తారతమ్యమును గమనింపకుండు సౌభ్రాత్రము, ఒరుల అభివృద్ధి, ఒరుల సౌఖ్యమే తమ కానందమనునిపించు ఔదార్యము మున్నగు ఉదారాతిశయములు కలిగియున్నచో ఆ వాణిజ్యసంస్థ చక్కని సమష్టికుటుంబమువలె కానుపించి, అందు నౌకరీచేయు ప్రతియొక్కనికిని ఆప్రదేశము స్వర్గధామమువలె తోచును. అందే ఆనందము, సంతోషము, తృప్తి, ఆరోగ్యము, తేజము విలసిల్లి సేవకవృత్తి నీచసేవగ తోపజేయక అందును ఔన్నత్యముగలదని స్ఫురింపగలదు (సశేషము)

---



మేనకా విశ్వామిత్రులు టి. సుబ్బారావు.



శివలింగము, హంపీ విరూపాక్షాలయము



రాయల జలక్రీడాతటాకము, హంపి

# కర్మబద్ధులు

బి. లక్ష్మీనారాయణరావు

౧

వెన్నెలరాత్రులు. వేసవియందట రాత్రులు మరింత ఆనందదాయకంగా వున్నాయి. శుక్లపక్ష చంద్రుడు ప్రకృతికంతటికిని క్రొత్తచైతన్యం గలిగిస్తున్నాడు.

బసవనగుడిలో డాక్టరు శ్రీపతిరావుగారి మేడ వెన్నెట్లో లలిత వీణవాయిస్తూంది. తీగవంటి దేహం. ఆకోమలమైనదేహంలో ప్రవహించే వినిర్మలరక్తకాంతిని పైకి ప్రసరింపజేసే చాయ. ఎత్తుకుపగిన అవయవసౌష్ఠవం. చూపరులదృష్టులను కట్టివేయజాలిన సౌందర్యం. ఇప్పుడిప్పుడే యౌవనం పొడమూపుతూంది కాని, బాల్యచాపల్యం, ముగ్ధత్వం, యింకనూ పూర్తిగా వదలలేదు. ఒక్కతేబిడ్డ అవడంవల్లనూ, స్వేచ్ఛగా పెరగడంవల్లనూ ముఖంలో కొంత పెంకెతనంకూడా గోచరిస్తూంది.

లలిత తన సన్నని గాత్రాన్ని వీణానాదంతో మిళితంజేసి, మోహనరాగంలో "నను బాలింప, నడచి వచ్చితివో నాప్రాణనాథా" అనేకృతి పాడుతూంది. అంతలో ప్రకాశంవచ్చి యెదుటనిలబడినాడు. కాని, గానసమాధిలోవుండే లలితకు బాహ్యజ్ఞానమే లేదు.

"వనజనయన, నీమోమును జూచుట జీవనమని,
నెనరున, నామనసు మర్మము దెలిసి" నను.

తన్నుమరచి పాడుతున్నది లలిత. ప్రకాశం చిరునవ్వు నవ్వుతూ అల్లే నిలబడినాడు. వయసిరువదియేండ్లు. ఎత్తైన పలుచనిదేహం. సాధారణంగా అగుపడని అందం. ముఖమెప్పుడూ నవ్వులు కురిపిస్తూంటుంది. లలిత చల్లగా పాడుతూనే వుంది.

"సురపతీ నీలామణినిభతనువుతో"

అప్పుడు,

ప్రకాశం:—ఆగు లలితా, రసభంగమవుతుందని నేనంతసేపు ఆగలేను.

లలిత వులిక్కిపడింది. ఎదుట నవ్వుతూ నిలుచున్నాడు ప్రకాశం.

లలిత:—ఎంతసేపైంది ప్రకాశం వచ్చి? నే గమనించనే లేదు.

ప్రకాశం:—కొంతసేపయిందికాని, నేను నల్లగున్నానా లలితా?

లలిత:—నీవు నల్లగున్నావని యెవరన్నారు?

ప్రకాశం:—ఇదివరకూ పాడుతున్నావుగా "సురపతి నీలామణి నిభతనువుతో" అని.

లలిత:—నీకు పెంకెతనం జాస్తి అవుతూంది ప్రకాశం. ఈనాలుగేళ్లూ మెడికల్ స్కూల్లో యిదే నేర్చినట్టుంది. నేను నీతో మాటలుమానుతా.

ప్రకాశం:—అంతకోపమెందుకులే. నేనే మద్రాసువెళ్లిపోతా. అక్కడ ఆస్పత్రిలో పనినేర్చుకున్నట్టయినా అవుతుంది.

లలిత:—వద్దు ప్రకాశం, వెళ్లొద్దు. నాకు నీపైన కోపంలేదు.

ప్రకాశం:—మరి నన్ను పెంకెవాడన్నావుగా?

లలిత:—నీవు యీరోజు మద్రాసునుంచి వచ్చి, మరి అంతలోనే వెళ్లిపోతానంటే?

ప్రకాశం:—అదిగో, మాట తిరగేస్తున్నావు. మొదటనే నేనువెళ్తానన్నానా? నీవు స్కూల్లో యిదే నేర్చినట్టుంది.

లలిత:—ఏమోలే. నీతో వాదించలేను. రాత్రి భోజనమయినాక హిందూస్తానీపాటలు పాడతానన్నావు కదూ. మరి యిప్పుడు పాడవూ ప్రకాశం?

ప్రకాశం:—నేకోరిన కృతి ఒకటి నీవు పాడితే, తర్వాత నీవు కోరినన్ని హిందూస్తానీపాటలు నేను పాడుతా.

లలిత:—కానీ. ఏదిపాడమంటావో చెప్పు.

ప్రకాశం:—నాయెదురుగా అలా కూర్చుని నిదానంగా, "చిన్ననాడె నా చెయిపట్టితివి" అనే కృతి పాడు.

లలిత పాడుతూంది. శ్రీపతిగారూ, ఆయన భార్య కమలమ్మా వచ్చి కూర్చుని తాంబూలం వేసుకుంటూ పాటవింటున్నారు. శ్రీపతిరావు.

శ్రీపతి:—అంతేనా! ప్రకాశాన్ని చూచి పాడుతూంటే, అతన్నిగురించేనేమో అనుకున్నా.

లలిత సిగ్గుతో తలవంచుకొని జవాబుచెప్పక ఊరుకుంది.

కమలమ్మ:—ఏమిహాస్యమండీ! ఇట్టి యభిప్రాయాలన్నీ పిల్లతలలో వేస్తున్నారు. ఇప్పటికే పిల్లదరికీ సంగీతంపిచ్చి తలకెక్కి యింటిని నాటకంశాలో టరుగా మార్చేసినారు. ఇంక వివాహాలు వింటూంటే.........



"లలిత పాడుతూంది......పాటవింటున్నాడు శ్రీపతిరావు."

లలిత పాటముగించి, "నాన్నా, ప్రకాశాన్ని హిందూస్తానీ పాడమను" అంటూ తండ్రివద్దవచ్చి కూర్చుంది.

శ్రీపతి:—పాడ్తాను కాని, నీవింతసేపూ యెవరిని గూర్చి పాడుతున్నావమ్మా?

లలిత:—ఎవరినిగూర్చికాదు నాన్నా, త్యాగయ్యకృతి.

శ్రీపతి:—ఇంక నీతక్కెరు చాలించు. నీవేమ చెప్పినా యింతే. నీకు ఆటా పాటా? నీకు జీవితంలో ఆనందమునేదే కష్టమనిపించదు. లలితకూడా మా వనపాటువులతో జీవితం గడపాలంటావు. మా సంగీతమూ, మామాటలూ నీచెవికి కఠోరంగావుంటే చెవులుమూసుకోరాదూ.

కమలమ్మ:—నేనంటే మీ [illegible]తే లెండి. నామాటలెప్పుడూ మీకు చెడ్డ[illegible]టాయి. మీరొక్కరే పిల్లదాని సౌఖ్యం కోరేవారు!

శ్రీపతి:—సరేలే. నీమాటలుచాలించి పాట వింటూకూర్చో. ప్రకాశం, మీరిద్దరూ 'హరిగుణగావత, నాచుంగీ' అనేపాట పాడండి. విని చాలరోజులయింది.

ప్రకాశం:—లలితా, హార్మోనియం తీసుకురాపో.

లలిత హార్మోనియం తెచ్చి యిచ్చింది. ప్రకాశం కొంతసేపు యమునాకల్యాణిరాగం ఆలాపనజేసి, పాట అందుకున్నాడు. లలిత తనస్వరం ప్రకాశంస్వరంతో జేర్చి అనుసరిస్తూంది.

"హరిగుణగావతనాచుంగీ, మైతో. హరి"
కోయి బాదెముకురా, కోయివారణాసీ,
ఘర్ మై ఒరశన్ పావుంగీ, మైతో॥ హ॥
మీరాకే ప్రభూ, గిరిధరనాగర్, నితార
ప్రేమరసచాకుంగీ, మైతో॥ హరి॥"

ఇరువురిస్వరాలూ హార్మోనియంనాదంతో చేరిపోయి యేకతోముఖంగా ప్రవహిస్తున్నాయి. ప్రకాశం యొక్క గంభీరమైన ఝూలరీస్వరానికి లలితస్వరం మార్దవాన్నీ, లాలిత్యాన్నీ కలిగిస్తూంది. వసంతకాలపు చంద్రుడు కలిగించిన వాతావరణంలో లీనమై, యీప్రపంచాన్నే మరచిపాడుతున్నారు కోకిలజంటవలె. శ్రీపతిరావుకు పరమానందమయింది. కండ్లకొలుకులలో ఆనందబాష్పాలు నిలిచినాయి. ఈ యిరువురి స్వరములూ ఐక్యమైనట్టు వీరిజీవితములు రెండూ ఐక్యమై నడవడం తానుజూచి ఆనందించడ మెప్పుడా యనుకున్నాడు.

పాట ఆగింది ప్రకాశం హార్మోనియంనిలిపినాడు.

లలిత:—నాన్నా, ప్రకాశాన్ని 'రామ కహానాకీ, ఏకిన్‌మర్కీకా మైనా' అనేపాట పాడుమను నాన్నా. ప్రకాశం పాడినట్లాపాట ఎవ్వరూపాడలేరు.

శ్రీపతి:—ఈనాటికిచాలులే లలితా. నేడే వూరినుంచివచ్చి చాలాఅలసిపోయియుంటాడు. పోయి పడుకోనీ. ప్రకాశం, పడుకోపో. ఇంకేం, పరీక్షలయినాయి. [illegible]కొన్నాళ్లు పుస్తకాలు కట్టిపెట్టి హాయిగా కాలంగడుపు.

లలిత:—నాకు హిందూస్థానీపాటలు నేర్పమను [illegible]నాన్నా. నే నడిగేకొద్దీ గర్వం జాస్తి అతనికి.

ప్రకాశం:—ఇంతగడుసుదాని కెవరు నేర్పుతారు పో. ఇప్పుడన్నదానికై క్షమాపణవేడుకుంటే గాని నీతో మాటలుకూడా ఆడను.

అని నవ్వుకుంటూ వెళ్లిపోయినాడు.

లలిత:—చూడు నాన్నా[illegible] క్షమాపణ అడగాలట. నేనేమన్నాను?

శ్రీపతి:—పెద్దవాణ్ణి గర్వమనడం తప్పుకాదూ. రేపు క్షమించమని అడిగితే పోయిందిలే. ఇక పోదాంపద. పదిగంటలయింది.

## ౨

సాయంకాల మేడుగంట లయింది. శ్రీపతిరావుగారప్పుడే క్లబ్బునుండివచ్చి హాలులో పేపరు జూచుకుంటూ కూర్చున్నారు. ఇంతలో కమలమ్మ వచ్చి భర్తపక్కన కుర్చీలో కూర్చుంది. శ్రీపతిరావుగారు పేపరు పక్కకు పెట్టి,

"ఏ మాశ్చర్యం! నేడు తీరికగాకూర్చున్నావు?"

కమలమ్మ:—వంటయింది. లలితా, ప్రకాశం సినీమానుంచీ యింకా రాలేరు. మీరేమో యినాళ్ల త్వరగావచ్చినారు, మేలే. ఇంకా వాళ్లెంతసేపటికి వస్తారో?

శ్రీపతి:—ఇప్పు డేమంతపొద్దయింది? ఏడు గంటలేకదూ! అర్ధగంటలో వస్తారు.

కమలమ్మ:—నేనేమైనా అంటే మీకు కోపం వస్తుందికాని, లలిత ప్రకాశంతో యీవిధంగా తిరగడం బాగులేదండి. పిల్లలుగావున్నన్నాళ్లూ సరిపోయిందికాని యికమీదట యింతస్వేచ్ఛగా వదిల్తే లోకులేమంటారు?

శ్రీపతి:—నీమొగం, యేమంటారు? వీళ్లింకా పిల్లలుకాక పెద్దవాళ్లయినారేం? ఒక్కరవడానికయినా యేముంది? ఎప్పటికయినా భార్యాభర్తలయేవారేకదూ.

ప్రకాశానికి డాక్టరుపరీక్ష ముగిసింది. అమ్మాయి కూడా స్కూలు ఫైనలయింది. చదువు భంగమవుతుందనే చింతకూడా లేదు. త్వరలో వివాహంచేయాలని యీరోజు క్లబ్బులో స్నేహితులుకూడా మాటప్రస్తావంగా అన్నారు.

కమలమ్మ:—అమ్మా! ఇంతవరకూ పోయిందీ విషయం! అయితే పిల్లగొంతు కోయాలనుకున్నారు! ఏదో దిక్కులేనిపిల్లవాణ్ణితెచ్చి సాకుతున్నారని అనుకున్నానేకాని అల్లుణ్ణిచేసుకుంటారనుకోలేదు. సాకిన మమతవుంటే ఆస్తియివ్వండి. ఎక్కడైనా పిల్లనుదెచ్చి వివాహంచేయండి. కాని, నాఒక్కబిడ్డనూ యీ దిక్కులేనివాని కివ్వకండి.

శ్రీపతి:—ఏమికమలా, విపరీతంగా మాట్లాడుతున్నావు. లలితపుట్టకమునుపునుండీ సాకుతున్నావు కదూ ప్రకాశాన్ని? వానిలో ఏంలోపం కనపడింది నీకు? ప్రకాశం లలితమగడని యెన్నిసార్లో నీవే లలితను హాస్యంచేస్తూంటివే. నీకీసంబంధం యిష్టము లేదని నేనెన్నడూ అనుకోలేదే!

కమలమ్మ:—లలితచిన్నప్పుడు ఏదోహాస్యంగా అనివుంటాను. ఐతే అదే నిజంకావాలేనేం? ధనమూ, యింటిపేరూ, బలగమూ యేమిచూచి యివ్వాలంటారండి పిల్లను?

శ్రీపతి:—ఏమిచూచా? పిల్లవాని గుణాన్నీ, ఆరోగ్యాన్నీ, రూపాన్నీ, బుద్ధినీ, యింతేకాక లలితకూ వానికీ పరస్పరంవుండే ప్రేమనూచూచి. ఇంకేం కావాలె? ధనంప్రాధాన్యమైతే నా ఆస్తికి వేరేయెవరున్నారు? లలితకేకదూ చెందుతుంది?

కమలమ్మ:— మీరు సమాధానంచెప్పడానికేం లెండి? మీపిల్లనెవరికిచ్చినారని అందరూ అడిగినప్పుడేమనిచెప్పడును? మాయింట్లోవుండిం దిక్కులేని పిల్లవానికని చెప్పాల్నా! అది తలవంపుకదూ!

శ్రీపతి:—ఎవరికిచ్చినారని అడిగితే, మాప్రకాశానికని చెప్పు. ఎవరో పెద్దమ్మలెత్తిపొడుస్తారని లలిత మనస్సుకు విరుద్ధంగాచేసి దాని జీవితాన్ని నాశంజేయమంటావా? లలిత ప్రకాశాన్నెంతగా ప్రేమిస్తున్నదీ సంగతి గ్రహించినావా?

కమలమ్మ:—పెండ్లి కాకమునుపే యేమి ప్రేమండీ! మనం సంసారంచేయడంలేదా? మనం ముందు మాట్లాడివుంటిమా?

శ్రీపతి:—నేచెప్పేవిషయం శ్రద్ధగావిను. మనకు వివాహమైనప్పుడిద్దరికీ చిన్నవయస్సు. ఒకరికొకరికి క్రొత్త. వివాహమైన తర్వాత భర్తవద్ద కాపురమెట్లు చేయడం నీవు నేర్చుకున్నావు. భార్యగా నిన్ను చూడడం నేను నేర్చుకున్నాను. ఇప్పటి మనజీవితానికిద్దరమూ అలవాటుపడినాము. అంతే. మనసంఘంలో నూటికి తొంభైతొమ్మిది సంసారాలట్టివే. కనుకనే ప్రేమతత్వం మనకు తెలీదు. లలితాప్రకాశాల సంగతి వేరు. లలిత పుట్టిందిమొదలు ఒకచోట ఆడుకొని, ఒకకంచంలో తిని, అన్యోన్యంగా పెరిగినారు. ఒకరినివిడిచి వకరు భోజనం జేసిందికాని, కడకు కాఫీ తీసుకుందికాని ఒక్కనాడు చూచినావా? మొన్న లలితకు జ్వరంవచ్చినప్పుడు ప్రకాశమెంత బెంగపెట్టుకున్నదీ, నిద్రాహారాలులేక ఎట్లు లలితను కనిపెట్టి వుండిందీ గమనించినావా? ప్రకాశం మద్రాసులో వుండేటప్పుడు ప్రతివారం జాబువ్రాయకపోతే లలిత యెంత భయపడేదీ, తానెంత శ్రద్ధగా జాబులు వ్రాసేదీ చూస్తున్నావుకదూ? ఇంత దృఢంగా వుండే వీరి ప్రేమబంధాలను తెంచివేయాలంటావుకదూ? నీవింతవరకూ కండ్లుమూసుకొని వుండివుంటే వకసారి లలితనే అడిగి కనుక్కోరాదూ?

కమలమ్మ:— దాన్నేమండీ అడగడం? మనం మంచిసంబంధం కుదిర్చితే మనమాటకాదని యెదురు తిరుగుతుందా? నాతమ్ముడు వకీలుపరీక్ష కీయేడు పోయినాడుకదూ. వాడు ప్రకాశానికంటే యెందులో తక్కువ?

శ్రీపతి:—ఇంక చాలించు. నీకు హృదయముందని యింత చెప్పిచూచినాను. ఇక నీతో వాదించి ప్రయోజనం లేదు. ప్రకాశానికి నాయందు పితృగౌరవముంది.

నాకు కమాల్లులేరు. ఈవివాహంవల్ల నాలలిత నా జీవితపర్యంతం నావద్దనే వుంటుంది. ఈవివాహం నీ కిష్టమున్నా, లేకపోయినా జరిపితీరుతాను. ఉత్తరార్ధంలో వుండే మనసంసారం యీకారణంవల్ల ఛిద్రమయినా, కండ్లుదెరవని లలితజీవితాన్నిమాత్రం నాశం చేయను.

ఇంతలో మోటారు యింటిముందర ఆగింది. కమలాప్రకాశాలు సంబరంతో కిలకిలనవ్వుకుంటూ వచ్చినారు. తండ్రి కుర్చీపట్టుకొని నిలబడి,

లలిత:—రమ్మంటే వచ్చినావుకావు నాన్నా, ఎంతబాగుం దనుకున్నా ఈరోజుఫిల్ము.

శ్రీపతి:—ఏమిటా ఫిల్ముపేరు?

లలిత:—'కిస్మత్ కా షికార్' అని హిందీ టాకీ నాన్నా. ప్రకాశం కొన్నిపాటలుకూడా వ్రాసుకున్నాడు.

శ్రీపతి:—'కిస్మత్ కా షికార్' అంటే అర్థమేమోయి ప్రకాశం?

ప్రకాశం:—Prey of Destiny అని. మానవులు విధిచే వెంటాడబడుచున్నారని భావం. కర్మబద్ధులన్నమాట.

శ్రీపతి:—భావం మంచిదే. ఏమోరేపు విరామముంటే నేను వెళ్లివస్తా. భోజనానికి వేళయింది పదండి. తర్వాత కొంతసేపు పాడి వినిపింతురు.

## 3

సంధ్యాసమయం. ప్రకాశం మేడపై హాలులో కూర్చుని, తాను సినిమాలో విన్నపాటలను హార్మోనియంపై వాయిస్తున్నాడు. లలిత గబగబా పరుగెత్తుకొనివచ్చింది. ముఖం మెత్తబారింది. కండ్లలో నీళ్లు కదులుతున్నాయి. ప్రకాశం లేచి తనప్రక్కన కూర్చోబెట్టుకొని,

“ఏమి లలితా సమాచారం? ఎందుకేడుస్తున్నావు?

లలిత:—మనిద్దరమూ యికమీదట మాట్లాడకూడదట. నేను నీవద్ద కూర్చోకూడదట. ఎక్కడికి కలసిపోకూడదని.........

అంటూ యేడ్వడ మారంభించింది. ప్రకాశానికి గుండెనీరయింది. లలితను కొంత సమాధానంజేసి,

ప్రకాశం:—ఎవరన్నారు? నాన్నగారా?

లలిత:—కాదు, అమ్మ. నేను మా మామను పెండ్లిచేసుకుంటాననీ, నిన్నుచేసుకోవడం యిష్టంలేదనీ నాన్నగారితోనే చెప్పాలట. నేను నిన్నుదప్ప యెవ్వరినీ చేసుకోనని ఖండితంగా చెప్పినాను. అందుకు నాపైన కోప్పడి, తిట్టి, యిప్పుడే పక్కింటికి వెళ్లింది

ప్రకాశం మెడకి తనచేతులు రెండూ పెనవేసి అతని ముఖాన్నే చూస్తూంది లలిత. కళ్లనుండి నీళ్లాకటే ధారగా పోతున్నాయి. ప్రకాశంయెదుట వుండునది చిన్నప్పటినుంచీ తనతో ఆడుకున్న పెంకెలలితకాదు. ముఖంలో గాంభీర్యం, వయసుకుమించిన వుద్రేకం కనబడుతూంది. ఆచూపులు ప్రకాశంహృదయాన్ని కరకర కోసేస్తున్నాయి. ప్రకాశం యీప్రపంచాన్నే మరచినాడు. లలితను తనబాహువులలో బంధించినాడు. ఇరువురికీ దేహములపై ప్రజ్ఞలేదు. ఇంతలో కమలమ్మ ప్రవేశించింది. “లలితా” అని గట్టిగా పిలుస్తూ రెక్కపట్టి లాగింది. ప్రకాశం తలవంచుకొని నిశ్చేష్టుడై నిలబడినాడు. లలిత యేడుస్తూంది. కోపంతో రోజుతూ రెండవ శక్తిస్వరూపంలా వుంది కమలమ్మ.

కమలమ్మ:—లలితా, వెళ్లు క్రిందకి.

అని గర్జించగనే, లలిత తలవంచుకొని మెల్లగా వెళ్లిపోయింది. కమలమ్మ చురచుర ప్రకాశాన్ని చూస్తూ,

“ప్రకాశం, నిన్ను రెండేండ్లపిల్లవాడప్పటినుంచీ నాకొడుకువలె సాకినాను. నీవు నాకింతద్రోహం జేస్తావనుకోలేదు. చెల్లెలిగా జూచుకోదగిన పిల్లజీవితాన్ని నాశంచేస్తున్నావు. నిన్నిన్నాళ్లూ పోషించి, చదువు చెప్పించినందుకిది ప్రత్యుపకారం. ఏమీ తెలియని పిల్లను మోసంజేసి పెళ్లాడదామనుకున్నావుకదూ! ఇంత



“ లలితను తనబాహువులతో బంధించినాడు ”

స్వాతంత్రమా ! ఆయన నీకెక్కడ చదివిస్తున్నాడని పొగరు తలకెక్కింది నీకు. తిరిగి చెప్పడానికి యింటబెట్టిన నిన్ను తనమాత్రం దూరంగా వుంచవలసింది. పెండ్లికి పిల్లతో సరసాలాడుతావా ? ఇక్కడే వెళ్లిపోయ్చినావే, సిగ్గులేదూ. ఇంకెం పరీక్ష ప్యాసైపోయి వచ్చినాక, యెక్కడైనా పోయి బతకొచ్చు ఏమనా ! సరే, అప్పటివరకి గానీ వుండు, నీవో, నేనో యెవరైనా వకరు యిల్లువిడువవలసి వుంటుంది. ”

అని గుక్కతిప్పకుండా నాగి చరచర క్రిందికి దిగిపోయింది.

అట్లే నిలబడిపోయినాడు ప్రకాశం. సున్నితమైన అతని హృదయ మీపహాస్యముల ఘాటి కోర్వలేకపోయింది. తల వంచుకొనే తనగదిలోకి వెళ్లినాడు. పెట్టె తెరచి అందులోనుంచి తనవద్దున్న, ఫోటోలుంచిన ఆల్బం తీసినాడు. తానిదివరకూ స్వయంగా తీసిన లలిత ఫోటోలన్నిటిని ఏరితీసుకున్నాడు.

క్రిందహాలులో యెవ్వరూ లేరు. లలిత తన రూములో ఏడుస్తూ కూర్చుంది నిశ్శబ్దంగా. అట్లే చూస్తూ నిలబడినాడు ప్రకాశం. దృష్టిమరల్చుకోలేకపోయినాడు. కళ్లనీళ్లు క్రమ్మినాయి. ముందుకుపోవడానికి కాళ్లాడవు. ఇంతలో వంటింటి కవు బమ్మశబ్దం వినబడింది. నిద్రలో నడచువానివలె పైకి నడచిపోయినాడు ప్రకాశం.

## ౪

కాశీవిశ్వవిద్యాలయంలో ఆంగ్ల భాషాధ్యాపకుడు శేఖరంగారి బంగళా. సాయంకాలం తోటలో భార్యతో మాట్లాడుతూ కూర్చున్నారు.

లలిత కిప్పుడిరువదియేండ్ల వయస్సు. ముఖంలో ముందున్న కాంతి, వికాసం లేదు. దేహంపై చక్కని నీరసంగా అగపడుతూవుంది. దేహమున తత్వాలు కింకా అసాధారణమైన మార్పు జెందినవి.

శేఖరం :—లలితా, పిల్లవాడేడీ ? ఎట్లున్నాడీరోజు ?

లలిత:—దాసీ దిప్పుడే పిలుచుకొనిపోయింది. అది 'లీవర్' బాధేనండీ. ఎవరో వైద్యుడొస్తాడన్నారే?

శేఖరం:— ఇంతట్లోరావచ్చు. ఆయనే నిన్న మాకాలేజీలో పాటపాడిందికూడా. రమ్మంటే వచ్చినావు కావు. చాలాఅద్భుతంగా పాడినాడు. ఇలాంటిసంగీతం సాధారణంగా వినం. ఎందుకురానన్నావు?

లలిత:— ఏమో, వూరికనే.

శేఖరం:— నీకు సంగీతంలో యెక్కువ అభిరుచిఅనీ, అందులో హిందుస్తానిపాటంటే ప్రాణమనీ మనపెండ్లికిముందు నీతలితండ్రు లన్నారు. కాని, కాపురానికిచ్చి యిప్పటికి మూడేళ్లయింది, ఒక్కనాడయినా పాడినావు గావు. సంగీతకచ్చేరికి రమ్మంటేకూడా రావేం?

లలిత:— పెండ్లిఅయినాక యెక్కడిపాటండీ! అందులో పిల్లవాడొక్కనిమిషంకూడా వదలడు. ఎప్పుడు పాడకుండాకూర్చోవటం?

శేఖరం:— ఈకారణం నాకంత నచ్చలేదు. ఇష్టమేవుంటే పాడుకోడానికి సమయం దొరకదూ? సాయంకాలం నేవున్నప్పుడు పాడకూడదూ! పిల్లవాడు నావద్దవుంటాడుకదూ?

లలిత:—ఏమో పోనివ్వండి. నాకు దాని పైన మనసుపోదు.

శేఖరం:— ఎంచేత? ఉన్నకళాభిరుచినీ చంపుకోవడమెందుకు? లలితా, నినొ్నకమాట అడగాలని వుంది. నాహృదయం నీకుదెలుసు. మనసిచ్చి జవాబుచెప్పుతావా?

లలిత తలయెత్తి శేఖరంముఖంలో చూచింది. అతడంతరంగంలో నొప్పిపడుతున్నాడని గ్రహించి,

లలిత:—మీరు నన్ను మనసాప్రేమిస్తున్నారని తెలుసు. మీయందు నాకేం దాపరికం?

శేఖరం:— ఈమూడేళ్లుగా మనం కాపురం జేస్తున్నాము. ఒక్కనాడు నీవు ఆనందంగా కాలం




"కమలమ్మ చురచురమని ప్రకాశాన్ని చూస్తూ......"

గడపింది నేను చూడలేదు. జీవితంమీద యింతటివిరక్తి కలగడానికేం కారణం?

లలిత:— సంతోషంలేక నాకేం? ఎన్నడైనా యేడుస్తూకూర్చున్నానా?

శేఖరం:— లలితా, నాకు హృదయంలేదను కున్నావు. తనుప్రేమించేవ్యక్తిమనస్థితి కనుక్కోలేని వాడు మానవు డెట్లవుతాడు! నాకుచెప్పకుండా లోననే కుళ్లుతూవున్నందువల్ల యేంప్రయోజనం? నాతో జెప్పితే నేదీర్చనా నీదుఃఖాన్ని?

లలిత.— మీకు సాక్ష్యమక్కేదయితే చెప్పే దాన్నే.

శేఖరం:— తీర్చడానికి సాక్ష్యంకాకపోవచ్చు. కానిచెప్పినందువల్ల నీహృదయభారం కొంతతగ్గుతుంది. కాబట్టి చెప్పమంటున్నా నామనసు తెలుసుకమా. ఎందుకుజంకు?

లలిత:— ఇదివరలో మీకు నాతోకూడా పెరిగిన ప్రకాశంసంగతి చెప్పినాను జ్ఞాపకముందా?

శేఖరానికి కండ్లుతెరచినట్లయింది.

శేఖరం:— జ్ఞాపకముంది. మన పెండ్లికి రెండేండ్ల పూర్వం, యెవరికీ చెప్పక వెళ్లి పోయినాడన్నావు లలితా, అతన్ని నీవు ప్రేమించినావా?

లలిత జవాబుచెప్పలేకపోయింది. కళ్లనీళ్లు చెక్కులవెంబడి కారిపోతున్నాయి. తలవంచుకుంది. చివుక్కుమనింది. లలితమనోవేదన గ్రహించినాడు. శేఖరం మనస్సు. భార్యను కౌగిటిలోనికిదీసికొని ఓదార్చుతున్నాడు.

లలిత:— మీరు కోపగించుకోకండి. మీహృదయాన్ని నాకర్పించినారుకాని, నేను మిమ్ములను సంతోషపెట్టలేకపోయినాను.

శేఖరం:— లలితా, నాకూ హృదయముంది. ప్రేమఅంటే యేమిటో నాకూ తెలుసు. కాని, గతాన్ని గురించి విచారించితే యేంలాభం. మనం కర్మబద్ధులం. విధ్యన్విష్టులం. నీ యీ జీవితంలో ప్రేమఫలించుటకు మార్గం లేకపోయింది. అంతటిలో జీవితాన్ని నాశంజేసుకోవడంతో అర్థంలేదు. మ యిష్టప్రకారమే ప్రతిదీ జరిగితేయింకేం.

లలిత:— అతడీ ప్రపంచంలో వున్నదీ లేందీ కూడా తెలీదు. ప్రాణంతో వున్నాడనీ తెలిస్తే కొంత ..........

ఇంతలో మోటారుడ్రైవరువచ్చి స్వామిజీగారు వచ్చినారన్నాడు.

శేఖరం:— లేలలితా. మాకాలేజీలో పాటపాడిన సన్యాసి యీయనే. గొప్పవైద్యుడుకూడాను. ఒకరోజు మనింటనే వుండి పిల్లవానికి చికిత్సచేయమని ప్రార్థించినాను. వారికీ తోటబెలూ, పాలూ సిద్ధంచేయించు పో.

※

మధ్యాహ్నం ఒంటిగంటయింది. శేఖరం కాలేజీకి వెళ్లినాడు. పనిముగించుకొని దాసీదికూడా వెళ్లింది. లలిత పిల్లవాన్ని నిద్రబుచ్చి తానూ పక్కనేఒరగి అప్పుడప్పుడే కండ్లుమూసింది. ఇంట నిశ్శబ్దంగావుంది. ఇంతలో మధురమైన రాగాలాపన లలితనిద్రకు భంగం కల్గించింది. లలిత కనులువిచ్చి ఆలకించి వినింది తమ మేడపైన యెవరో పాడుతున్నారు. ఆశ్రావ్యమైన, గంభీరమైన కంఠధ్వని నిదివరకెచ్చటనో వినినట్టుంది. కాని, స్మరణకురాలేదు. చైతన్యరహితంగా వింటూ కూర్చుంది. ఆలాపన పాటలోకి మెల్లగా జారింది.

" రామకహనాజీ యేతన్
    మర్రికాస్మైనా జగజగ. రామ.
మత్రికో దకర్ మహల్ బనావే
    మూర్ఖకహే ఘర్ మేరా
ఆయాబూరా లేజవె చోరా
    ఘర్ నహి తేరా మేరా. రామ.
మర్రికావే మత్రిపెవే మర్రిమే శంకరజోవే
మర్రిమే ఓ మిలగయ మర్రి
    వుప్పర్ చలే జనలోక్. జగజగ". రామ.

లలితకు ప్రాణాలు లేచివచ్చినాయి. గుండె దడదడ కొట్టుకొంటూంది. గబగబ మేడమీదికి వెళ్లింది. కళ్లుమూసుకొని తన్ను మరచి పాడుతున్నాడు సన్యాసి. లలితనుదుటపట్టి 'ప్రకాశం' అని అరచి ముందుకు వ్రాలింది. కిందపడకుండా నిలిపి కుర్చీలో కూర్చోపెట్టినాడు ప్రకాశం. ఆనందమూ, దుఃఖమూ ఒక్కసారిగా లలితను పిచ్చిదానిగా జేసినవి. లలితముఖంచూస్తూ నిలబడిపోయినాడు ప్రకాశం. క్రింద పిల్లవాడేడుస్తూ మేడమెట్లెక్కబోతున్నాడు. ప్రకాశం క్రిందికిబోయి పిల్లవాన్నెత్తుకొని వచ్చినాడు. నిర్జీవప్రతిమవలె కూర్చుంది లలిత. కండ్లనీళ్లు కారుతున్నాయి.




శివభక్తమాహాత్మ్యమున భృగుపత్న్యుపాఖ్యానమున నొకరంగము
(శ్రీ కాశీనాథరావుగారి తంజాపుర ప్రాచీనచిత్రసంగ్రహమునుండి)



# ఋతు సంబంధమయిన జబ్బులు

చాలమంది స్త్రీలు ఋతుకాలమున కడుపునొప్పితో బాధపడుచుందురు. రక్తము విశేషముగా స్రవించును. కల్జానా బిళ్లలను తీసికొన్నయెడల అటువంటి స్థితి యేర్పడదు. ఈ బిళ్లలు నొప్పినితగ్గించును. రక్తస్రావమును అరికట్టును.

ఇదివరకు యిదేమాదిరిగా బాధపడిన యొకస్త్రీ వ్రాయుచున్నది.

"కల్జానా బిళ్లలను వాడుచుండుటవలన యిప్పుడు నేను బాగుగా పనిచేయగలను. నిత్యకృత్యములను యేమాత్రము కష్టములేకుండా చేసికొనగలను." మరియొక స్త్రీ.

"కల్జానా తీసికొన్నతరువాత నా విచారమంతయు మటుమాయమయ్యెను. తిరిగి బలమును పొందుచున్నాను. కొంతకాలము తలదిమ్ముచే బాధపడితిని. ఇప్పుడట్టి జబ్బు లేశమాత్రము లేదు. కల్జానా వదిలిపెట్టి యుండలేను." మీరుకూడ కల్జానా సేవించినచో ఆరోగ్యము కుదుటబడి సుఖముగా నుందురు. పేరొందిన యీ ఖనిజసంబంధమగు ఔషధరాజమును నేడే కొని వాడుడు. జీవిత సౌఖ్య మనుభవింప గలరు. (1)




# Kalzana

ఆరోగ్యాభివృద్ధి గావించు ఖనిజసంబంధమగు ఔషధము.

ప్రతి మందుల దుకాణములలోను బజారులలోను దొరకును.

కల్జానా తయారుచేయునపుడు చేతితో తాకబడి యుండలేదు.

ప్రకాశం:—లలితా, మనం మళ్లీ యీజన్మంలో చూచుకుంటామనుకోలేదు. నీవొకగృహిణివై యుండడం చూచే భాగ్యం నాకుగలిగింది. ఇక నాజీవితంలో కోరదగిం దేదీలేదు. ప్రాతఃకాలం నీభర్త పిల్లవాణ్ణి నావద్దకు తెచ్చినపుడు పిల్లవానిముఖంలో నీపోలికజూచి మరియీజన్మంలో నా లలితను జూస్తావా అనుకున్నాను. నాలలితకుమారుణ్ణే ఎత్తుకునేట్టు జేసినాడు ఈశ్వరుడు.




"సన్యాసి పిల్లవాణ్ణి ఎత్తుకొని వచ్చెను."

లలిత:—(డగ్గుత్తికతో) ప్రకాశం, ఆత్రపడి నీజీవితాన్ని పాడుజేసుకున్నావు. నాయీదేహాన్ని మరొకరి స్వాధీనంజేసినావు. నీవువెళ్లిపోయింతర్వాత రెండేండ్లు నాయనగారు నిన్ను వెదకుతూ వూరూరుతిరిగినారు. ప్రతివార్తాపత్రికలోనూ ప్రకటించినారు. కాని, నీజాడ తెలిసిందికాదు. మరి నీవు జీవంతో లేవనుకున్నారు. నాన్నగారు లోకానికి వెరచి నన్ను బ్రహ్మచారిణిగా వుండనిచ్చినారుకారు. నాకీవిధి తప్పిందికాదు.

ప్రకాశం:—లలితా, మనం కర్మబద్ధులం. విధిని తప్పించుకోలేం. నిన్ను భార్యగాజేసుకునేపుణ్యం నాకు లేకపోయింది. కాని నిన్ను ఆజన్మాంతం ప్రేమించే అదృష్టంమాత్రం గలిగింది.

లలిత:— నాకీజన్మంలో సౌఖ్యంలేదు ప్రకాశం. నిన్న యీవిషయమైయే ఆయన నాతో మాట్లాడుతున్నారు. మనం ప్రేమించుకున్న సంగతిఆయనతో కూడా చెప్పినాను.

ప్రకాశం:—లలితా, పూర్వంవిషయాలిక మరచిపో. పురుషుల స్వభావం నీకుతెలీను. పదేపదే నాప్రస్తావనదెచ్చి, నీభర్తను నొప్పించి, అతని జీవితంలో, నీజీవితంలోకూడా సౌఖ్యంలేకుండా జేయకు. మన ప్రేమ విషయరహితమయి నిర్మలమయింది. దాని కెప్పటికీ భంగంరాదు. నాకీప్రపంచంలో నీవుదప్ప మరెవ్వరూ లేరు. ఇద్దరం ఒకచోట పెరిగినాము. నీకంటే నాకు తోబుట్టువేదీ? నీవు సౌఖ్యంగావుంటే నాయీజీవితాని కెంతో వుత్సాహం. ఎప్పుడైనా యిద్దరం చూచుకోవచ్చు. మనస్సును శాంతింపజేసుకో. నేనిచ్చినమందు పిల్లవానికి మూడుపూటలువేయి. దాంతో పూర్తిగా గుణమవుతుంది. మరేమందూ వేయకు. నే నీ రోజున కాలేజీలో వుపన్యాసంముగించుకొని రేపిచ్చటనుండీ వెళ్తా. ప్రతిసంవత్సరం నాసోదరిని చూచిపోతుంటాను. బెంగపెట్టుకోకు నాన్నగారెక్కడున్నారు? బాగున్నారా?

లలిత:—ప్రాక్టీసు చాలించినారు. బెంగుళూరులోనే వున్నారు. అప్పుడప్పుడు వచ్చిచూచిపోతుంటారు. కాని నేను అక్కడకువెళ్ళడంలేదు. అమ్మకూడా యిచ్చటికి రాలేదు. నీవుపోయి నాన్నగారిని చూడు ప్రకాశం. నిన్నుతలచుకొని యెన్నిసార్లో పిల్లవానివలె యేడ్చినా రాయన.

బంగాళాముందు కారు ఆగింది. లలిత పిల్లవాణ్ణెత్తుకొని కిందకిదిగిపోయింది. శేఖరం సన్యాసిని కాలేజీకి పిలుచుకొనిపోవడానికై వచ్చినాడు. సన్యాసి మేడదిగివచ్చి శేఖరంతో కారులో కూర్చున్నాడు. లలితవచ్చి వాకిట నిలబడింది. కారు స్టార్టయింది. లలిత కండ్ల నీళ్లు క్రమ్మినాయి. నిమిషంలో కారు దృష్టిపథం దాటిపోయింది. కనీళ్లు కారుస్తూ అక్కడే నిలబడిపోయింది లలిత.

---

# 1816 మార్చి పిండారీ దండయాత్రను వర్ణించు పద్యమాల

అ. ఐ. శంకరరావు

1816 మార్చిలో ఆంధ్రదేశములోనికి పిండారీసందులు చొరఁబడి చేసిన ఘోరకృత్యముల వర్ణించు సీసమాలిక యొకటి ప్రాప్తియం దున్నది. నర్సారావుపేటవాస్తవ్యులైన శ్రీమగ్దులపల్లి సుబ్రహ్మశర్మగారీపద్యము తమకు దొరికినంతవరకు వ్రాసి సాగి నరసింహముగారి (M. A.) ద్వారా నా కందఁజేసినారు. ఈసీసమాలిక పూర్తిగాలేదు. చాలతప్పులతో నున్నది. సరియైనపాఠము నెవరైన ప్రచురింపఁ బ్రయత్నించుటకై మగ్దులపల్లి సుబ్రహ్మశర్మగా రంపినపద్యమును సంస్కరింపకయే ప్రచురించుచున్నాను.

శ్రీ వేంకటేశ్వర శ్రీధర గోవింద విన్నప మాలించు విమలచరిత
ఇలమీఁద....... ......యువనామసంవత్సరంబున సంభవించె
ఫాల్గుణమాసాన పరగ శుద్ధమునందు పిండారిగుంపులు దండిగాను
ప్రజల దోచుట యాదిప్రకటంబుగాఁ జేసి వినిపింతు విమలాత్మ విమలచరిత
పూసగూర్చినయట్లు పొసఁగ మీయంఘ్రులు సీసమాలిక యొకటి వాసిగాను
నవరించి మమ్మేలు సామ్రాజ్యవైభవ కరుణించి బ్రోవవే కమలనయన
పదివేలకెక్కువై పరతెంచుకొనిరాగ రవధూళి మింటికి రశ్మ లెగయ
గోదావరిని దాటి గొబ్బున నానందుపల్లె పట్నముల్ పాడుచేసి
స్త్రీలనుఁ జెరఁబట్టి సిగ్గును విడనాడి బాలల కొందఱ నేలకదిమి
కాంచన రజితంబు కలధనమెల్లను సంచితంబు కారించి సాగిరచట
శుద్ధద్వాదశినాడు సోమవారంబున వేడుకతోఁ గృష్ణవేణి దాటి
అమరావతీయందు నగ్రహారముఁ జొచ్చి నిగ్రహాపరచిరి నీతిఁ దప్పి
కన్యపడుచులనెల్ల కఠినాత్ములై చాల జారులై కొందఱు చరలుకొనఁగ
"హాకృష్ణ, హారామ, హాఅచ్యుతా, మము గావవే యీవేళఁ గరుణతోడ"
ననుచు శోకింపుచు నవనిపై గొందఱు పరుపరు లాడుచుఁ బరుగు లిడుచు
మాతల్లి నీలోన మాతాంగమనియెడి తెగువతో గృష్ణలో మగువ లంత
దుమికిరి యాపదల్ దూరంగ ద్రోలిరి గొల్లున శిశువుల్ ఘోషలిడగ
వాసిరెడ్డ్యన్వయవసుధీశుఁడైనట్టి వేంకటాద్రీశుండు వెరగుపడియె
తోపుదెబ్బలు చాల తోలుతగా వెయ్యంగ నమపి యాపరదండుసాగి రంత
బలుసుపాడును మంచిబలువైన సిరిపురం పెదకూరపాడును పేరెచెల్ల
పాములపాడును పాటిబం డాడిగా నెమలికల్లును మంచినేలపాడు
పొన్నెకల్లును మంచివన్నెగా విశదల నడచిరి గోరట్ల నల్లపాడు

గుంటూరు కంతట గుట్టుగా నేతెంచి పట్టి పౌరుల గట్టిగాను
తహసీలుచేసిరి త్రవ్వి రి యిండ్లిండ్ల కొల్లగా వరహాలు కొనిరి వేగ
చెంబులు కంచాలు చెరవాల బిందెలు నేబులు వస్త్రాలు నీతి దప్పి
వీధివీధుల నెల్ల విరివిగా వెదజల్లి నదురెంతయును లేక నడచి రంత
యెనిగండ్ల కంతేరు నెర బాలెంబును నవులూరు కాకాని నందివెలుగు
కొమ్మూరు నెనమదల కొప్పురావూరును కోడూరు మేడూరు మోదుకూరు
మంగళగిరియును మరిమంచినంబూరు పెనుమాక మద్దూరు పీనపాడు
విక్కుర్తి కంచర్ల విప్పర్ల పల్లె యు పోలవరంబును పొతకమూరు
కంభంబు దరిశెయు కాకర్ల కొమమోలు మాచర్ల సత్తెను మంచికల్లు
మొదలైనపురములు మొక్కల చెరచిరి సకలజనంబులు వికలముగను
కారంబు బూడిదె కండ్లకు నోళ్లకు కఠినులై కట్టిరి కనిమిపడగ
యేమని చెప్పుదు నెదురుగొమ్ములమీద రోకండ్లు ద్రొక్కిరి రొదలు కొనగ
నిట్టిధాటికి వెరచి యెటుబోవజాలక చెట్టులగుట్టల జేరిడాగి
మన్నెదొరలందరు మలలకు నేగిరి మలరాజు గుండయ్య మాన్యయశుడు
సరదార్ల నేర్పర్చి సమయం బిదేయని సూలపిండారుల మదయగొట్టి
పుట్టవాని పాలెంబు పొంతను నిలిచియు దళములమీదను దండువెడలె
మలరాజు గుండయ్య మార్బలములతోడ నులిపించి నురినూకె నూగులేక
తుత్తుమురుముగ నరిగె తురకబలంబెల్ల పారంగదోలిరి పడనుటికిని
మాయమరాటీలు మళ్లివత్తురటంచు నానరా బున్నట్టియడవులకును
అదిచూచి గుండయ్య అందరి బిలిచిరి బొగ్గులకొండకు బోయిరప్రజను
చీమకుర్తికొండకు చేరిరి కొందరు వాయకట్టకు చాల పరుగులిడిరి
బెల్లముకొండకు ప్రజ లంత యేగిరి కొండవీటికొండ..........

మిగిలినభాగముపద్యము లభించలేదు. ఈపైపద్యమును బట్టి పిండారీమూకలు అమరావతిలో ప్రవేశించి యువ సంవత్సర ఫాల్గుణ శుద్ధ ద్వాదశినాడు వాసిరెడ్డి వేంకటాద్రినిచే నపజయింపబడి రనియు, తరువాత బలుసుపాడు, సిరిపురము, పెదకూరపాడు, పాములపాడు, పాటిబండ, నెమలికల్లు, జాన్నెకల్లు, విశదల, గోరంట్ల, నల్లపాడు గ్రామము దోచుకొనచు గుంటూరుజేరిరనియు, కంతేరు, కొమ్మూరు, ఎనమదల, కోడూరు, మేడూరు, మోదుకూరు, మంగళగిరి. పెనుమాక, మద్దూరు, పీనపాడు, విక్కుర్తి, కంచెర్ల, పోలవరము, పొతకమూరు, కంభము, మాచర్ల గ్రామములమీదుగా వెడలిపోవుచున్నప్పుడు పుట్టవానిపాలెమువద్ద మలరాజుగుండయ్య వారిని చెల్లాచెదరుచేసినను గ్రామముల విడిచి పారిపోయినప్రజలు మరల ఆగ్రామముల జేరుటకు భయపడుచుండి రనియు తెలియుచున్నది.

---

# మనుస్మృతి – ఆరోగ్యము

యం. సుబ్రహ్మణ్యము

ధర్మశాస్త్రము ధర్మములను బోధించును. ధర్మమనగా విధి. ధర్మములకు వేదములు మూలము. వేదములు సామాన్యులకు అర్థము కాకుండుటవలనను, దేశకాలానుగుణములను వేదవిరుద్ధములు గాని మార్పులావశ్యకము లగుటవలనను కొందఱు ఋషులు సూత్రములను వ్రాసిరి. కొందఱు స్మృతులను వ్రాసిరి. వీనికి వేదములు ప్రమాణములు గనుక వేదములవలె నివియు ప్రమాణములు. శ్రుతిస్మృతులు బ్రాహ్మణులకు రెండు కన్నులవంటివి.

స్మృతులలో ముఖ్యమైనది మానవధర్మసంహిత, లేక మనుస్మృతి. మనువు దాను సృజించిన సకలమానవుల యుపయోగార్థము దీనిని రచియించి భృగు మహర్షికి నుపదేశించెను. ఈయన యెల్లరకును వెల్లడిపఱిచెను. ఈసంహితయందు వివిధములగు విధులు గలవు. ఆరోగ్యశాస్త్రవిషయములు గూడ సూక్ష్మముగ వివరింపబడినవి. ఆరోగ్యాభివృద్ధి గోరువారు వీనిని గమనించి, దేశకాలముల కనువగువాని నాచరణలోనికి దెచ్చుట విధియై యున్నది.

మన మందఱము విస్పష్టమైన కార్యములను విడువక చేయుచుండినపక్షమున సదాచారసంపన్నుల మగుదుము.

శ్లో. ఆచారా ల్లభతే హ్యాయు రాచారా దీప్సితాః ప్రజాః, ఆచారా ద్ధన మక్షయ్య మాచారో హం త్యలక్షణమ్.

సదాచారమువలన దీర్ఘాయుస్సు గలుగును; కోరికలను నెఱవేర్చుకొందుము; ధనము సంపాదింతుము. సదాచారమువలన నలక్షణములు నశించును.

## వాయువు

పూర్వకాలమునందు జనసమ్మర్దము లేనందువలనను, విశాలమగు పచ్చికనేలలు, తోటలు నుండుటవలనను జనులు నిర్మలవాయువును పీల్చుచుండిరి. అప్పుడు యంత్రకార్యము లెవ్వియు లేవు. వానివలన గలుగు బాధలేవియు లేవయ్యె. ధూమమున్నను నది హోమధూమము. ఇది యాయువును వృద్ధిచేయును.

శ్లో. వృద్ధాగ్నిహోత్రధూమశ్చ బాలస్త్రీ నిర్మలోదకమ్, రాత్రౌ క్షీరాన్నభుక్తిశ్చ ఆయుర్వృద్ధి ర్దినేదినే.

కనుక వాయుసంబంధమైన విధు లీస్మృతియందు లేవు.

## ఉదయమున లేచుట

సదాచారవంతులగువారు ఉదయముననే మేలుకొనవలయును.

శ్లో. బ్రాహ్మే ముహూర్తే చోత్థాయ చింతయే దాత్మనో హితమ్, స్మరణం వాసుదేవస్య కుర్యాత్కలిమలాపహమ్.

బ్రాహ్మముహూర్తమందు లేచి ప్రతిమనుష్యుడు తనకు హితము నాలోచించుకొనవలయును. కలిదోషములను బోగొట్టు వాసుదేవుని స్మరించవలయును.

ముహూర్తమనగా రెండుగడియలు. సూర్యోదయమునకు బూర్వమున్న ముహూర్తమునకు రౌద్రమనియు, దానికంటె వెనుకటి ముహూర్తమునకు బ్రాహ్మమనియు పేర్లు. కావున ప్రతిమానవుడును సూర్యోదయముకంటె బూర్వము ౪ గడియలు ముందుగ మేల్కొనవలయును. ౪గడియలనగా ౧గం. ౩౬ నిమి. వేకువజామున మేల్కాంచుపద్ధతి యత్యుత్తమైన పద్ధతి. విద్యార్థులందఱును నుదయమునకు బూర్వమే లేచి, తమకు కీర్తిదెచ్చు కార్యములను జేయబూని, దైవస్మరణచేసి, తాము చేయబోవు కార్యములు నిర్విఘ్నముగ కొనసాగునట్లు దేవుని యాశీర్వచనమును వేడవలెను. దైవస్మరణచేయునపుడు చంచలమైన మనస్సు

లేకుండవలెను. ప్రతివారును వారివారి మతానుసారము వారివారి దేవుళ్లను స్మరించవలెను

## మలమూత్ర విసర్జనము

శ్లో. న మూత్రం పథి కుర్వీత న భస్మని నగోవ్రజే.

దారిలోను, బూడిదయందును, ఆవుల మందలలోను మలమూత్రములను విడువరాదు.

శ్లో. న ఫాలకృష్టే న జలే న చిత్యాం నచ పర్వతే, న జీర్ణదేవాయతనే న వల్మీకే కదాచన.

నాగేటితో దున్నిన నేల, నీరు, అగ్నిహోత్రమునకై యిటుకలు పేర్చిన ప్రదేశము, పర్వతము, పాడుపడిన గుడి, పుట్ట, వీనియందెప్పుడును మలమూత్రములను విడువరాదు

శ్లో. న ససత్త్వేషు గర్తేషు న గచ్ఛన్నాపిచ స్థితః, న నదీతీర మాసాద్య నచ పర్వతమస్తకే.

జంతువులు వసించు కలుగులయందును, నడచుచును, నిలబడుచును, నదీతీరమునందును, పర్వతశిఖరములందును మలమూత్రములను విడువరాదు

శ్లో. వాయ్వగ్నివిప్రా నాదిత్య మపః పశ్యం స్తథైవగాః, నకదాచన కుర్వీత విణ్మూత్రస్య విసర్జనమ్.

వాయువును, అగ్నిని, విప్రుని, సూర్యుని, నీటిని, గోవును జూచుచు వానికెదురుగా గూర్చుండి యెప్పుడును మలమూత్రములను విసర్జింపరాదు.

శ్లో. తిరస్కృత్యోచ్చరే త్కాష్ఠ లోష్టపత్రతృణాదినా, నియమ్య ప్రయతో వాచం సంవీతాంగో౽వగుంఠితః.

నేలను కొయ్యలు, మంటిపెళ్ళలు, గడ్డి, ఆకులు మున్నగువానితో మూసి, తలవంచుకొని, మౌనముతో, దేహమును గప్పికొని తలకు ముసుగు వేసికొని మలమూత్రములను విసర్జింపవలయును.

శ్లో. మూత్రోచ్చారసముత్సర్గం దివా కుర్యా దుదఙ్ముఖః, దక్షిణాభిముఖో రాత్రౌ సంధ్యయోశ్చ యథా దివా.

పగటియందు ఉత్తరము వైపుమోముగాను, రాత్రియందు దక్షిణముఖముగాను, సంధ్యాకాలములందు పగటియందువలెనుత్తరముఖముగాను గూర్చుండి మలమూత్రములను విసర్జింపవలయును.

శ్లో. ఛాయాయా మంధకారేవా రాత్రౌ వహనివా ద్విజః, యథాసుఖముఖః కుర్యా త్ప్రాణాబాధభయేషుచ.

రాత్రులందు నీడయందును, చీకటియందును, పగటియందు నీడయందును గ్రమ్మరియుండునప్పుడును తన యిచ్చవచ్చినదిక్కుగా గూర్చుండి మలమూత్రముల విసర్జింపవచ్చును.

శ్లో. ప్రత్యగ్నిం ప్రతిసూర్యంచ ప్రతిసోమోదక ద్విజాన్, ప్రతిగాం ప్రతివాతంచ ప్రజ్ఞా నశ్యతి మేహతః.

అగ్నికెదుటను, సూర్యుని కభిముఖముగాను, చంద్రుడు, నీటిపట్టులు, బ్రాహ్మణులు వీరి కెదురుగను, గోవునెదుటను, గాలికెదుటను మలమూత్రములు విడుచువానికి బ్రజ్ఞ నశించునుగావున నీవిధమున జేయరాదు.

శ్లో. వాచం నియమ్య యత్నేన ష్ఠీవనోచ్ఛ్వాస వర్జితః, కుర్యా న్మూత్రపురీషేతు శుచౌ దేశే సమాహితః.

మలమూత్రములను విసర్జించునపుడు మౌనముగనుండవలెను.

శ్లో. నాప్సు మూత్రం పురీషంవా ష్ఠీవనంవా సముత్సృజేత్.

నీటియందు మూత్రపురీషములను విడువగూడదు.

శ్లో. దూరా దావసథా న్మూత్రం * * దూరాదేవ సమాచరేత్.

ఇంటికి నైరృతిభాగమున బాణము విడిచినంత దూరమున మూత్రపురీషములను విడువవలయును.

శ్లో. మైత్రం × × × పూర్వాహ్ణేవ కుర్వీత × × × ॥

మలవిసర్జనము పూర్వాహ్ణకాలమునందే చేయవలయును.

శ్లో. సముత్సృజే ద్రాజమార్గే యస్త్వమేధ్య మనాపది, స ద్వౌ కార్షాపణౌ దద్యా దమేధ్యం చాశుశోధయేత్.

రోగికానివాడు ఎవడు రాజమార్గమున మలవిసర్జనము గావించునో వానికి రెండుకార్షాపణములు దండన విధింపవలెను. వానిచే నామలమును వేగముగ నెత్తించ వలయును. కార్షాపణము నవరసుకు సరిపోవును.

శ్లో. ఆపద్గతో౽థవా వృద్ధో గర్భిణీ బాల ఏవవా, పరిభాషణ మర్హంతి తచ్చ శోధ్యమితి స్థితిః.

రోగి,వృద్ధుడు,గర్భిణి,బాలుడు,వీ రట్టికార్యము చేసిరేని వీరి కపరాధము వేయరాదు కాని యేల యిట్టి యకార్యము చేసితిరని మందలించి వారిచే నామలము నెత్తించ వలయును.

## శౌచవిధి

శౌచవిధిసంబంధమైన శ్లోకములు స్మృతులందు జాల గలవు. శౌచముయొక్క ప్రాముఖ్యమును మన పూర్వులు చక్కగ నెఱిగియుండిరి.

దేహమందలి చెడనీరు,రేతస్సు,రక్తము,క్రొవ్వు, మూత్రము, గులిమి, అమేధ్యము, గోళ్లమురికి, కఫము, కన్నీరు, కంటిపుసి, చెమట, ఇవి పండ్రెండును మనుష్యుల మలములు.

శ్లో. విణ్మూత్రోత్సర్గశుద్ధ్యర్థం మృద్వార్యాదేయ మర్థవత్, దైహికానాం మలానాంచ శుద్ధిషు ద్వాదశస్వపి.

మలమూత్రవిసర్జనస్థానమును బరిశుద్ధపఱచుటకై సోకియున్న మలము, దాని దుర్గంధము పోవువఱకును మంటితోను, నీటితోను పరిశుద్ధిచేయవలయును.మరియు శారీరమలములు పండ్రెండింటియందును గంధలేపములు నశించువఱకును మంటితో , నీటితోను శుద్ధి చేయవలయును.

శ్లో. ఏకా లింగే గుదే తిస్ర స్తథైకత్ర కరే దశ, ఉభయో స్సప్త దాతవ్యా మృదః శుద్ధి మభీప్సతా.

మూత్రపురీషములు వదలినపుడు శుద్ధిగోరువాడు మృత్తుతోను, నీటితోను లింగము నొకపర్యాయము, పాయుస్థానమును మూడుపర్యాయములును, ఎడమచేతిని బదిపర్యాయములును, తర్వాత రెండు చేతులను నేడు పర్యాయములును గడుగవలయును.

శ్లో. యస్మిన్ దేశేతు యత్తోయం యాచ యత్రైవ మృత్తికా, సైవ తత్ర ప్రశస్తా స్యా త్తయా శౌచం విధీయతే.

నదీతీరమునుండి యిసుకతోగూడిన మృత్తికను శౌచార్థము తీసికొనవలయును. ఇట్టి మృత్తిక సంభవింపనియెడల తానున్నచోటున లభించుమృత్తికను తీసికొనవలసినది.

శ్లో. దివా యద్విహితం శౌచం తదర్ధం నిశి కీర్తితమ్, తదర్ధ|మాతురే ప్రోక్తం మాతురార్ధంతు వర్త్మని.

శౌచవిధి పగటికంటె రాత్రులందు సగ మాచరించిన చాలును. అశక్తునికి నందర్ధముచాలును. మార్గమునం దిందులో సగము చాలును.

## గండూష విధి

మృజ్జలంబులచే శౌచవిధిని చేసికొని శిఖను ముడివేసికొని బద్ధకచ్ఛుడై గండూషమును సలుపవలయును. గండూషమనగా నోటియందు నీళ్లుపోసికొని పుక్కిలించి యుమియుట. తాను కూర్చున్న వామభాగమునందే గండూషము నొనర్పవలయును. మూత్రోత్సర్జనానంతరము ౪ గండూషములను, పురీషోత్సర్జనానంతరము ౮ గండూషములను, భోజనానంతరము ౧౨ గండూషములను,దంతధావనానంతరము ౧౬ గండూషములను జేయవలెను.

## దంత ధావనము

శౌచవిధి నాచరించినపిదప దంతధావనము చేసికొనవలయును. మిగిలిన స్మృతులందు దంతధావనవిధు లున్నవిగాని మనుస్మృతియందు లేవు. అయినను గోష్ఠికి నిచ్చట పాఠకులకొఱకు బొందుపఱచియున్నాను.

పుల్లతో పండ్లు తోముకొనవలెను. ప్రాఙ్ముఖముగనైనను, ఈశాన్యముఖముగనైనను కూర్చుండి దంతధావనము చేసికొనునది. వ్రేలితో దోముకొనుట తగదు. దంతధావనకాష్ఠము కనిష్ఠికాంగుళసమానస్థూలముగాని, లేక మధ్యమాంగుళసమానస్థూలము గాని యుండవలయును. దంతధావనకాష్ఠము తెలిసినవృక్షమునకు సంబంధించి యుండవలయు ననియు, నది దుర్గంధరహితముగను, ఋజువుగను, బెరడుతో నుండవలయుననియు, దాని యగ్రమును నలుగగొట్టి దంతధావన మొనర్చవలయు ననియు శౌనకముని వ్రాసియున్నాడు. ఏకాష్ఠములను వాడవచ్చునో వానిని వ్యాసమహర్షి వివరించియున్నాడు. కానుగ, కదిర, కడిమి, పెద్దగోరింట, ఏడాకుల అరటి, మారేడు, ఉసిరిక, మేడి, నల్లమద్ది, నేరేడు, వేప, ఉత్తరేణి, మారేడు, చిల్లేడు, అత్తి, ఇవి ప్రశస్తములైనవి. ముండ్లు కలిగి పాలుగల కాష్ఠములు పవిత్రములు. మోదుగ, కుంకుడు, తాడిచెట్టు, నారింజ, గోరు, రావి, ఏగిస, మునగ, దర్భ, రెల్లు, మొగలి, ఖర్జూరము, కొబ్బెర, వీని కాష్ఠములు తగవు.

## స్నానవిధి

స్నానమునకు మన పూర్వు లధిక ప్రాముఖ్యము నిచ్చిరి. స్నానమువలన రూపము, తేజస్సు, కీర్తి, పరిశుద్ధి, ఆయుస్సు, ఆరోగ్యము, చాంచల్యము లేకుండుట, దుస్స్వప్ననాశనము, తపము, బుద్ధివికాసము అను పది లాభములు కలుగును.

శ్లో. గుణా దశ స్నానపరస్య పుంసో రూపంచ
తేజశ్చ యశశ్చ శౌచమ్, ఆయుష్య మారోగ్య
మలోలుపత్వం దుస్స్వప్ననాశశ్చ తపశ్చ మేధా.

నదీతటాక కూపాద్యభావ సమయమందును, రోగాదికము కలవాడును ఉష్ణోదకము చేత స్నానము చేయవచ్చును.

శ్లో. నిత్యం నైమిత్తికం చైవ క్రియాంగం మలకర్షణమ్,
తీర్థాభావేతు కర్తవ్య ముష్ణోదకపరోదకైః.

నదులలో స్నానము చేయునపుడు ప్రవాహమున కెదురుగ నిలుచుండి స్నాన మాచరించవలెను.

శ్లో. సరిద్వరనదీస్నానం ప్రతిస్రోతః స్థిత శ్చరేత్.
మట్టితో శరీరమును రుద్దుకొనవలెను.

శ్లో. మృత్తోయేన స్వకం దేహం లింపే త్ప్రక్షాళ్య
యత్నతః.

దిగంబరుడై స్నానము చేయగూడదు.

శ్లో. అవగాహ్య జలే నగ్నః వస్త్రం యః సతి
శోధయేత్.

స్నానము చేసిన వస్త్రముచేతనే స్నానానంతరమున దేహము తుడుచుకొనగూడదనియు, మడివస్త్రమును కట్టుకొనునపుడు స్నానముచేసిన వస్త్రమును ఊర్ధ్వముగ తీసివేయవలయుననియు శౌనకముని వచించియున్నాడు.

అభ్యంజనస్నానమును గురించిన శ్లోకములు మనుస్మృతిలో లేవు కాని ఇతర స్మృతులందును, వైద్యశాస్త్రమునందును గలవు. అభ్యంజనస్నానము శరీర మార్దవము నిచ్చును. ధాతువృద్ధి నిచ్చును, శరీరకాంతిని, బలము నిచ్చును. శ్రమను, చెమటను, వాయువును శమింపజేయును. భగ్నములను సంధులను బాగుచేయును. నాడులు, రోమకూపములు వీనివెంబడినిశరీరమున రాయు చమురులోపలికి ప్రవేశించి బలమును పుట్టించును.

## వస్త్రధారణము

మనము ధరించు వస్త్రము తెల్లదిగ నుండవలెను. రాహుస్తముల పాడవుండి, బద్దెకలిగి యుండినదిగ నుండవలెనని మనువు చెప్పియున్నాడు. తెల్లని వస్త్రము ధరించినయెడల మజ్జయు, రక్తము, ఓజస్సు, బలము వృద్ధినొందును పైత్యమును, శ్రమను, తద్దాహములను శమింపజేయును. ఒకరు ధరించిన వస్త్రములను, పాదరక్షలను నితరు లుపయోగింపరాదు.

## భోజనవిధులు

శ్లో. ఆయుష్యం ప్రాఙ్ముఖో భుంక్తే యశస్యం దక్షిణాముఖః, శ్రియం ప్రత్యఙ్ముఖో భుఙ్క్తే ఋతం భుఙ్క్తే హ్యుదఙ్ముఖః.

శైశవము

S. S. S.



౧. అందుకోవాలి



౨. అందలేదు. ఈఁ, ఈఁ.



3. అమ్మా! అందింది



తోరణద్వారము

D. A. R.



దూధ్‌సాగర్ - గోవాలోని పెద్దజలపాతము
పాలవంటి రంగునీరుగలది కావున నీపేరువచ్చెను

దీర్ఘాయుస్సు గోరువాడు తూర్పుముఖముగా కూర్చుండియు, కీర్తిని గోరువాడు దక్షిణాభిముఖుడయ్యు, సంపదగోరువాడు పడమటికట్టు మోముగలవాడయ్యు, మోక్షకాముడుత్తరముఖము కలవాడయ్యు భుజింపవలెను.

శ్లో॥ పూజయే దశనం నిత్య మద్యాచ్చైత దకుత్సయన్, దృష్ట్వా హృష్యే త్ప్రసీదేచ్చ ప్రతినందేచ్చ సర్వశః.

ఈ అన్నమును పూజింపవలెను. నిందింపక దీనిని భుజింపవలెను. అన్నమును జూడగానే కలవరపాటు వదలి సంతోషించవలెను. ఈయన్నము మన కెప్పుడును కలుగుగాక యని స్తుతించవలెను.

శ్లో॥ నోచ్ఛిష్టం కస్యచి ద్దద్యా న్నాద్యాచ్చైవ తథాంతరా, నచై వాత్యశనం కుర్యా న్నచోచ్ఛిష్టః క్వచి ద్వ్రజేత్.

ఎంగిలియన్న మెవ్వరికి బెట్టరాదు. మధ్యాహ్న రాత్రుల భోజనము తప్ప నడుమనడుమ భుజింపరాదు. అప్పుడును మితిమీరి భోజనము చేయరాదు. ఎంగిలితో నెచ్చటికిని బోరాదు.

శ్లో॥ అనారోగ్య మనాయుష్య మస్వర్గ్యం చాతిభోజనమ్, అపుణ్యం లోకవిద్విష్టం తస్మాత్త త్పరివర్జయేత్.

అతిభోజనము అనారోగ్యము కలిగించును; ఆయుస్సును నశింపజేయును; స్వర్గాది పుణ్యములను బోగొట్టును; పుణ్యకార్యములను నశింపజేయును; లోకులకు నిందాపాత్రమైనందున నమితభోజనము పనికిరాదు.

శ్లో॥ అత్యుష్ణం సర్వ మన్నం స్యా ద్భుంజీరం స్తేచ వాగ్యతాః.

తినునాహారము ఉష్ణముగ నుండవలెను. భోజనము చేయువారు మౌనముగ నుండవలెను.

శ్లో॥ యద్వేష్టితశిరాభుఙ్క్తే యద్భుఙ్క్తే దక్షిణాముఖః, సోపానత్కశ్చయద్భుఙ్క్తే తద్వై రక్షాంసిభుంజతే.

భుజించునపుడు తలపాగా ఉండరాదనియు, దక్షిణముఖముగ భుజింపరాదనియు, చెప్పులతో భుజింపరాదనియు చెప్పుదురు.

శ్లో॥ నాశ్నీయాత్ సంధివేళాయామ్.

సంధ్యాకాలమున భుజింపరాదు.

శ్లో॥ నభుంజీ తోద్ధృతస్నేహం నాతిసాహిత్య మాచరేత్, నాతిప్రగే నాతిసాయం నసాయం ప్రాతరాశితః.

నూనెయెత్తిన తెలకపిండి మున్నగువానిని దినరాదు. కంఠపూర్తిగా భక్షింపరాదు. కడుప్రొద్దుటిపూటను, ముంజీకటికలిగియుండునప్పుడును భోజనము చేయరాదు. పగటిపూట బూర్తిగ భుజించినవాడు రాత్రిపూట భుజింపరాదు.

శ్లో॥ నకుర్వీత వృథా చేష్టాం న వార్యంజలినా పిబేత్, నోత్సంగే భక్షయే ద్భక్ష్యా న్నజాతు స్యా త్కుతూహలీ.

ప్రయోజనములేని పనిని జేయరాదు, దోసిలితో నీటిని ద్రాగరాదు. తొడపై నుంచుకొని వంటకములను భక్షింపరాదు.

శ్లో॥ న భిన్నభాండే భుంజీత న భావప్రతిదూషితే.

పగిలిన కుండలందును, మనసున కింపుగాని పాత్రలందును భుజింపరాదు.

శ్లో॥ లశునం గృంజనంచైవ పలాండుం కవకానిచ, అభక్ష్యాణి ద్విజాతీనా మమేధ్యప్రభవాణిచ.

ఎఱ్ఱగడ్డలు, నీరుల్లి, తెల్లపాయలు, గోగాకు, అమేధ్యస్థలములందు బుట్టిన పదార్థములను ద్విజాతులు భక్షింపరాదు.

శ్లో॥ లోహితాన్ వృక్షనిర్యాసాన్ వ్రశ్చనప్రభవాంస్తథా, శేలుం గవ్యంచ పేయూషం ప్రయత్నేన వివర్జయేత్.

ఎఱ్ఱగా జెట్టునుండి స్వయముగ బుట్టిన పాలు, లేక కత్తియేటుచే కారుపాలు, మునగకాయ, ముఱ్ఱిపాలు, వీనిని విడువవలయును.

శ్లో. అనిర్దశాయా గోః క్షీర మౌ ష్ట్ర మైకశఫం తథా,
ఆవికం సంధినీక్షీరం వివత్సాయాశ్చ గోః పయః.

పదిదినములు గడవని యావుపాలు, అట్టిదేయగు ఒంటె, మేక, గొఱ్ఱె, ఒంటిగిట్టలుగల గుఱ్ఱము మొ లగు వాని పాలు, చూలుపడియున్న యావుపాలు, దూడ లేని యావుపాలును భక్షింపదగవు.

శ్లో. అరణ్యానాంచ సర్వేషాం మృగాణాం మాహిషం వినా, స్త్రీక్షీరం చైవ వర్జ్యాని సర్వశుక్తాని చైవహి.

మహిషముదప్ప తక్కిన యారణ్యపసువు లన్నిటి యొక్క క్షీరమును, చనుబాలను, పులియబెట్టినవి యన్నియును త్రాగదగవు.

శ్లో. దధి భక్ష్యంచ శుక్తేషు సర్వంచ దధిసంభవమ్,
యానిచైవాభిషూయంతే పుష్పమూలఫలైశ్శుభైః.

పులియబెట్టిన వస్తువులలో పెరుగును, పెరుగు నుండి తయారయిన మజ్జిగ మొదలగునవియు, మైకమును గలిగించు పుష్పములు, గుంపలు, పండ్లు, నీరుచేర్చి పులియబెట్టిన యాసవములును భక్షింపదగినవి.

మాంసములు, మత్స్యములు వీనిలోగూడ నిషేధింపబడిన వన్నియు మనుస్మృతిలో వివరింపబడినవి.

శ్లో. సర్వంచ తిలసంబంధం నాద్యా దస్తమితే రవౌ.
సూర్యు డస్తమించినపిమ్మట నువ్వులుచేర్చిన పదార్థములను తినరాదు.

శ్లో. ఆర్ద్రపాదస్తు భుంజీత.
కాళ్లు కడుగుకొని భుజింపవలెను.

శ్లో. మత్తక్రుద్ధాతురాణాంచ నభుంజీరన్ కదాచన,
కేశకీటావపన్నంచ పదా స్పృష్టంచ కామతః.

మత్తులు, క్రుద్ధులు, రోగులు, వీరిచే పక్వము చేయబడినదియు, వెండ్రుకలు, పేలు మొదలగువానితో గూడినదియునగు నన్నమును భుజింపరాదు. కాలితో దన్నిన యన్నమును భుజింపరాదు.

ఎట్టివారు పెట్టు అన్నమును దినగూడదో వివరముగ స్మృతియందు దెలుపబడియున్నది. అంటులాడి యన్నము, చలిదియన్నము, వేటకానియన్నము అమర్యాదతో వడ్డింపబడెడి యన్నము, భర్తయు, బిడ్డలు లేనిది పెట్టు అన్నము, శత్రువులు పెట్టెడి యన్నము, పైగా దుమ్ముకొట్టిన యన్నము, తప్పుసాక్ష్యము చెప్పు వాని యన్నము, మద్యమమ్ము వారి యన్నము మొదలగునవి నిషిద్ధములు.

భోజనము చేయునప్పుడు కుడిచేతి నుపయోగింపవలెను.

శ్లో. భోజనేచైవ దక్షిణం పాణి ముద్ధరేత్.

## తాంబూలవిధి

తాంబూలవిధులు మనుస్మృతియందు లేవుగాని యితరస్మృతులందు గలవు. కొన్నిటిని సాహసించి వ్రాయుచున్నాను.

శ్లో. పర్ణమూలే భవే ద్వ్యాధిః పర్ణాగ్రే పాపసంభవః,
చూర్ణపర్ణం హర త్యాయు స్సిరా బుద్ధివినాశినీ.

ఆకుయొక్క మూలము వ్యాధిని, చివర పాపమును, సున్నముంచిన యాకు ఆయుర్నాశమును, ఈనెలు బుద్ధినాశనమును కలుగజేయును. కావున నాకు యొక్క యగ్రభాగమును, మొదలును, ఈనెలను, సున్నపుటాకును వదలి తాంబూలము వేసికొనవలెను.

శ్లో. తాంబూలం కటు తిక్త ముష్ణమధురం క్షారం కషాయాన్వితం వాతఘ్నం క్రిమినాశనం కఫహరం దేహాగ్ని సందీపనం, స్త్రీసంభాషణ భూషణం రుచికరం శోకస్య విచ్ఛేదనం తాంబూలస్యచ యే త్రయోదశ గుణాః స్వర్గేపి తే దుర్లభాః.

బాహటమను వైద్యగ్రంథమునందు పైనిజెప్పిన లాభము లన్నియు జేర్కొనబడినవి.

నోటిలో ప్రథమమున తమలపాకు వేసికొనక పోకచెక్కను వేసికొనునెడల ఏడుజన్మములవఱకు దరిద్రుడగును; నరకములందు మునిగి తేలుచుండును.

శ్లో. అనిధాయ ముఖే పర్ణం పూగం ఖాదతి యో నరః,
సప్తజన్మదరిద్ర స్స్యా న్నరకేషు నిమజ్జతి.

పోకచెక్కలు కత్తిరించి యగ్రములు లేకుండ నలిపి, కర్పూరము, లవంగాలచే వాసితమగు తాంబూలమును భక్షింపవలయును. ఇటుగాకున్న యెడల కఠినములగు పోకలను కొఱుకుటచే దంతములకు శైథిల్యమును, కర్ణరోగశిరోరోగాదులును, దవుడలకు కదలికయు కలుగును.

శ్లో. ఖండీకృతం శ్లక్ష్ణపేతాగ్రైః కషాయం యత్సుగంధిభిః,
కర్పూరాద్యైః ప్రసూనైశ్చ వాసితం తచ్చ భక్షయేత్,
నోచేద్దంతస్య శైథిల్యం భవేద్దంత విఘట్టనాత్,
కర్ణరోగశిరోరోగా హనుస్రంసస్తు జాయతే.

తాంబూలము వేసికొనుటకు మునుపు ఆకులను, పోకలను, సున్నమును పరిశోధించి వేసికొనవలెను. ఏల యనగా పోకచెక్కలోని పురుగు గళగండరోగమును బుట్టించును. పర్ణమందలి కీటకము ముఖరోగాదికరము. సున్నమునందుండు జాయి అశ్మరీరోగమును బుట్టించును.

శ్లో. పూగాంతర్గతకీటస్తు గళగండకరో భవేత్,
పర్ణాంతర్గతకీటస్తు ముఖరోగాన్ కరోతి చ,
చూర్ణస్థసూక్ష్మపాషాణం సేవితం చాశ్మరీం భవేత్,
తస్మాత్పర్ణాది సంశోధ్య కుర్యాత్తాంబూలభక్షణమ్.

తాంబూలము నెక్కువగా సేవించినయెడల శరీరము తెల్లబడును. దంతపటిమ తగ్గును. చెవుడు, నేత్రరోగము, వాతపైత్యప్రకోపము వచ్చును

శ్లో. పాండుత్వం దంతదౌర్బల్యం బాధిర్యం చాక్షిరోగతా,
వాతపైత్యప్రకోపస్స్యాత్ తాంబూలస్యాతిసేవనాత్.

తాంబూలము నమలిన మొదటిరసము విషసమము కావున దానిని ఉమియవలయును. మధ్యమరసము దీపనము, పాచనము. అంత్యరస మమృతము.

శ్లో. ఆదౌ విషోపమం ప్రోక్తం మధ్యే దీపనపాచనమ్,
అమృతప్రతిమం చాంతే త్రిధా తాంబూలభక్షణమ్.

## శయన విధులు

శ్లో. అధస్తాన్నోపదధ్యాచ్చ నచైన మభిలంఘయేత్,
నచైనం పాదతః కుర్యాన్నప్రాణాబాధమాచరేత్.

మంచము క్రింద కుంపటిని పెట్టుకొనరాదు. నిద్రించునపుడు కాళ్ళ క్రిందుగ నిప్పు నుంచుకొనరాదు.

శ్లో. నైకః స్వప్యాచ్ఛూన్యగేహే శయానం న ప్రబోధయేత్.

పాడుపడిన యింటిలో నొంటరిగా పరుండరాదు. తనకంటె మించినవాడు నిద్రించునపుడు వానిని లేపరాదు.

శ్లో. నచ నగ్నశ్శయీత హి.
దిసమొలతో పరుండరాదు.

శ్లో. నార్ద్రపాదస్తు సంవిశేత్.
తడికాళ్ళతో పరుండరాదు.

శ్లో. రాత్రౌచ వృక్షమూలాని దూరతః పరివర్జయేత్.
రాత్రులందు వృక్షమూలములకు దూరముగ పరుండవలెను.

ఇతర స్మృతులలోని విధులను కొన్నిటిని పాఠకుల యుపయోగార్థము వ్రాయుచున్నాను.

శ్లో. స్వగృహే ప్రాక్శిరాశ్శేతే శ్వాశుర్యే దక్షిణాశిరాః,
ప్రత్యక్శిరాః ప్రవాసేతు నకదాచిదుదక్శిరాః.

స్వగృహమున ప్రాఙ్ముఖముగను, శ్వశురగృహమున దక్షిణాముఖముగను, ప్రవాసమున పశ్చిమముఖముగను నిద్రించవలయును. ఉత్తరముఖముగా నెప్పుడును నిద్రించరాదు.

వైశాల్యము లేనట్టియు, విఱిగినట్టియు, సమానము కానట్టియు, మలినమయినట్టియు, నల్లులు గలిగినట్టియు, ఆస్తరణము లేనట్టియు శయ్యయందు పరుండగూడదు. తలంటుకొని స్నానముచేయక నిద్రించగూడదు. మఱ్ఱి, నేరేడు, జువ్వి, రావి, మేడి, వీనికఱ్ఱలతో చేసిన మంచమందుగాని, కాలినమంచమందుగాని, బొలురు, జలము, శత్రువులు వీరి మధ్యయందుగాని, ధాన్యమందుగాని, గోవులు, అగ్ని, గురువులు, వీరికి నుపరిభాగమునందుగాని, పగటియందుగాని నిద్రించగూడదు.

రాత్రి పదిఘంటలయినది. ఆంధ్ర రత్నములు నిండుమునుగులతో లంకచుట్టలను గాల్చుచు వారకాంత గుమ్మమున సంసిద్ధులైరి. ఇంతకుముందు వారికి పరిచితుడయిన నౌకరు వెంటనే వారిని మేడమీదికి దీసుకొని వెళ్లెను. అచట పెద్దగది యొకటి. అందులో మూడు సోఫాలు, కొన్ని చిన్నబల్లలు, నాలుగు గోడలమీద సినీమా నటీనటకుల ఛాయాపటములు. వాటిమధ్య నొక లక్ష్మీపటము, రాజారవివర్మచేత వ్రాయబడిన దాని ప్రతిబింబము. పెట్రోమాక్సుదీప మొకటి ఒకమూల వెలుగుచుండెను. సోమశేఖరమునకు తాను చూచుచుండెడిది నిజమా, స్వప్నమా యనిపించుచుండెను. ఒక నిమిషములోనే సర్వాంతర్యామిగా నుండు వేశ్యమాత నిరీక్షించుచున్న మన్మథోపాసకులకు దర్శన మిచ్చెను. 'నాయి ల్లీవేళ పవిత్రమయినది. మీలాంటివారి రాకతో మాకోరికలు సఫలములైనవి. అంతయు నాదేవియొక్క యనుగ్రహ' మని చెప్పుచు వేశ్యమాత వెళ్ళి లక్ష్మీపటమునకు తనచేతనున్న పూదండను వేసెను. ఆశ్చర్యమగ్నుడయిన సోమశేఖరము తిరిగి చూచునప్పటికి తనచెంత నొకసుందరి కూరుచునియుండెను. అవ్విధముగనే తన స్నేహితులసోఫాలుగూడ నలంకరింపబడి యుండినవి.

రామసింహకనకరాజులకు ఈనాటక మంతయు పురాతనమయినదే. దానివలన వారు తమ చెంతనున్న యువతులతో ఇంచుకైనను సంకోచము లేక విహరింపదొడగిరి. ఇంతలో నౌకరు పాలు, ఫలములు, సిగరెట్లు, సారాయి మొదలగు అనంగపూజాసామగ్రుల నన్నిటిని తయారుచేసెను. సోమశేఖరమునకు ఈగ్రంథమే తెలియదు. స్నేహితుల యెగతాళికి వెరచి లోపలి కెటుల వచ్చెనో అటులే వారినిజూచి సమస్తవిషయములయందు నతడు ప్రవర్తించుకొనుచుండెను. అయితే అతని భిన్నచిత్తమును, భయభ్రాంతియును ప్రక్కనున్న యువతి యొకక్షణమున గ్రహించెను. ఈ విషయములందు స్త్రీబుద్ధిని మించిన దేదియు లేదుగదా? కొంతకాలములోనే అతని స్నేహితులిద్దరును తమతమ వెలయాండ్రతో పచ్చిబూతులను మాట్లాడుట కారంభించిరి. తదనుగుణములైన చేష్టలనుగూడ జేయదొడగిరి. మానము, సంకోచము స్త్రీజాతికి సహజము లయినవి. వారాంగనలయిన నేమి, పతివ్రతలయిన నేమి? "పుట్టుకతో వచ్చిన బుద్ధి కట్టెలతోనే పోవలెను" అందువలన త్రాగుడుచే మతిమఱచి మితిమీరుచున్న తమ విటకాండ్రను లజ్జతో, చిరునవ్వులతో, ఆదరపుమాటలతో మెల్లమెల్లగా వలపించి నియమింపబడిన ప్రత్యేక శయ్యాగృహములకు తోడ్కొని వారిరువురు వెళ్లిరి.

కాని సోమశేఖరము మాత్రము కదలలేదు. పండ్లు, పాలు పుచ్చుకొనెను గాని సారాయి పుచ్చుకొనలేదు. అతనికి తల గిర్రున దిరుగుచుండెను. ఏమి చేయుటకును తోచలేదు. తన ప్రక్కనున్న యువతి చాలసౌందర్యవతియే. ఆమె పాలు,పండ్లు తనకిచ్చుచు తనదేహమును స్పర్శించినపుడు మనస్సు విసుగింపక సంతోషించినది గదా యని యతని కాశ్చర్యము గలిగెను. ఇంతలో తనమిత్రులిద్దరు శయ్యాగృహములకు వెళ్లుట చూచెను. తానుకూడ వెళ్ళవలెనని తలచెనుగాని లేచుటకు కాళ్లయందు శక్తి లేకపోయినది. అయితే చెంతనున్న స్నేహితురాలు భుజమును బట్టి కొంతబలవంతముగా లేవనెత్తినది. సోమశేఖర మదివరకు బాగుగా చూడని యామెముఖమును నిదానముగా నప్పుడు చూచెను. క్రీగంటిచూపుతో, చిరునవ్వులతో ప్రహరించుచున్న స్త్రీబాణములను నివారింప సామాన్యమానవులకు తరమా? 'ఇనుప కచ్చడాలుగట్టు మునిముచ్చులెల్ల తామరసనేత్రి లిండ్ల బంగారుకారె' యని పెద్దలు చెప్పినమాట వ్యర్థముగా బోవునగా? సోమశేఖరము నిమిషమాత్రమున కామాంధుడయ్యెను. రంభావతారమువలె తనయెదుట నిలబడియున్న నవమోహనాంగిని తనరెండుచేతులతో పసిపిల్లవలె నెత్తుకొని శయ్యాగృహములోనికి పరుగెత్తెను.

అతని యాతురతను వర్ణించుటకు శక్యముగాదు. నిమిషార్థములో తనదుస్తులన్నిటిని దీసి ఒకమూల బారవైచెను. తిరిగి యున్మత్తదృష్టితో మంచముపైపు జూచెను. అయిన నం దెవరును గనబడలేదు. తన చెలి యొకమూల నిలబడియుండుట గాంచెను. దగ్గరకు వెళ్లి కామమును గ్రక్కుచున్న చూపులతో నామెను పలుకరించెను. బదులు రాలేదు. ముఖమును గోడవైపునకు

ద్రిప్పి యామె మరింత బిరుసుగా నిలబడెను. సోమశేఖర మెంతదైన్యమును వహించినను ఆమె మనస్సు మారలేదు. చిట్టచివరకు విసుగుజెంది కొంతకోపముతో నతడు వెళ్లి దూరముగనున్న యొక పాన్పుకుర్చీలో ఉస్సురని కూలబడెను. అప్పుడామె తలద్రిప్పి యతనిని గంభీర ముఖముతో చురచుర వీక్షించెను. సోమశేఖరమునకు ఆచూపుయొక్క యర్థమిదియని తెలియలేదు. కాముకునేమో అది సూచింపలేదు. మరేమియు నతనికి బోధపడలేదు. అయితే దానివలన యతని యాతురత చాలవరకు తగ్గినది. ఒడలిమీద తెలివికూడ వచ్చినది. ఇంతలో నామె కొన్నియడుగులు ముందుకు వచ్చి నిలబడి కేవల నీరసభావముతో "మీ పేరేమి" యని యడిగెను.

"సోమశేఖరం"

"బ్రాహ్మణులా?"

"అవును. ఎందు కడుగుచున్నావు? నీ పేరేమి?"

"నా పేరు......నా పేరు చంద్రకాంత."

"చంద్ర, రా, ఇంత గడుసుగా నెందుకు వర్తించుచున్నావు. నీమనస్సులో నేమున్నది చెప్పు. రా, నాదగ్గర కూర్చుము."

చంద్రకాంత దూరముగనే నిలబడియుండెను. "మీ రిదివర కెప్పుడును మాలాంటివారింద్లకు వెళ్లినట్లు తోచదు. నిజమేనా?"

"నిజము. అయితే యాప్రశ్నల నెందుకు వేయుచున్నావు? నీ కేమి గావలయును?"

"మీనుంచి నా కేమియు కావలసినది లేదు. దయచేసి మీరు మాయింటినుండి వెళ్లవలెను. మరల నిచ్చటికి రాకూడదు."

"నీ మాటలు నా కర్థము కావు. విచిత్రముగ నున్నవి."

"మీ కర్థ మెందులకు గావలయు? ఒడలిమీద ప్రజ్ఞయున్న గదా? ఇదిగో దగ్గరకు రండి" యనుచు చంద్రకాంత తన నోరు తెరచి లోపలిపండ్లను సోమశేఖరమునకు చూపెను.

"నీ నోటియందు దిన్నిపండ్లున్నవిగదా? మం డెందుకు త్రాగకూడదు?"

చంద్రకాంత వికారముగ నవ్వెను. వెంటనే నీళ్లు నిండినకండ్లతో 'నాయనా! నీవు ప్రపంచము తెలియని కందువు. నిన్నుచూడ నాకు మనస్సు కరగుచున్నది. నా పండ్లనగా నేమనుకున్నావు? అవి మందులతో బోవు, మాకులతో బోవు. నన్ను చితియందుంచి కాల్చినగాని యవి పోవు. అబ్బాయి, నా జీవితమెల్ల ఘోరపాపపంకిల మయినది. దానిఫలమును నే నిపు డనుభవించుచున్నాను. అది నుదుటివ్రాత. దానిని తప్పింప నెవరికిని శక్యముకాదు. ఇదిగో నే నీజన్మమునందు జేసిన దిప్పుడే యనుభవించుచున్నాను అన్నము తినలేను, నీళ్లుమింగలేను నామలప్పక రోజూ యీపాకు వృత్తి నవలంబించి కాలముగడుపుచున్నాను. అయితే నేటితో నాకు చాలయినది. నా జీవితము ముగిసినది. మీరు నన్ను మన్నింపవలయు. నన్ను తాకి మీ రిదివరకే చాలా పాపమును గట్టుకొంటిరి. మీ దాసానుదాసురాలను. వేడుకొనుచున్నాను. దయచేసి మీరు వెడలవలయును,

అని చెప్పి కన్నీళ్లు గార్చుచు చేతులు జోడించుకొని సోమశేఖరముయొక్క పాదములపై బడెను. అతడు స్తంభీభూతు డయి దిక్కుతోచక కొంతసేపూరకుండి, మనస్సును స్వాధీనపరచుకొని "నీ వెవరు? నీ సంగతేమి? నీ చర్య లేమియు నాకు బోధపడకున్నవి. నీ పలుకులనుబట్టి చూడ ఉత్తమజాతి యాంధ్ర స్త్రీలాగు కనబడుచున్నావు. అయితే యిచ్చటి కెందుకు వచ్చితివి? ఎన్ని సంవత్సరములుగా నున్నావు? ఏమి నీకథ" యని యడుగుచు ఆమెను క్రిందినుండి భుజములతో లేవనెత్తబోయెను. కాని త్రాచుపాము మీదను పడినలాగున ఒకగంతున ఆమె లేచి దూరముగ పరుగెత్తి నిలబడి దేహము గడగడ వడకుచు, అమిత క్రోధావేశముతో నేత్రములు నిప్పులు గ్రక్కుచు నుండగా నిట్లనినది–

"నన్ను తాకవలదని నేనుచెప్పలేదా? ఎందుకు, ......ఎందుకు......తాకి......తాకినావు నన్ను?

మగవారి బుద్ధి ఎంతచెప్పినను ఇంతేగదా? నడచిపో. నా ఎదుట నిలువవలదు. వెడలిపొమ్ము, పొమ్ము."



"చంద్రా, ఎందు కీయావేశము నీకు? నేను నిన్ను తాకినది కామముతోగాదు, కరుణతో గదా! ఒకఆంధ్రనారీమణి యిచ్చోట యిట్టి నీచస్థితి ననుభవించుచున్నది గదా యని నామనస్సు పరితపించుచున్నది. నీవెవరు? నే నేమయినను నీకు సహాయము చేయగలనా?"

"మీ సహాయము నాకక్కరలేదు. దేవుడొక్కడే నన్నుమన్నించి నాకు సహాయము చేయవలెను. మాటలకేమి గాని, నాకు సహాయము చేయుటకేనా మీ రీగదిలోనికి వచ్చినది?"

"నేను చేసినది చాలాతప్పు. ఇదివరకే చెప్పినట్లు ఇలాటి స్థలమునకు వచ్చుట కిదియే మొదటిసారి. మరలరాను; రాను; ముమ్మాటికిరాను. మనస్సు చాలా ఖిన్నత నొందియున్నది. వర్ణనాతీతమయిన దుఃఖము గలుగుచున్నది. ఏమి చేయగలను? నీ వెవరో, చిఃరకు, నాకు చెప్పవా?"

"నే నెవరయిన నేమి? ఒక భ్రష్టురాలను. కులము, గోత్రము, జాతి, నీతి ఏదియు లేని యొకమానవజంతువును. నాకు సిగ్గులేదు; మానము లేదు, ఇష్టానిష్టము లేవియు లేవు. నేను కేవల మొక స్త్రీ జంతువును. నాగదికి వచ్చువా రెల్లరు నాసమ్మతితో వచ్చుచున్నారా? నా మనో వికారముల ననుసరించి నడచుకొనుచున్నారా? వారికి గావలసినది నా దేహము. అయ్యో! (ఏడ్చుచు) ఈ పాడుకట్టె యెందరిస్వాధీన మయినది? మాలమాదిగలు, తురుష్కులు, క్రైస్తవులు, అనమాధములనందరిని నే నాదరించియున్నానుగదా? చివరకు మీ రిచ్చటికి వచ్చినది ఈస్త్రీ దేహముకొరకే గదా? పురుష జాతికి స్వాభావికముగ కామాంధకారములో మంచిసెబ్బరలు తెలియవు. సోమశేఖరంగారూ, మీరు మరచియున్నారు. నేనేమో స్త్రీని. అయితే మీతల్లియూ స్త్రీయే గదా?"

ఆమాట అనునప్పటికి పసిపిల్లవలె సోమశేఖరం గొల్లున ఏడ్వనొడగెను. చేతులు జోడించి "అమ్మా, నేను చేసినది చాలాతప్పు. మన్నింపవలయును. నీవు నాకు బుద్ధి నేర్పియున్నావు. ఇక నెప్పుడును యీలాటి యిండ్లకు వెళ్లనని వాగ్దానము చేయుచున్నాను. ఇంకను నీకు సమ్మతము లేదా?"

"నాకు సమ్మతము లేదు. నీవుచెప్పినది చాలదు. నీవు చేయతలచినఘోరమును నీ వింకను గనుగొనలేదు.



రాత్రివేళ 'న్యూయార్కు'

P. P. A.

నే నెవరని పలుమా రడుగుచున్నావు. ఇక నాకు గావలసిన దేమి? నా యవ్వనము ముగిసినది. జీవితములోనే సిగ్గులజ్జలు లేక బ్రతికిన యాభ్రష్టురాలికి తదనంతరము మానావమానములతో నేమిపనియున్నది? చెప్పుచున్నాను విను. నా పేరు చంద్రకాంత గాదు. అది ఈ చండాలవృత్తినిబట్టి వచ్చినపేరు. నా తలితండ్రులు పెట్టిన పేరు లక్ష్మీదేవి. వారు బ్రాహ్మణులు, సదాచారసంపన్నులు. నా నొసటి వ్రాలును దెలిసియే కాబోలు నాకు నా రా పేరిచ్చిరి. లక్ష్మి యనగా కళంకముగలదియనిగదా యర్థము. ఇదిగో ఇంక............ఇంకను జీవించుచున్నాను. ఏపిడుగైనను నానెత్తిదబడి చంపకున్నది మా తల్లి......... మహాపతివ్రత............ఆమెను తల్లి యని చెప్పుకొనుటకు కూడ నాకు యోగ్యత లేదు.........మహాపాతకము.........నా బాల్యమునందే యామె స్వర్గస్థురాలాయెను. మాతండ్రి శాస్త్రవేత్త. ఎనిమిదవసంవత్సరమునందే నాకు వివాహముచేసెను. ఆరుమాసముల లోపల నాకు వైధవ్యము సంప్రాప్తమయ్యెను. నేనప్పుడాడుచుండెడిపిల్లను. అది నాకేమియు నర్థము కాలేదు. అయితే కొంతకాలములో తెలివివచ్చినది. మా తండ్రి సద్ధర్మముల నన్నిటిని ఉపదేశించి కాపాడుచు వచ్చెను. నాయదృష్ట మిట్లుండ నత డెందుకు బ్రతికియుండును? శీఘ్రముగనే యతని జీవయాత్ర ముగిసినది. ఇక దిక్కులేక మామగారి యిల్లు చేరితిని. నా కప్పుడు ౧౪ సంవత్సరములు. అత్తమామలసేవలో రెండుసంవత్సరములు గడపితిని. అప్పుడు గ్రహచారము సంభవించినది. ఇంటియందు చిన్నమరదలకు పెండ్లిజరిగినది. ఎందరో బంధువులు వచ్చి యింటియందెల్ల గలభా ఎక్కువగా నుండెడిది. ఆసమయమునందు......ఆసమయమునందు (ఏడ్చుచు) తప్పుచేసితిని. బంధువర్గములోని యువకుడొకడు నన్ను సదా యనుసరించుచు బలవంతపరచెను. నాకు మతిపోయినది. తప్పు తప్పని చెప్పుచున్న మనస్సును అణచితిని. యౌవన తాపమునకు లోబడితిని చెడితిని. ఇకనేమున్నది? చలితీరినది. పాపసముద్రములో మునిగితిని. నానాటికి మా యిరువురి స్నేహ మెక్కువయినది. వెంటనే తదితరములుకూడ సంభవించినవి. పిడుగు దూరినటుల గర్భమును ధరించితిని. కొన్ని దినములలోనే పురుషు డదృశ్యుడాయెను. భార్య యింటికి రాగానే ఆమెతో సరససల్లాపములు సలుపుచు అతడు పూర్తిగ నన్ను మరచెను. ఇక నాగతి యేమి? నేనెవరితో చెప్పుకొందును? ఎట్లనుభవింతును? నిరంతరము దుఃఖించుచు ఆహారనిద్రలు లేక గడచుచున్న ప్రతినిమిషమును భయభ్రాంతులతో లెక్కపెట్టుకొనుచు కొన్నాళ్లు గడపితిని. ఎన్నెన్నియో చికిత్సలను చేసితిని. ఎందరో దేవతలకు మ్రొక్కితిని. సర్వము నిష్ఫల మనిపించినది. సందేహముతో కాబోలు, అత్తగారొకనాడు తీవ్రముగా ప్రశ్నించిరి. నా కేమియు తెలియదని చెప్పితిని. అయిన నా మాటలామె నమ్మలేదు. మారుమాటాడక వెడలిపోయినది. నాకు భయము వేయింత లెక్కువయినది "మామగారికి చెప్పునురేమో? ఇంటిలో నందరికి తెలియునుగదా! భగవంతుడా, ముఖమెట్లు బయటచూపుదు" నని భయకంపితురాలనై యోచింపదొడగితిని. ఆనాడు రాత్రి నిర్భయముగా నిశ్చితమనస్కురాలనై యెల్లరును నిద్రించు సమయమున కల్లువిడిచి గ్రామాంతమునకు వెళ్లి, అచ్చటి చెరువునందు పడితిని. అయితే మరణించు నంతటిభాగ్యము నాకు కలుగదాయెను. నేనువెడలిపోవునపుడు చివరగుడిసెలోని కుక్క నన్నుచూచి మొరిగినది. దానితో నందునివసించుచున్న కాబూలీవాడు బయటికి వచ్చెను. నన్ను జూచి వాడు పరుగెత్తి ప్రాణముపోక మునిగి తేలుచున్నదానిని లేవనెత్తి యింటికి గొనిపోయెను. హంతకునివెంట మేకపిల్లవలె నేను వానిని వెంబడించితిని.

ఎక్కువగా జెప్పలేను. నానాఅవస్థలుపడి చివరకీగృహము చేరితిని. నాలుగు సంవత్సరము లయినది. స్వాతంత్ర్యము లేదు. తినను కూడులేదు; కట్టబట్ట లేదు. ఇష్టానిష్టములను చూడక రాత్రింబవళ్లు లెక్కపెట్టక చేరబడిన మానవమృగముల నన్నిటిని ఆదరింపవలసియున్నది. అయితే నీవెందుకు మరల నాత్మహత్యను చేసికోలేదని యడిగెదవా? నేను చేయ

లేదు; నిజము. దానికి కారణమున్నది. ఇచ్చటికి వచ్చినపుడే నాదేహము చెడియుండెను. ఇచ్చట నది శీఘ్రముగనే యింకను చెడి చివరకు కుళ్లుచువచ్చెను. నానోటియందు పుండ్లను చూచితివికదా? దేహమంతయు నాలాగేయున్నది. నావ్యాధికి మందు లేదు. మరణించువరకు ననుభవింపవలసినదే. అయితే ఇచ్చటికి వచ్చిన తర్వాత నా మనస్సునందు ఒక క్రొత్తయోచన పొడమినది. శీఘ్రముగ నాకు దృఢనిశ్చయము గల్గినది. స్త్రీలనగా మన దేశము నందు చాల నిర్లక్ష్యము గదా? చదువులేక, స్వాతంత్ర్యము లేక, సంపాదించుకొనుటకు శక్తిలేక, సదా పురుషునిపై నాధారపడియుండవలెనుగదా? ఏకారణముననైననేమి దిక్కు లేనివ్వారైనచో గౌరవముగా జీవించుట చాలాదుర్లభము గదా? పైపెచ్చు బాల్యమునందే వైధవ్యముసంభవించినవారిగతి యేమనిచెప్పుదుము? పునర్వివాహము నిషిద్ధమాయెను. వారికి స్వాతంత్ర్యజీవనమునకు మార్గము లేదాయెను. అటువంటివారెంతమందియో కిరాతులపాలై పోవుచున్నారని నీకు తెలియునా? నేను స్వేచ్ఛగా నీవృత్తి నవలంబించితినా? నాకిది చాలాయిష్టమనుకొంటివా? క్రిమికీటకములకంటె నన్నుతక్కువగా చూచుచున్నారు. నగరము మాలిన్యమున కంతయు నేనే స్థానమా? ప్రతిమనిషియు నాపై నధికారము చేయుటేనా? నన్ను మానవజంతువులెల్లనందరు త్రొక్కి దుమ్ముచేయవలయునా? నాదియు దేహముగాదా? నేను మనోబుద్ధిచిత్తాహంకారములుగల మనిషినిగానా? నాకు కామక్రోధలోభమోహమదమాత్సర్యములులేవా? ఇటువంటివన్ను, నావంటి వేలకొలదియనాథస్త్రీలను ఈభయంకరవృత్తినుంచి నవ్వుచు నాట్యమాడుచు దిరుగుచున్న యీరాక్షససంఘముపై గసితీర్చుకొనుటే నానిశ్చయము. అచలచిత్తురాలనైతిని. కంకణముగట్టికొంటిని. నాగదికివచ్చినవారెల్ల సంవత్సరములకొలది మంచముల నెక్కుచు వచ్చిరి. వారిదేహబాధలను, వారిహీనస్థితిని జూచి నే నానందబాష్పములను గార్చుచుంటిని. దేవునిమాట నాకుదెలియదు. దేవుడొకడుండిన నస్థితికి దెచ్చునా? ఆమాట లట్లుండనిమ్ము. ప్రతిదినమును నేనెంతోయుల్లాసముతో క్రొత్తమనుష్యులను కలసి వారిదేహములను చెరిచి నాక్రోధావేశమును దీర్చుకొనుచువచ్చితిని. అదియే నాసంకల్పము. అదియే నామనోనిశ్చయము, అదియే నాజీవితపరమార్థము. నస్థితియందుంచినదానికి నేను వందలకొలది మానవాధములు శిక్షింపబడియున్నారు. అసురుల నణగద్రొక్కుటకు పూర్వము మహిషాసురమర్దని యవతరించలేదా? నేనుకూడ నవ్వుచు, విగ్రహీసుచు, ఖాసములను త్రిప్పుచు వచ్చిన విటగాండ్రకు వ్యాధిగలిగించి, వారిని నిర్మూలముజేసి వారిరక్తమును ద్రావి నాదాహమును తీర్చుకొనుచుంటినిగదా. ఇక నాజన్మ సఫలమయినది. నామనస్సు సంతృప్తి జెందినది.



" సోమశేఖరం కన్నీరుగార్చుచు ఆశ్చర్యమగ్నుడయి "

నిన్ను జూచినపుడేదో మనోవ్యాకులత గలిగినది. నీకేమియు తెలియని కందవని నిమిషములో గ్రహించితిని. నిన్ను దారుణముగా దహింప చిత్తము సమ్మతింపదాయెను. నిన్ను చూడజూడ నేదో జ్ఞాపకమువచ్చినది. దేహము గడగడ వణకినది. ధైర్యము తొలగినది. కొంత తడవునకు సకలమును జ్ఞప్తికివచ్చినది. కొంచెము సందేహముండగా నీపేరడిగితిని. దానిని వినినవెంటనే యాసందేహమును పోయినది. నిశ్చయము గలిగినది. నీతి నియమము లేక బ్రతికిన భ్రష్టురాలికి మానావమానములేమి? సోమశేఖరం నేను......నేను......అయ్యో! చెప్పలేను. నేను......అకాల మృత్యువు వాతబడిన......మీ...మీ అన్న......(హోరుమనియేడ్చుచు క్రిందఁగూలబడును) సోమశేఖరం కన్నీరుగార్చుచు ఆశ్చర్యమగ్నుడయి "నీవు చావలేదా! చచ్చినటుల మానాయన అనుచుండెడి వాడు."

"నాకు చావెందుకు వచ్చును నాయనా? ఈ పాపకృత్యములను జేసి యీనరకకూపమునబడియుండుట నానుదుటవ్రాసియుండగా నాకు మరణమేల సంభవించును? అదృష్టము బాగుండిన చేబట్టిన యా పురుషరత్నమే బ్రదికియుండడా? అబ్బాయీ, నమ్ముము. నా దేహముపై స్వాధీనత లేకయుండెడిది. అయితే మనస్సనందెప్పుడు వారిని మరువలేను. నాజీవితమునందెల్ల వారిని పెండ్లియందొకసారే చూచితినిగాని యాస్ఫురద్రూపమును మరువగలనా? ఇదిగో వారిని మరల కలిసికొనియెదను. నా తప్పులను మన్నింపుడని ప్రార్థించెదను. శరణాగతనై, మన్నించువరకు వారిపాదకమలములను వదలను. నిజము, నిజము, ముమ్మాటికినిజము. నా మొదటియకృత్యమునుతప్ప నేనేదియు నిష్టపడి చేయలేదు. దేహము నేరములను జేసియున్నది. మనస్సునిష్కళంకము. ఇదిగో యిపుడే యీపాపదేహమును విడుచుచున్నాను. నాజీవయాత్ర ముగిసినది. నా వ్రేలియందీయుంగరమును జూచితివా? ఇది మీఅన్నగారిచ్చినది. అదియే నాకిపుడు సహాయముచేయుగాక. దీనియందు వజ్రమున్నది; వజ్రమునందు విషమున్నది. విషమునందు చావున్నది. చావునందు సౌఖ్యమున్నది" యని వజ్రమునూడగొట్టి పొడిచేసి నోటబోసికొని మ్రింగి "నీవు వెడలిపొమ్ము నామాట మరచిపొమ్ము. నేను మరణించుటకు పదిసంవత్సరములాలస్యమయినది. ఇక నాలస్యమేమియులేదు. నీవుదీర్ఘాయువైయుందువుగాక. భగవంతుడు నిన్ను కాపాడుగాక. నా-రా-య-ణ,---నా---రా--య--ణ,—నా...రా" (క్రిందబడి మరణించును)

సోమశేఖరము దుఃఖాంధకారనిమగ్నుడయి. నీళ్లచే కన్నుకనబడక ఒడలు తెలియక, పిచ్చివానివలె నారాయణ నారాయణ యనుచు వీథివెంబడి పరుగెత్తుకొనివెళ్లెను.

---




ఆంధ్రనాయకులు క్రొత్త "పోజు"తో ఆంధ్రమాతను జూచి,
"ఒసే, దూరంగా పో; దగ్గరకు రాకు. మేము మడిగట్టుకున్నాం"

గలిగెను. గోదాపులినతలమునకు చదువరులను గొంపోవుటకు ముందు గంగను నే బరించిన తెఱఁగును (ఇది మన ప్రస్తుత పఠనమునకు మేలుబంతియైనది కావున) * సంక్షేపముగ నిందు దెలుపుదును.

మంచుకొండపై పెక్కునాళ్లు పయనము సాగించిన పిదప లక్ష్మణ ఝూలాకడ జాల యాత్రికులను చూడజాలుదుము. ఈ తావును చేరువఱకు గంగ సన్ననైయుండును. ఇందుండి పోయిపోయి, మైదానమున ప్రవేశించుతఱి క్రమక్రమముగ నది వెడల్పగును. లక్ష్మణఝూలకు మూడుమైళ్లదిగువలో హృషీకేశ క్షేత్రమున్నది. ఈరెండు క్షేత్రములకు నడుమ గంగయొడ్డున చిన్నచిన్న కుటీరము లున్నవి. ఒకరి నడుగ నక్కర లేకుండ మన మీ కుటీరములందుండి ప్రకృతి శోభనువిలోకించుచు, హిమగిరి దృశ్యమును మనసున జొనుపుచు, దివిజకల్లోలినీ పూరమున గ్రుంకు లిడుచు చిరశాంతియందు ధ్యానమగ్నులమై హాయిగ కాలము గడపవచ్చును. ఇందు వసించు యోగులలో ముఖ్యులు రామకృష్ణమంగళస్వాములు. ఇచ్చటి ఆశ్రమములో, వ్యాసాశ్రమము, శంకరాశ్రమము, రామాశ్రమము స్వర్గాశ్రమము ప్రధానములు. శంకరాశ్రమ, స్వర్గాశ్రమములు చక్కని పాలరాళ్ళతో నిర్మింపబడినవి. శంకరాశ్రమము గంగకివ్వలను, స్వర్గాశ్రమ మవ్వలను ఉన్నవి. అనుదినము వీనియందు పురాణకాలక్షేపము జరుగుచుండును. అతిథులను సత్కరించు వ్యవస్థ లిందుగలవు.

ఈవ్యవస్థల నేర్పరచిన మహనీయులలో ముఖ్యుడు కాలీకమలివాలా యను సన్యాసి. ఇతడెప్పుడును నల్ల కంబళి కప్పుకొని తిరుగువాడు కావున ప్రజ లీతని నట్లు పిలువదొడగిరి. ఈతడు స్థాపించిన ధర్మశాలలు హృషీకేశమున మొదలైనవి. బదరికాశ్రమమునకు పోవువారు హృషీకేశమున హిందీలో వ్రాయబడిన ఒక చిన్న వైద్యగ్రంథమును, ఒక మందులసంచికట్టును, ప్రయాణమునకు సంబంధించిన పత్రమును, గంగోదకముతో బంధింపబడిన ఒకచిన్ని చెంబును, ఒక తులసిమాలను కాలీకమలీవాలా ధర్మశాలయందు పడయగలరు. ధనికులకును, పేదలకునుగూడ నీశాలలే వాసస్థానములు. ధనికులిచ్చు పైకము దానమునకై వినియోగపడుచుండును. దేవప్రయాగ, కేదారనాథ, యమునోత్తరి, గంగోత్తరి మున్నగుచోటులందు కాలీకమలీవాలా స్థాపించిన చిన్నిచిన్ని శాలలు కలవు. ఇతడు దేశభ్రమణమున నెంతో పైకము బిచ్చమెత్తి తెచ్చి, వీనినిర్మాణమునకై వెచ్చించినాడు. ఈతనియొక్క నిండుబొమ్మయొకటి నేడును హరిద్వార హృషీకేశములకు † నడుమనున్న సత్యనారాయణమందిరమందున్నది

లక్ష్మణఝూలా హృషీకేశముల నడుమ రెండుచోటులందు యాత్రికుల నీవలి యొడ్డునుండి అవ్వలియొడ్డునకును, ఆవలినుండి యివ్వలికిని దాటించు నావలున్నవి. దాటించుటకు పైకమిచ్చినను నావవాండ్రు పుచ్చుకొనరు. ఇదివల లక్ష్మణఝూలాకడ వ్రేలాడు వంతెనయొకటి నిర్మింపబడినది. ఈప్రదేశమున లక్ష్మణాలయముకలదు హృషీకేశమున భరతాలయము, రామాలయము నున్నవి. లక్ష్మణభరతుల కివ్విచోటులందు దక్క భారతసీమయందు మరెందును ఆలయములు లేవు. హృషీకేశమున మలుపుదాటి నిమ్నతలమునకు దుముకుతఱి నది మిగుల వేగవంతమైనది. హరిద్వారమున గంగ చాల గభీరమైయుండును. అన్నికాలములందును నది యిచట పరచక పోవును. హరిద్వారమందలి ముఖ్యఘట్టము "హరికిపౌరా," హరిద్వారమనిన స్వర్గద్వారమనియు, స్వర్గమునకు పోవువారిందుండి పోవలె ననియు, ఒకప్పుడు యుధిష్ఠిరుడు అనుజులు గూడి ఇందుండి పయనము చేసెననియు, క్రమక్రమముగ దమ్ములును, భార్యయును నేలరాలినను, శునకరూపమున గోచరించినయమునకు తనధర్మప్రవర్తనముజూపె, అతడు స్వర్గమునకందుండియే పోయెననియు హిందువులు విశ్వసించుచుందురు. హరిద్వారమునకు కొంతయెగువలో 'భీమగోడ' యను చోటున నొకచక్కనిచెరువుపొంత పాండవుల విగ్రహములును,

---

* దీనిని గుఱించిన విపులోదంతమును చదువరులుపిదప నెఱుంగ గలరు.

† హరిద్వారము హృషీకేశమునకు పదునేనుమైళ్ల దిగువనున్నది.

# నా మహారాష్ట్ర యాత్ర

## ౨

జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి

సంకల్పశక్తి ఈశ్వరశక్తికి మారుపేరేమో! దైనికజీవనమున నెత్తుకొండ లెదురైనపుడు ద్విగుణీకృతోత్సాహముతో, అద్భుతసాహసముతో వానిని ప్రతిఘటించి ఇది ముందులకురుకును. ఘనాంధకారమువోలు దోష్ట్ర్యము దీని చలుపులను జని ప్రాణములు వీడు రక్కసివలె నలచి ఎందో యదృశ్యమగును. నిలిచి పోర నుంకించిన ప్రతికూలశక్తులీశక్తి యగ్రసర మగుటకు తెరువొసగి, తాము సంపూర్ణ ఆంతరంగిక పరివర్తనమంది, అపూర్వాలోకమున తేజరిల్లి, దీనికి వంగి సలాము నొనరించి వెనుకకు తరలును. పశ్చిమపర్వతముల నెదుర్కొని, కొండసారంగములందు భీషణ ప్రతిధ్వనులు లేపుచు, మహావేగమున ముందుల కురుకుచు ధూమశకటము తన వెలుగున దళ్కొత్తించిన అద్భుతదృశ్యములు నాటి రాత్రి నామానసాంజలి నిడిన భావభిక్ష యివి.

సరిగ రాత్రి రెండున్నరగంటలకు రైలు నాసిక స్టేషను జేరుకొన్నది. కుంజరకుంభస్థలి పైలంఘించుటకు మున్ను క్షణము తడయు కేసరివలె, అవిరళ భావప్రవాహమును తన లేఖినీముఖమునుండి వెడలించుటకుముందు నిముసము యోచించు మహారచయితవలె పొగబండ్లకు రాజైన పంజాబుమెయిలు ఒక్కక్షణముసేపు ఆగినది. విశ్వమందు విరమై పలయునది శాంతిగాని భీషణవిజృంభణముకాదని ఘోరధ్వనియనంతరమపుడు రాజిలిన నిస్తబ్ధత విశద మొనరించినది.

నాసికస్టేషనుకడ రెండు ప్లాటుఫారము లున్నవి. బొంబాయినుండి వచ్చు రయి ళ్లొకప్లాటుఫారముకడను, బొంబాయిదిశ జను బళ్లింకొక ప్లాటుఫారము పొంతను ఆగును. రెండును ఇనుపదారికి చెరియొకవైపున నున్నవి. స్టేషన్ అంత పెద్దదికాదు. రెండుప్లాటుఫారములుకల నిడుపవోలు స్టేషనునకు తమ్మునివలె నున్నది. నాసికపట్టణము దీని కైదుమైళ్లదూరమం దున్నది. నాసికకు త్రియంబకము పదునెనిమిదిమైళ్లు. రెండుక్షేత్రములను చూడవలెననియే బొంబాయినుండి కదలివచ్చితిని. త్రియంబకమందే గోదావరి పుట్టినది.

ఏనదియందు మునిగినను దానిజన్మస్థలమును చూడవలెనని పిన్ననాటనుండి ముక్కువపడుచుందును. నదీపూరము ప్రేమపూరమువంటిదికదా! ఈశ్వరకరుణానందుచు నీశ్వరు నందవలెనని ఆతురపడుచుందుము కదా! వెల్లువలో మున్కలేసి, పనిచెల్లిపోయినదని నేను తలపను. దానిని కనిన ప్రకృతి యెట్టిదో కనుగొన వాంఛింతును. ప్రకృతిదృశ్యములను చూచి, వానియందు విడియవలెనని ఎత్తువేయుచుందును. ఇట్లువిడియునపుడే మన కవి చక్కని సురుకులములు కాజాలును.

గోదావరియెడల నాకు ప్రత్యేకానురాగము గలదు. గోదావరీనదీతీరమున బుట్టి, గోదావరీనీరములందీదులాడి, గోదావరీసలిలమును గ్రోలి, గోదావరీవాలుస్థాపములందాటలాడి, శైశవము నీ నదీమతల్లిదాపల గడపుటచే కన్నతల్లివలె నా కది పూజనీయమైనది. నేడును ఈ నది నాస్వంతనదియని చెప్పుకొనుచుందును. ఎన్నెన్నిచోటులందో తిరిగి జన్మస్థలమందీ నదిని చూచినపుడు నాహృదయ ముప్పొంగును.

గోదావరికి గంగ చెల్లెలందురు. అక్క తనబిడ్డను చెల్లెలిచేత బెట్టినట్లు నా బాల్యముకడవకమున్నే గోదావరి నన్ను గంగకడకు పుత్తెంచినది. గోదావరివలె నామనసునకెంతో ప్రీతిగొలుపు పరిల్లలాము గంగ. గంగపొడవు పదునేనువందలమైళ్లు కదా. ఈ మేరయందు పయనము చేసి, గంగాహృదయమును పఠించుభాగ్యము నాకు

గలిగెను. గోదాపులినతలమునకు చదువరులను గొంపోవుటకు ముందు గంగను నే బరించిన తెఱఁగును (ఇది మన ప్రస్తుత పఠనమునకు మేలుబంతియైనది కావున) * సంక్షేపముగ నిందు దెలుపుదును.

మంచుకొండపై పెక్కునాళ్లు పయనము సాగించిన పిదప లక్ష్మణ ఝూలాకడ జాల యాశ్రమములను చూడఁజాలుదుము. ఈ తావును చేరువఱకు గంగ సన్ననైయుండును. ఇందుండి పోయిపోయి, మైదానమున ప్రవేశించుతఱి క్రమక్రమముగ నది వెడల్పగును. లక్ష్మణ ఝూలాకు మూఁడుమైళ్లదిగువలో హృషీకేశ క్షేత్రమున్నది. ఈరెండు క్షేత్రములకు నడుమ గంగయొడ్డున చిన్నచిన్న కుటీరము లున్నవి. ఒకరి నడుగ నక్కఱ లేకుండ మన మీ కుటీరములం దుండి ప్రకృతి శోభనువిలోకించుచు, హిమగిరి దృశ్యములను మనసున జొనుపుచు, దివిజకల్లోలినీ పూరమున గ్రుంకు లిడుచు చిరశాంతియందు ధ్యానమగ్నులమై హాయిగ కాలము గడపవచ్చును. ఇందు వసించు యోగులలో ముఖ్యులు రామకృష్ణమంగళేస్వాములు. ఇచ్చటి ఆశ్రమములలో, వ్యాసాశ్రమము, శంకరాశ్రమము, రామాశ్రమము స్వర్గాశ్రమము ప్రధానములు. శంకరాశ్రమ, స్వర్గాశ్రమములు చక్కని పాలరాళ్ళతో నిర్మింపబడినవి. శంకరాశ్రమము గంగకివ్వలను, స్వర్గాశ్రమ మవ్వలను ఉన్నవి. అనుదినము వీనియందు పురాణకాలక్షేపము జరుగుచుండును. అతిథులను సత్కరించు వ్యవస్థ లిందుగలవు.

ఈవ్యవస్థల నేర్పరచిన మహనీయులలో ముఖ్యుడు కాలీకమలీవాలా యను సన్యాసి. ఇతడెప్పుడును నల్ల కంబళి కప్పుకొని తిరుగువాడు కావున ప్రజ లీతని నట్లు పిలువఁదొడగిరి. ఈతడు స్థాపించిన ధర్మశాలలు హృషీకేశమున మొదలైనవి. బదరికాశ్రమమునకు పోవువారు హృషీకేశమున హిందీలో వ్రాయబడిన ఒక చిన్న వైద్యగ్రంథమును, ఒక మందులసంచికట్టును, ప్రయాణమునకు సంబంధించిన పరములను, గంగోదకముతో బంధింపబడిన ఒకచిన్ని చెంబును, ఒక తులసిమాలను కాలీకమలీవాలా ధర్మశాలయందు పడయ గలరు. ధనికులకును, పేదలకునుగూడ నీశాలలే వాసస్థానములు. ధనికులిచ్చు పైకము దానమునకై వినియోగపడుచుండును. దేవప్రయాగ, కేదారనాథ, యమునోత్తరి, గంగోత్తరి మున్నగు చోటులందు కాలీకమలీవాలా స్థాపించిన చిన్నిచిన్ని శాలలు కలవు. ఇతడు దేశభ్రమణమున నెంతో పైకము బిచ్చమెత్తి తెచ్చి, వీనినిర్మాణమునకై వెచ్చించినాడు. ఈతనియొక్క నిండుబొమ్మ యొకటి నేడును హరిద్వార హృషీకేశములకు † నడుమనున్న సత్యనారాయణమందిరమం దున్నది

లక్ష్మణఝూలా హృషీకేశముల నడుమ రెండు చోటులందు యాత్రీకుల నీవలి యొడ్డునుండి అవ్వలి యొడ్డునకును, అవలినుండి యివ్వలికిని దాటించు నావ లున్నవి. దాటించుటకు పైకమిచ్చినను నావవాండ్రు పుచ్చుకొనరు. ఇటీవల లక్ష్మణఝూలాకడ త్రేలాడు వంతెనయొకటి నిర్మింపబడినది. ఈప్రదేశమున లక్ష్మణాలయముకలగు హృషీకేశమున భరతాలయము, రామాలయము నున్నవి. లక్ష్మణభరతుల కివ్వోటులందు దక్క భారతసీమయందు మఱెందును ఆలయములు లేవు. హృషీకేశమున గులుపుదాటి నిమ్నతలమునకు దుముకుతఱి నది మిగుల వేగవంతమైనది. హరిద్వారమున గంగ చాల గభీరమైయుండును. అన్నికాలములందును నది యిచట చరచర పోవును. హరిద్వారమందలి ముఖ్యఘట్టము "హరికిపౌరా," హరిద్వారమనిన స్వర్గద్వారమనియు, స్వర్గమునకు పోవువా రిందుండి పోవలె ననియు, ఒకప్పుడు యుధిష్ఠిరుడు అనుజులు గూడి ఇందుండి పయనము చేసెననియు, క్రమక్రమముగ దమ్ములును, భార్యయును నేల రాలినను, సశరీరరూపమున గోచరించినయమునకు తనధర్మప్రవర్తనముజూపి, అతడు స్వర్గమున కిందుండియే పోయె ననియు హిందువులు విశ్వసించుచుందురు. హరిద్వారమునకు కొంతయెడములో 'భీమగోడ' యను చోటున నొకచక్కనిచెరువుపొంత పాండవుల విగ్రహములును,

* దీనిని గుఱించిన విపులోదంతమును చదువరులుపిదప నెఱుఁగ గలరు.

† హరిద్వారము హృషీకేశమునకు పది నేనుమైళ్ల దిగువనున్నది.

# నా మహారాష్ట్ర యాత్ర

౧

జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి

సంకల్పశక్తి ఈశ్వరశక్తికి మారుపేరేమో! దైనికజీవనమున నెత్తుకొండ లెదురైనపుడు ద్విగుణీకృతోత్సాహముతో, అద్భుతసాహసముతో వానిని ప్రతిఘటించి ఇది ముందులకురుకును. ఘనాంధకారముపోలు దౌష్ట్యము దీని చఱుపులను బడి ప్రాణములు వీడు రక్కసివలె నఱచి యెందో యదృశ్యమగును. నిలిచి పోర నంకించిన ప్రతికూలశక్తు లీశక్తి యగ్రసరమగుటకు తెరువొసగి, తాము సంపూర్ణ ఆంతరంగిక పరివర్తనమంది, అపూర్వాలోకమున తేజరిల్లి, దీనికి వంగి సలా మొనరించి వెన్కకు తరలును. పశ్చిమపర్వతముల నెదుర్కొని, కొండసారంగములందు భీషణ ప్రతిధ్వనులు లేపుచు, మహావేగమున ముందుల కురుకుచు ధూమశకటము తన వెలుగున దళుక్కొత్తించిన అద్భుతదృశ్యములు నాటి రాత్రి నామానసాంజలి నిడిన భావభిక్ష యిచ్చె.

సరిగ రాత్రి రెండున్నరగంటలకు రైలు నాసిక స్టేషను జేరుకొన్నది. కుంజరకుంభస్థలి పైలంఘించుటకు మున్ను క్షణము తడయు కేసరివలె, అవిరళ భాష్పప్రవాహమును తన శిఖినీముఖమునుండి వెడలించుటకుముందు నిముసము యోచించు మహారచయితవలె పొగబండ్లకు రాజైన పంజాబుమెయిలు ఒక్కక్షణముసేపు ఆగినది. విశ్వమందు చిరమై వెలయునది శాంతిగాని భీషణవిజృంభణముకాదని ఘోరధ్వనియనంతరమపుడు రాజిలిన నిస్తబ్ధత విశద మొనరించినది.

నాసికస్టేషనుకడ రెండు ప్లాటుఫారము లున్నవి. బొంబాయినుండి వచ్చు రయిళ్లొకప్లాటుఫారము కడను, బొంబాయిదిశ జను బళ్లింకొక ప్లాటుఫారము ప్రాంతను ఆగును. రెండును ఇనుపదారికి చెరియొకవైపున నున్నవి. స్టేషన్ అంత పెద్దదికాదు. రెండుప్లాటుఫారములుకల నిడుపవోలు స్టేషనునకు తమ్మునివలె నున్నది. నాసికపట్టణము దీని కైదుమైళ్లదూరమందున్నది. నాసికకు త్రియంబకము పదునెనిమిదిమైళ్లు. రెండు క్షేత్రములను చూడవలెననియే బొంబాయినుండి కదలివచ్చితిని. త్రియంబకమందే గోదావరి పుట్టినది.

ఏనదియందు మునిగినను దానిజన్మస్థలమును చూడవలెనని చిన్ననాటనుండి మక్కువపడుచుందును. నదీపూరము ప్రేమపూరమువంటిదికదా! ఈశ్వరకరుణనందుచు నీశ్వరు నందవలెనని ఆతురపడుచుందుము కదా! వెల్లువలో మున్కలేసి, పనిచెల్లిపోయినదని నేను తలపను. దానిని కనిన ప్రకృతి యెట్టిదో కనుగొన వాంఛింతును. ప్రకృతిదృశ్యములను చూచి, వానియందు విడియవలెనని ఎత్తువేయుచుందును. ఇట్లువిడియునపుడే మన కవి చక్కని గురుకులములు కాజాలును.

గోదావరియెడల నాకు ప్రత్యేకానురాగము గలదు. గోదావరీనదీతీరమున బుట్టి, గోదావరీనీరములం దీదులాడి, గోదావరీసలిలమును గ్రోలి, గోదావరీవాలుస్థాపములం దాటలాడి, శైశవము నీ నదీమతల్లి దాపల గడపుటచే కన్నతల్లివలె నా కది పూజనీయమైనది. నేడును ఈనది నాస్వంతనదియని చెప్పుకొనుచుందును. ఎన్నెన్నిచోటులందో తిరిగి జన్మస్థలమం దీ నదిని చూచినపుడు నాహృదయ ముప్పొంగును.

గోదావరికి గంగ చెల్లెలందురు. అక్క తనబిడ్డను చెల్లెలిచేత బెట్టినట్లు నా బాల్యముగడవకమున్నే గోదావరి నన్ను గంగకడకు పుత్తెంచినది. గోదావరివలె నామనసునకెంతో ప్రీతిగొలుపు సరిల్లలామ గంగ. గంగపొడవు పదునేనువందలమైళ్లు కదా. ఈ మేరయందు పయనము చేసి, గంగాహృదయమును పఠించుభాగ్యము నాకు

ఈశ్వరవిగ్రహమును కలవు. కొండమీది సూర్యకుండము వలె సీతటాకము మిగుల పవిత్రవంతమైనదని ప్రజల నమ్మిక. హరికిపౌరీకడ గంగ వెడల్పుగ నుండును. గంగ నడుమ చిన్నమందిరముకలదు. విష్ణుపాదములనుండి గంగ యచ్చోటనే వెడలెనని యాత్రికులు విశ్వసింతురు తొలుత నేనీమహాక్షేత్రమునకు ౧౯౨౭ ఏప్రియల్ ౧౩ వ తేదీనాడు జరిగిన కుంభమేళ మహోత్సవసమయమున బోతిని. చిన్నచిన్న సందులనుండి లక్షలకొలదియాత్రికులు బ్రహ్మకుండమందు పగలు ఒంటిగంటవేళ స్నానముచేయుటకై ముందులకురికిరి. జనసమూహమం దపుడెండలో నేలబడి గతజీవులైరి. హరిద్వారమునుండి మూడుమైళ్లు ఎగువకుపోతిమేని ఖంఖలక్షేత్రమును చూతుము. ఇచ్చట దక్షమందిరమును, 'సతీకుండ'ము గలవు. ఇది దక్షుడు యజ్ఞము చేసిన తావందురు. ఈ యధ్వరమిచ్చట జరిగెనో తూర్పుగోదావరిజిల్లాలోని దాక్షారామమందు జరిగెనో తెలుపలేము. నైమిశారణ్యమునందువలె నిందొక పెద్దమారుతీవిగ్రహమున్నది. హరిద్వారమునుండి చాలదూరము సాగిపోతిమేని బ్రహ్మవర్త(దీనికి 'బిఠూర్' అను నామాంతరము కలదు)మను క్షేత్రమును చూతుము. ఒకప్పుడిచట బ్రహ్మ యజ్ఞము చేసెనందురు. అత్తటి భూమీతలమున స్థాపింపబడిన మేకు ఎంతలోతువఱకు లోనికిపోయినదో యెఱుగ యత్నించి ఎందఱో విఫలమనోరథులైరట. ఇచ్చట గంగ మొసళ్లతో నిండియుండును. ఇచటికి సమారు మూడు మైళ్ళదూరమున పరిహారమను పల్లెకలదు. ఈపల్లెకు కొంతదూరమందున్న అరణ్యమున సీతను రామాజ్ఞనాదలదాల్చి లక్ష్మణుడు విడిచెనట. "జానకి ఇందే పరిహరింపబడినది కావున దీనికి పరిహారమను పేరు వచ్చె" నని అచటి యోగియొకడు తెలిపెను. పరిహారమున కనతిదూరమున గంగదాపల మూడు పురాతన దేవాలయము లున్నవి. వీనియందు రాగిబాణముల తునకలున్నవి. ఇవి కుశలవులును, శ్రీరాముడును ఆ ప్రాంతమందు తమ యుద్ధమున వాడిన బాణములని అచటివా రందురు. బాణములు పురాతనములైనవనుట నిస్సంశయము. అరణ్యగర్భమున లోకపావని జానకి విడువబడినచోటున నేడును ఒక పెద్ద మఱ్ఱి చెట్టున్నది. ఈచెట్టుమొదలు చచ్చి చాలకాలమైనది. చాలదూరము వరకు పెరిగిన ఊడలపై నిది నిలిచినది. అచట నొక లోతైన గుండమున్నది. సీతమ్మ అందుండియే భూగర్భమున ప్రవేశించెనని శతవృద్ధుడైన సన్యాసి యొకడచ్చోటున నాకు దెలిపెను. ఈవృద్ధుడాగుండమును నూయిగ మార్చి అచట నొక చిన్న గుడి కట్టినాడు. సీతమ్మ భారతస్త్రీ. ఆమె పరిత్యజింపబడినది భారతారణ్యమందుగాని అమెరికాలో గాని, మెసపొటేమియాలో గాని కాదు. ఆర్యావర్తమందే కదా ఆమె యట్లు విడిచిపెట్టబడినది! జానకి యందే పరిత్యజింపబడినదని వనము నమ్మిన నమ్మవచ్చును.

తరతరములనుండి పెరిగి పెంపొందుచున్న విశ్వాసమును నఱికివేయుట దుర్మతికే సాధ్యము. మూఢవిశ్వాసమును మనసునుండి దూరముగ నెట్టివేయుదును గాని, దేవదేవునివలె ప్రభాకలితమై మనశ్చక్షుస్సముఖమున దోచు విశ్వాసమునకు సాగిలపడుదును. మూఢవిశ్వాసము జ్ఞానసంపాదనమునకు చెఱుపుదెచ్చునట్లే సంశయ పరంపరలు దాని కెగ్గుదెచ్చును. జిజ్ఞాసకు మార్గదర్శకమగు సందియమునకే నేను నామనసున తావొసగుదును. సంశయములను మూటగట్టి మనసునందిమిడ్చి, దేశాటనము చేయువాడు వ్యర్థప్రయాసకు పాత్రుడగును. ఇట్టిఘటము ఏమూలనో ముక్కలై పోయిన బాగు!

లోకపావని జానకి బాష్పవారిచే పవిత్రవంతమైన చోటును చూచినపుడే భారతీయుని కన్నులనుండి నీళ్లు బొటబొట రాలవు? మునిగూడి అచ్చోగొంతకాలముండి మరల బ్రహ్మవర్తమునకు తరలిపోతిని. మంధర్ ఉత్తరీపూర్, వేణీగంజ్, మాధవగంజ్, మియాగంజ్ - అను చోటులుదాటి, గంగాగంజ్ *కడ గంగాతీరమున

* ఈతావు సంయుక్తరాష్ట్రములందు, ఫరుకాబాద్ జిల్లాలో కలదు. ఇచ్చటికొకపూట పయనమందే కనూజ్ కలదు.

వైకుంఠాశ్రమమున నారదస్వామి ఆదరమందుచు కొంత కాల ముంటిని. ఈ తావున భూగర్భమున శంఖచక్రములుగల చక్కని విష్ణువిగ్రహము దొరకినదట. స్వామీజీ అందే తనయాశ్రమమును నెలకొల్పి విష్ణువిగ్రహము నొక చిన్న గుడియందు ప్రతిష్ఠించెను. అందుండి పూర్వశరాయి పోతిని. ఇచట గంగాతీరమున చండీమందిరము కలదు కర్ణుడు తనశరీరమునుండి కొంతరక్తము నదీసి చండీదేవి కిందు అభిషేకము జేయువాడట. 'చండీమయ్యా'ను గుఱించి పాటలుపాటుచు పలువురు హిందూస్థానీయు లచ్చోటి కరుగుదురు. అందుండిపోతిమేని జమల్పూర్ మాంఘీర్, సుల్తాన్‌గంజ్‌లను చేరుకొందుము.

సుల్తాన్‌గంజ్ కడ గంగ చాలవెడల్పుగ నున్నది. నదినడుమ చిన్నకొండగలదు. ఈ కొండపై వెనుక జహ్నుఋషి తప మాచరించువాడనియు, ఆతనికిన్కకు బొల్పడి, వానికుక్షిబడి, ఆతనికరుణ పెంపున వాని యూరువునుండి యీవలికివచ్చి, అందుండి గంగ జాహ్నవి యను పేరునందెననియు అచటివా రందురు. దివంగతుడైన తన జనకుని పవిత్రస్మృతికి చిహ్నముగ నొకవంగీయు డందు ఒక ఈశ్వరాలయమును నిర్మించినాడు. దీని దాపల కొండకొనపై చక్కని ఆశ్రమము కలదు. భారతతీర్థుడను స్వామీజీ ఒక డందుండును. ఇత డతిథులను సత్కరించుచుండును. ఎవరేని ఆతని పాదములపొంత పైకమిడిన, వారి శిష్యులు కైకొందురు. ఎవ్వరును నేమియు నీయకుండినను అచట నాహారము లభించితీరును. స్వామీజీ నియోగించిననావికుడే ఆశ్రమవాసులను గంగనుండి ఆవలకును, ఈవలకును దాటించును. స్వామీజీ ఒకప్పుడు రామేశ్వరమువఱకు దక్షిణయాత్రచేసి అరవమున 'పరుపు' అనుపదమును, తెలుగున 'చారు' అనుమాటను నేర్చుకొన్నాడు. 'గోదావరి' పేరు నాకు ఉత్తరహిందూస్థానమున సర్టిఫికేటై యుండెడిది. ఆనదీతీరమందే నాజన్మస్థల మున్నదని తెలిపినంతన ప్రతియాశ్రమమందు నాకు చక్కని చోటు లభించెడిది.

జహ్ను ఆశ్రమమందలి దృశ్యము మిగుల విచిత్రమైనది. పట్టిసముకడ గోదావరి నడుమ గుడియున్నను, ఇచ్చటివలె నందు ఎత్తయినకొండలేదు. కావున జహ్ను ఆశ్రమమందలి చక్కందన మచ్చోగానరాదు. ఇచటికి రమారమి నూఱుమైళ్ల దూరమందు వైద్యనాథమను మహాక్షేత్రము కలదు. భారతభూమియందలి ద్వాదశ స్వయంభులింగములలో నొకటి అచ్చోగలదు. కాశి, రామేశ్వరము, కేదారనాథము, సోమనాథము, శ్రీశైలము, కాళహస్తి మున్నగు క్షేత్రములు పోలునది వైద్యనాథము. శివరాత్రి కచటికి వేనవేలు యాత్రికులు పోవుచుందురు. సుల్తాన్‌గంజ్ కడ చెంబులందు గంగోదకమును బట్టి, శివరాత్రినాడు ఈశ్వరున కభిషేకము చేయుటకై యాత్రికులు వైద్యనాథక్షేత్రమున కరుగుచుందురు.

వీరితో వైద్యనాథక్షేత్రమునకు పోవలె నని మక్కువపడితిని. ఈ ధోరణి ఆధునిక విద్యార్థులలో పల్వురకు విడ్డూరము గొలుపవచ్చును.

గంగోదకమును గొని శివలింగము నభిషేకించినంతన కైలాసము దివినుండి నక్షత్రవట్లు చేతిలో రాలునని విశ్వసింపను. కాశీక్షేత్రము నాలుమాఱులు దర్శింప గలిగితినని, ఈశ్వరుడు తనకు గల ఒక్క కైలాసము గాక మఱి యైదుకైలాసములను నాకై నిర్మించుచున్నాడని నేను తలంపను. తీర్థయాత్రల ఫలితమును గుఱించి పల్వురు చెప్పు ఉదంతమును ఉన్నదున్నట్లు గ్రహింపను. తీర్థసేవనమును, దేవతాదర్శనమును, దేశభ్రమణమును, కొండొక మహత్తరోద్దేశమునకు సాధనములు మాత్రమే. ఈమహత్తరోద్దేశము ఆత్మశక్తి. ఆత్మశక్తి యలవడిననాడు పొరవలె కనుల నంటిన మాయ రాలుననియు, పరంజ్యోతిని గుర్తింప జాలుదుమనియు నానమ్మిక. పూర్ణవిజ్ఞానము నందజాలిననాడు మన మీ యఖండమును వీక్షింపగలము.

విశ్వవిద్యాలయమున పెద్దడిగ్రీలను సంపాదించితినని, పెక్కు బహుమతుల నందితినని, యశస్తిలకుల ప్రశంస నందితినని విద్వాంసుడ నైతినని తలపను. నిక్కంపు విద్య విశ్వవిద్యాలయమును వీడినయనంతరమే ఆరంభమగును. అక్కరము లిచ్చు జ్ఞానము, ఒకరో యిచ్చిన జ్ఞానము, గ్రంథము లెందటో ప్రోగొనరించిన జ్ఞానము, సెకండు హేండ్ జ్ఞానమనియే నా యభిప్రా

# వలసరాజ్యములందు భారతీయ చిత్రకళ చిత్రములు



౧. అవలోకితేశ్వరుడు



౨. గణేశుడు



అగస్త్యుడు, చండిబానన్, దక్షిణకేదు,
జావా. క్రీ. శ. 9, 10 శతాబ్దములనాటిది



౮. గరుడవాహనుడగు విష్ణువు

యము. లోగల సహజశక్తిని లేపి, స్వతంత్ర యోచన యందారితేలి, స్వంతభావ భాండారమును నిలుపుకొనిననాడే మన విజ్ఞాన దాహము తీఱును. "ఈపిపాస యెట్లు తీఱును దైవమా?" అని కన్నీళ్ళు వదలుదుము కదా! వేయి వెరవులు కోయుదుము కదా! ఈవెరవులను బట్టి నడచుచుండ నాకస్మికముగ మేఘముల నుఱుగునుండి విద్యుల్లత మెఱయు లీల మానస దిగ్వలయమున నొక్కొక్కప్పుడు ఏదేని మహిత భావము తళుక్కొత్తును. అపుడు మనసు కొంత కుదుటబడును. తపసు చాలింపక నడచితిమేని భావసౌదామినీ పరంపరలు గోపికానివహమట్లు మన మనసుల నాశ్రయించి తీఱును!

తీర్థసేవయును, దేశయాత్రయును ఈవెరవులలో ముఖ్యములు. ఏయేతావులందు శతాబ్దులుసాగిలపడినవో ఏయేచోటులు సహస్రాబ్దులకు కనులజూచినవో, ఏయే ప్రదేశము లొకప్పుడు మహావిజ్ఞానులకు పుట్టిండ్లయి గంభీర వేదవాక్కులతో ప్రతిధ్వనించినవో ప్రకృతి శోభతో నవనవోన్మేషమై యున్నవో ఆయాస్థానములం దెన్నెన్ని భావతరంగములు పొంగి పొరలవు? * నేను గ్రుంకులిడిన దీతరంగములందు; నేను సాగిలపడిన దీభావములకు. † శరీరముతో బాటు మానసమును, ఆత్మను గూడ వీనియందు మాటిమాటికి ముంచివేయ నాతురం పడుచుందును. నాదృఢవిశ్వాసము నా యాశయమునకు సింహద్వారమని నమ్మి "నీయింగ్లీషు నీధోరణిని చంపలే"దని పల్వురు గేలిచేసినను నాపథమందు ముందంజ వేయుచున్నాను. నాయింగ్లీషు నన్ను చెఱుపలేదనియే ఆనందింతును. ఆంగ్లభారతిని నేననవరతము పూజించుచునేయుందును. కాని నాస్వతంత్ర భావమును మట్టుపెట్టుమని ఈమె హుకుమ్ చలాయించుచో, హద్దుమీఱి రావలదని ఈమెను ధిక్కరించుటకు సంశయింపను.

జహ్నుఆశ్రమమునుండి నూఱుమైళ్లను కాల్నడకవైద్యనాథక్షేత్రమునకు పోవ నిశ్చయించితిని. పరుగిడుచు, రివ్వురివ్వున నెగయుచు మన మెంత జ్ఞానమును సంపాదింతుము? నడచినడచి ఉస్సురుస్సురని చెమ్మటబొట్టులు రాల్చుచు, నీబొట్టులందు ముత్యాలుపోలు క్రొత్త తలపులను చూతుము. దక్షిణామూర్తి యోగనుండియు, దోమనుండియు విజ్ఞానమును సంపాదించువాడట. ఆ మహనీయుడు పుట్టిన చోటునందే మనము జన్మించితిమి. యత్నించినచో బాహ్యదృశ్యములనుండి మన మశేషజ్ఞానము తోడుకొనలేమా?

ఆశ్రమమందు కొన్నాళ్లు విడిసియుంటిని. అచట జరుగు పురాణకాలక్షేపమందును, తాత్త్వికచర్చలందును పాల్గొనువాడను కావున స్వామీజీకిని, ఆశ్రమవాసులకును నాయెడల నెంతో ప్రేమకుదిరెను. స్వామీజీ కమండలువుపోలు చక్కని రాగిచెంబును (నేనును ఇది నాకడనున్నది) తెప్పించి యిచ్చినాడు. ఆశ్రమసమీపమందే కలశమున గంగోదకమును నింపి లోకపావనిని జేబూని, యోగీంద్రుని ఆశీస్సులనంది వైద్యనాథమునకు పోతిని. ‡ శివరాత్రిసమయమున నీవ్యాసము వ్రాయుతఱి: స్మృతి

---

* బ్రహ్మసమాజికులందు పెద్దయైన రవీంద్రుడేమనినాడో గమనింపుడు: "India chose her places of pilgrimage wherever there was in nature some special grandeur or beauty so that her mind could come out cf its world of narrcw necessities and realise its place in the infinite"

† ఇట్టి భావములు కేవలము పౌరాణిక ప్రాముఖ్యముగల తావులందును, ప్రకృతి శృంగారమున రంగారుచోటులందును మాత్రమేకాక చారిత్రక ప్రాముఖ్యము గల స్థానములందునుగూడ వెల్లివిరియుచుండును. కావున పుణ్యస్థలములును, పణ్యప్రదేశములును, ఎడారులును, కొండలును, వనములును, నేల సొరంగములును గూడ నా భారతయాత్రయందు జేరినవి.

‡ ఇట్టియాత్ర లొకప్పు డాంగ్లవసుంధరయందునుకూడ జరుగుచుండెడివి. లండనులో థేమ్సునదీతీరమందలి సత్రమందు విడిసి, పల్వురుయాత్రికులు కేంటర్‌బరికి (ధర్మరక్షణార్థమసువులుగోల్పడిన థామస్‌బెకెట్‌సమాధిస్థానమును చూచుటకై) పోవువారనియు, పథికు లొక్కొక్క రొక్కొక కథచెప్పువారనియు, ఉత్తమకథకుని పేరున మార్గమందు విందులును, వేడుకలును జరుగుచుండెడివనియు చాసరుమహాకవి తన "Canterbury Tales" లో దెలిపియుండెను కదా!

యము. లోగల సహజశక్తిని లేపి, స్వతంత్ర యోచన యం దాటితేతే, స్వంతభావ భాండారమును నిలుపుకొనిననాడే మన విజ్ఞాన దాహము తీఱును. "ఈపిపాస యెట్లు తీఱును దైవమా?" అని కన్నీళ్ళు వదలుదుము కదా! వేయి వెరవులు కోయుదుము కదా! ఈవెరవులను బట్టి నడచుచుండ నాకస్మికముగ మేఘముల మఱుగునుండి విద్యుల్లత మెఱయు లీల మానస దిగ్వలయమున నొక్కొక్కప్పుడు ఏదేని మహిత భావము తళుక్కుత్తును. అపుడు మనసు కొంత కుదుటబడును. అపను చాలింపక నడచితిమేని భావసౌదామినీ పరంపరలు గోపికానివహమట్లు మన మనసుల నాశ్రయించి తీఱును!

తీర్థసేవయును, దేశయాత్రయును ఈవెరవులలో ముఖ్యములు. ఏయేతావులందు శతాబ్దులుసాగిలపడినవో ఏయేచోటులు సహస్రాబ్దులకు కనులజాచినవో, ఏయే ప్రదేశము లొకప్పుడు మహావిజ్ఞానులకు పుట్టిండ్లయి గంభీర వేదవాక్కులతో ప్రతిధ్వనించినవో ప్రకృతి శోభతో నవనవోన్మేషమై యున్నవో ఆయాస్థానములం దెన్నెన్ని భావతరంగములు పొంగి పొరలవు? * నేను గ్రుంకులిడిన దీతరంగములందు; నేను సాగిలపడిన దీభావములకు.† శరీరముతో బాటు మానసమును, ఆత్మను గూడ వీనియందు మాటిమాటికి ముంచివేయ నాతురంపడుచుందును. నాదృఢవిశ్వాసము నా యాశయమునకు సింహద్వారమని నమ్మి "నీయింగ్లీషు నీధోరణిని చంపలే"దని పల్వురు గేలిచేసినను నాపథమందు ముందంజ వేయుచున్నాను. నాయింగ్లీషు నన్ను చెఱుపలేదనియే ఆనందింతును. ఆంగ్లభారతిని నే ననవరతము పూజించుచునేయుందును. కాని నాస్వతంత్ర భావమును మట్టుపెట్టుమని ఈమె హుకుమ్ చలాయించుచో, హద్దుమీఱి రావలదని ఈమెను ధిక్కరించుటకు సంశయింపను.

జహ్ను ఆశ్రమమునుండి నూఱుమైళ్లను కాల్నడక వైద్యనాథక్షేత్రమునకు పోవ నిశ్చయించితిని. పరుగిడుచు, రివ్వురివ్వున నెగయుచు మన మెంత జ్ఞానమును సంపాదింతుము? నడచినడచి ఉస్సురుస్సురని చెమ్మట బొట్టులు రాల్చుచు, నీబొట్టులందు ముత్యాలుపోలు క్రొత్త తలపులను చూతుము. దక్షిణామూర్తి యాగనుండియు, దోమనుండియు విజ్ఞానమును సంపాదించువాడట. ఆ మహనీయుడు పుట్టిన చోటునందే మనము జన్మించితిమి. యత్నించినచో బాహ్యదృశ్యములనుండి మన మశేషజ్ఞానము తోడుకొనలేమా?

ఆశ్రమమందు కొన్నాళ్లు విడిసియుంటిని. అచట జరుగు పురాణకాలక్షేపమందును, తాత్త్వికచర్చలందును పాల్గొనువాడను కావున స్వామీజీకిని, ఆశ్రమవాసులకును నాయెడల నెంతో ప్రేమకుదిరెను. స్వామీజీ కమండలువునుపోలు చక్కని రాగిచెంబును (నేటికు ఇది నాకడ నున్నది) తెప్పించి యిచ్చినాడు. ఆశ్రమసమీపమందే కలశమున గంగోదకమును నింపి లోకపావనిని జేబూని, యోగీంద్రుని ఆశీస్సులనంది వైద్యనాథమునకు పోతిని.‡ శివరాత్రిసమయమున నీవ్యాసము వ్రాయుతటి ప్రకృతి

* బ్రహ్మసమాజికులందు పెద్దయైన రవీంద్రుడేమనినాడో గమనింపుడు: "India chose her places of pilgrimage wherever there was in nature some special grandeur or beauty so that her mind could come out of its world of narrow necessities and realise its place in the infinite"

† ఇట్టి భావములు కేవలము పౌరాణిక ప్రాముఖ్యముగల తావులందును, ప్రకృతి శృంగారమున రంగారు చోటులందును మాత్రమేకాక చారిత్రక ప్రాముఖ్యము గల స్థానములందునుగూడ వెల్లివిరియుచుండును. కావున పుణ్యస్థలములును, పణ్యప్రదేశములును, ఎడారులును, కొండలును, వనములును, నేలసొరంగములును కూడ నా భారతయాత్రయందు జేరినవి.

‡ ఇట్టియాత్ర లొకప్పు డాంగ్లవసుంధరయందునుకూడ జరుగుచుండెడివి. లండనులో థేమ్సునదీతీరమందలి సత్రమందు విడిసి, పల్వురుయాత్రికులు కేంటర్ బరీకి (ధర్మరక్షణార్థము కనువులుగోల్పడిన థామస్ బెకెట్ సమాధి స్థానమును చూచుటకై) పోవువారనియు, పథికు లొక్కొక్క రొక్కొక కథచెప్పువారనియు, ఉత్తమకథకుని పేరున మార్గమందు విందులును, వేడుకలును జరుగుచుండెడివనియు చాసరుమహాకవి తన "Canterbury Tales" లో దెలిపియుండెను కదా!

# నక్షత్రమండలము

గొబ్బూరు వేంకటానందరాఘవరావు

(యువసంవత్సర ఫాల్గున మాసము, ధాతసంవత్సర చైత్రమాసము)

ఉత్తరము

తూర్పు




పడమర

దక్షిణము

[ ఈపటమును తలమీదుగా ఆయాదిక్కులు సరిపడునట్లు పట్టుకొని పరిశీలింపవలెను. ఇందున్నట్లు

| | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1936 ఫిబ్రవరి | 8 | తేదీని | రాత్రి | 8-48 | గంటలకును, | ఫిబ్రవరి | 15 | తేదీని | రాత్రి | 8-20 | గంటలకును | నక్షత్రాదులు |
| ,, | 22 | ,, | ,, | 7-F2 | ,, | ,, | 29 | ,, | ,, | 7-24 | ,, | కనబడును. ] |
| మార్చి | 1 | ,, | ,, | 7-20 | ,, | ,, | 8 | ,, | ,, | 6-52 | ,, | |

"Heaven,
Is the Book of God before thee set,
Wherein to read His wondrous works and learn,
His seasons, hours, or days, or months, or years,

* * * * * *

For wonderful indeed are all His works,
Pleasant to know, and worthiest to be all
Had in remembrance always with delight;
But what created mind can comprehend
Their number, or the wisdom infinite
That brought them forth and hid their causes deep?

(Milton.)

నక్షత్రాది సంజ్ఞలచే రచించి భగవంతుడు, ప్రకాశింపచేసిన మహోత్కృష్ట గ్రంథమువిూ ఖగోళము! ఆగ్రంథరాజము చక్కగా చదివి, ఆతని మహాద్భుత నిర్మాణశక్తిని గ్రహించి, దిన, మాస,ఋతు, సంవత్సరాత్మకమైన కాలమర్మము చక్కగా తెలిసికొనవలెను. ఆ విశ్వమయుడు నిర్వహించు కార్యజాలమంతయు మహాద్భుతమై, తెలిసికొనుటకు ఇంపై, ఆనందముతో నిత్యము స్మరింప నర్హమైనవానిలోనెల్ల నగ్రగణ్యమై యొప్పారుచున్నది. కాని మనుజమాత్రుడెవడు ఆతని సృష్టి వివరములను లెక్కించి తెలిసికొనగలడు? నిగూఢములైన ఆతని సృష్టి మర్మములను భేదింప నెవరితరము? ఆసృష్టికి హేతువైన ఆ మహామహుని అఖండధీశక్తియొక్కపారము ఎవరెరుంగగలరు?

ఈయువసంవత్సర ఫాల్గున శుద్ధ చతుర్దశి ౮-౩-౧౯౩౬ మొదలు ధాతృసంవత్సర చైత్రబహుళ పాడ్యమి ౮-౪-౧౯౩౬వఱకు అగుమాసములో రాత్రి తొలిజామున మన కగపడునక్షత్రాది ఖగోళచారులను పరిశీలింతము.

## పాలవెల్లి (Milky way)

ఈమాసములో రాత్రి తొలిజామున పాలవెల్లి దక్షిణ సమీపపు ఆగ్నేయదిశను నౌకామండలముకడ ప్రారంభమై క్రమముగా విస్తరించుచు నౌకా, వాసుకి, శ్వాన, లఘుశ్వాన, వృత్ర, సారథి, భృగు పరశుమండలములమీదుగా వాయవ్యమున నప్సరసమండలమువఱకు కొంచెము వంగిన ధనురాకారముతో వ్యాపించి, తుదకు వాయవ్యక్షితిజమున నదృశ్యమగుచున్నది. ఆరంభమున నాగ్నేయదిశకడ వైశాల్యముకంటె వాయవ్యప్రకోనమున నాలుగైదురెట్లెక్కువ వైశాల్యము కలిగియున్నది.

ఈపాలవెల్లిలో ముత్తుమిూద రెండులక్షల కోట్ల నక్షత్రము లున్నవని శాస్త్రవేత్తలు చెప్పుచున్నారు. ఈక్షీరవాహిని మిక్కిలి దట్టముగా నున్నట్లు కనబడెడి ధనుర్మండలములో దీని నాభిస్థానము కలదు. మనసూర్యుడీ పాలవెల్లిలో చేరిన ఒకచిన్నచుక్క. అతడు తనను సేవించి, తనచుట్టు పరిభ్రమించుచున్న భూమండలముతోను, కుజ, గురు, శుక్ర, శని ముఖ్య గ్రహములతోను, ఇంకను చంద్రాద్యుపగ్రహములు, ఉల్కలు, ధూమకేతువులు లోనగు సంచారులతోను కూడిన తన కుటుంబమునంతయు వెంట నిడుకొని, పాలవెల్లిలో గల తక్కిన చుక్కలతోబాటు, ధనుర్మండలస్థము నాభిస్థానముచుట్టు పరిభ్రమించుచున్నాడు. ఆనాభిస్థానము చుట్టును బండిచక్రములాగున సూర్యుడొకమారు తిరిగి వచ్చుసరికి ౨౦ కోట్ల సంవత్సరములకు పైగా పట్టుచున్నది. ఈభూమి సృష్టికాబడి ౧౯౫ కోట్ల సంవత్సరములైనవని మనవారును, ౨౦౦ కోట్ల సంవత్సరములైనవని సర్ జేమ్సు జీన్సు మొదలగు పాశ్చాత్యశాస్త్రవేత్తలును తెలుపుచున్నారు. కాబట్టి ఈ భూమిపుట్టిన తరువాత పాలవెల్లిలో ధనుర్మండల నాభిస్థానము చుట్టును సుమారు పదిసారులు మాత్రము చుట్టివచ్చినది. ఇట్టి ఒక్కప్రదక్షిణకాలము ఒక విశిష్ట సంవత్సర మనుకొనినయెడల ఆలెక్కను మనభూమికి ఇట్టి విశిష్టసంవత్సరములు పదియైననిండలేదని తెలియనగును. పాలవెల్లి విచిత్ర విషయసముద్రముకదా?

## సడమట

ఇంద్రమదయు, ఆమెపుత్రుడు సుకన్యాసహితుడు చ్యవనుడును, చ్యవనుని మిత్రులగు అశ్వినుల్లును,

అశ్వినుల రథమునకు వాహనమని వర్ణింపబడిన శింశుమారమును—ఈ నక్షత్రములన్నియు త్వరలో నస్తమింపనైయున్నవి. శింశుమారము ఈవరకే చాలమట్టుకు అస్తమించినది. ఆదిగువ ధుంధుడును, ధుంధునికి; దిగువ వంకలు దిరుగుచు యమునానదియును, ఆనదీప్రాంతములపై ఇంద్రదత్త విమానము నెక్కి విహారము సలుపుచుండు ఉపరిచరవసువును నైరృతి దిగ్భాగమున నస్తమింపనైయున్నారు.

## తేజోవిషయమున నగ్రగణ్యములగు నక్షత్రములు

## (First Magnitude Stars)

ఇరువదింటిలో ఇపు డొక పదునొకండు మాత్ర మగపడుచున్నవి పడమటినుండి వరుసగా వానిం బరికింతము——

౧. పడమటకు వ్రాలిన రోహిణి (Aldebaran in Taurus)

౨. వృత్రపాద మనబడు రిగెల్ (Rigel in Orion)

౩. మృగవ్యాధ రుద్రుడు (Sirius in Canis Major)

౪. ఆదిగువ నౌకామండలములో అగస్త్యుడు. (Canopus in Argo Navis)

౫. పాలపల్లి కావల గగన మధ్యరేఖపై పూర్వశ్వానము (Procyon)

౬. ఆ పైని సాంబుడు (అర్ధనారీశ్వరుడు—Pollux)

౭. ఆర్ద్రి (Betelgeaux)

౮. బ్రహ్మహృదయము (Capella in Auriga)

౯. గగనమధ్యరేఖకు తూర్పున మఘ (Regulus)

౧౦. తూర్పున బాసుగా ఉదయించిన చిత్ర (Spica)

౧౧. తూర్పున ఇపుడే ఉదయించుచున్న స్వాతి (Arcturus)

## దక్షిణాకాశ నక్షత్రములు

వల (Reticulum) చుక్కలును, అందు చిక్కి "మానుష ప్రసవం బొనర్చిన"దని వర్ణింపబడిన అద్రిక (gold fish Dorado)యును త్వరలో నదృశ్యమగును. రాక్షసశిల్పి మయుడును త్వరలో దక్షిణక్షితిజమును దాటిపోయి కానరాకుండును. వీనికి తూర్పుగా, గగనమధ్యరేఖకు అటునిటు, విశాల వ్యాప్తిగల నౌకామండలము (Argo Navis) కలదు. అందలి వివిధ భాగములు స్తంభము(Mast)చాపలు(Sails)పృష్ఠము(Keel) స్పష్టముగా నగపడు చున్నవి. నౌకయొక్క చుక్కాని (Helm) కడ నగస్త్యుడు(Canopus) మహోద్భుత మైన తేజస్సుతో మెఱసి పోవుచున్నాడు. అగస్త్యుడు మన సూర్యునికంటె ఏబదివేల రెట్లు సుమారు తేజోధికుడైన బ్రహ్మాండగోళమని మనము మఱువరాదు.

## ఉత్తరాకాశము

వాయవ్య భాగమునందు, క్షీరసాగర సంజాతలయి కల్పవృక్షచ్ఛాయలను విహరించుచున్న అప్సరసలు త్వరలో నస్తమించి మన దృష్టిపథమునకు తప్పిపోనైయున్నారు. ధ్రువక్షితిలో, ఉదయాస్తమానము లెఱుంగకయే తోకచివరనున్న ధ్రువుని చుట్టు లఘుఋక్షపు చుక్కలు తిరుగుచున్నవి. అందున్నవారు ధ్రువరక్షకులైన ధాత, విధాతలు; తోకలో ధ్రువుని గిరువ కశ్యప, మహేంద్ర, అగ్నులు; ధాత కెదురుగా మిత్రుడు అనునీ నక్షత్రములు. ఈనక్షత్రములకు అస్తమానము లేదుకనుక వీటికి పశ్చిమసముద్రముజలములందు స్నానమాడు భాగ్యము లేకపోయెనని ఒకకవి చమత్కారముగా వర్ణించినాడు. ఈశాన్యమున సప్తఋషులును చక్కగా ఉదయించినారు. క్రతు, పులహ, పులస్త్య, అత్రి, అంగీరస, వసిష్ఠ, మరీచులను నీసప్తఋషి మండలమును బృహదృక్ష మందురు. ఈరెండు ఋక్షములకును మధ్యను ధరానూనుడు (Dracon) అనబడు నరకాసురుడు గొప్ప సర్పమువలె మెలికలు తిరుగుచు ఇప్పుడు పొడచూపుచున్నాడు.

తూర్పున

ఇప్పుడే ఉదయించుచున్న భూతేశమండలములో పగడమువంటి ఎఱ్ఱనికాంతితో రమ్యముగా ప్రకాశించుచు స్వాతి ఉదయించినది. స్వాతితో తులమాను తోరణస్తంభమువలె, ముత్యమువంటి ధవళకాంతితో, చిత్ర ఈవలనే ఉదయించినది. ఆగ్నేయ దిగ్భాగమున నహుషునిపై వార్తికపుపక్షి (Corvus) ఉదయమై యున్నది.

మధ్యను

సప్తఋషులలో క్రతు, పులహులకు పడమరగా గగనమధ్యరేఖ సమీపమున మూషకముపైనెక్కి లంబోదరముతోను, ఏనుగుముఖము, తొండములతోను విఘ్నేశ్వరుడు పార్వతీపరమేశ్వర మిథునమునకు అనతి దూరములో మెఱయుచున్నాడు. అతని సమీపమునందే ఉన్న కల్పవృక్షమునకు ప్రక్కగా, పాలవెల్లిలో భృగుపరశుమండల మున్నది. దానికి పశ్చిమభాగముననూ, కృత్తికచుక్కల కెగువను గ్రుడ్లు మిటకరించుకొనుచు ఇంద్రమదను కారించిన పులోమరక్కసు డున్నాడు. అశ్వినులకును, పిల్లలకోడి (కృత్తిక) చుక్కలకును మధ్య ప్రొయ్యిపొక్కిళ్లవలె భరణిచుక్కలు మూడునుకలవు. కృత్తికకు దిగువ క్రాంతిరేఖప్రక్కనే రోహిణి చుక్కగా మెఱయుచున్నది. అది ఎద్దుకన్నువలె ఎఱ్ఱగానున్నది కనుకనే పేరు సార్థకమైనది. వృషభరాశికిది నేత్రమువలె నున్నది. వృషభముయొక్క శరీరదృశ్యము ఇపుడుగోచరించినంత తేటగాను, చక్కగాను ఇంకొకప్పుడు గోచరించదు. కావున ఆరాశిలోని చుక్కలను, వృషభస్వరూపమును, నేత్రస్థానమున రోహిణీనక్షత్రమును చక్కగాచూపుపటము ఈ దిగువ చూడనగును. రోహిణి సమీపమున దిగువగా పరివృత్త (Bellatrix), ఆర్ద్ర (Betelgeaux) Rigel ముఖ్య నక్షత్రములతోను, మృగశిరస్సుతోను, నడుమునకు చుట్టియున్న పటకానుండి క్రిందకు వ్రేలాడు ఖడ్గముతోను Orion యోధుని తేజోరూపముగలదు. Rigel నక్షత్రముకడపుట్టి, యమునానదినైరృతిదిశకు వంకరతిరిగి ప్రవహించుచున్నది. Orion యోధునిదిగువనే శశక, కపోతములున్నవి. ఆర్ద్రకెగువ, సారథిమండలములో బ్రహ్మహృదయము అఖండతేజముతో మెఱయుచున్నది. పునర్వసుమహావిమానము పాలవెల్లిప్రక్కనే గగనమధ్యరేఖపై ప్రకాశించుచున్నది. నౌకామండలమునకెగువ పాలవెల్లిలో మందరగిరి అనుకవ్వమునకువాసుకియను త్రాడుచుట్టి ఇటురాక్షసులును, అటుపునర్వసు నక్షత్రమునకు అధిదేవత యైన అదితిదేవి పుత్రులగు దేవతలును పట్టి మథించగా తొలుత జగద్భయంకరముగా జనించిన హాలాహలమును నేరేడు పండువలె మ్రింగి, కంఠమున నిడుకొని, అటునిటు కదలకుండ పట్టియుంచిన నీలకంఠుడు-మృగవ్యాధ రుద్రుడున్నాడు. పునర్వసు చుక్కల కావల తూర్పుగా పొట్లపూవువంటి రిక్కమబ్బు (Nebula)తో పుష్యమి నక్షత్రమును, ఆదిగువ సర్పదైవత్యమైన ఆశ్లేషయు, దాని కెగువ పల్లకిబొంగువంటి ఆకారముగల చుక్కలతో మఘయును, మఘకు తూర్పుగా, నాలుగు మంచముకోళ్లవలె ఫల్గునీ నక్షత్రములును వరుసగా నున్నవి. ఆవల 'పాణినాంపంచ' ఐదువ్రేళ్ళతో కూడిన అరచేయివంటి ఆకారముగల హస్తనక్షత్రములును, వాటికెగువ, క్షీరోదపు ఉత్తరధ్రువముకడ వేణీమండల నక్షత్రములును ఉన్నవి. దుర్యోధనాదులను హతమార్చి ఇపుడే ఉదయించుచున్న వాయుదేవాంశజుడు భీముడు (స్వాతీ నక్షత్రము) ద్రౌపదీసతి జట ముడి వేయుచు వేణీసంహారనాటక మాడుచున్నట్లు కనబడు చున్నాడు. క్రాంతిరేఖకు దిగువను, నౌకామండలమున కెగువను ఆశ్లేష నుండి తూర్పునకు వ్యాపించియున్న అహినహుష మండలములకు దిగువ వహ్నిమండలమును, ఎగువ గ్రావ, చమస- వార్తికమండలములును వేదగాథలతో సంబంధముగల నక్షత్రస్వరూపము లని మనము మరువకూడదు. మార్చి ౨౧-వ తేదీని (Vernal Equinox) వసంత విషువద్దినము. ఆనాడు దివారాత్రములు సరిగానుండును.

వృషభరాశి

"చత్వారి శృంగాః త్రయో అస్య పాదా
ద్వే శీర్షే సప్తహస్తాసో అస్య,

త్రిధా బద్ధో వృషభో రోరవీతి
మహోదేవో మర్త్యాం ఆవివేశ"

ఋగ్వేదము. IV- ౫౮-౩.

అతనికొమ్ములు నాలుగు; కాళ్లు మూడు; శిరస్సులు రెండు; హస్తము లతనికి ఏడు. అతడు మూడు విధములుగా కట్టబడి గట్టిగా రంకెవేయుచున్నాడు. ఆ మహోదేవుడు మర్త్యులను ఆవేశించియున్నాడు.

కృత్తిక అగ్నిదైవత్యమైన నక్షత్రము. అది చాలవఱకు వృషభరాశిలోనిది. ఈఋక్కు వృషభరాశిని, అగ్నిని వర్ణించుచున్నట్లు నాకుతోచుచున్నది. పాశ్చాత్య దేశములలో క్రీస్తుకుముందు బహుకాలము నుండి ప్రశంసింపబడుచున్న వృషభరాశిరూపము ఈ క్రింద చూడగలరు. ఇందు నాలుగు శృంగములును,



వృషభరాశి

రెండుకాళ్లును స్పష్టముగా గోచరించుచున్నవి. రాసులు చిత్రింపబడిన ఏ ప్రాచీన దేవాలయములోగాని, ఏ ప్రాచీన ఖగోళచిత్రములలోగాని పూర్తిగా నాలుగు కాళ్లతో వృషభరాశి చిత్రింపబడినట్లు గానరాకున్నది. పడమటిదేశము లన్నిటిలో వృషభరాశి చిత్రము రెండు కాళ్లతోమాత్రమే కనపడుచున్నది. కృత్తిక చుక్కల నుండి చిగురకు వ్యాపించియున్న చుక్కలను వేదకాలపు ఋషులు వృషభముయొక్క మూడవకాలని భావించి యుందురని తోచుచున్నది. అట్లే ఈపటముయొక్క ఎద్దుముఖములో, రోహిణిగాక తక్కిన చుక్కలరూపము రెండవముఖముగా భావించి, 'ద్వే శీర్షే' అని వర్ణించి యుందురనికూడ తోచుచున్నది. "త్రిధాబద్ధ" మూడు విధములుగాగాని, మూడువరుసల త్రాళ్లతోగాని కట్టబడిన ట్లున్నరూపము పటమునందును, ఆకాశమునందును కూడ స్ఫురించుచున్నది.

కాబట్టి వృషభరాశినిగూర్చి మన మీసంగతులు జ్ఞప్తియం దుంచుకొందము:

(౧) వృషభరాశి నాలుగుకాళ్లు కలిగిన పూర్తి రూపముతో స్వేచ్ఛగా శాంతముగానున్న ఎద్దురూపము కాదు, వేదకాలమునాడు మూడును, అటుపిమ్మట రెండును - ముందుకాళ్లుమాత్రము గల్గి - రంకెవేయుచు లంఘింపబోవుచున్నట్లున్న ఆబోతురూపము.

(౨) రెండుగాక - నాలుగుకొమ్ములు - రెండు శిరస్సులు - మూడుకన్నులు, లేక మొనకట్లు గల వృషభరూపము, అగ్నికి వృషభమునకు అభేదము అపాదింపబడినది. కాళీ- కరాళీలోనగు అగ్నిదేవుని సప్తజిహ్వలు ఏడుచేతులుగా వర్ణింపబడినట్లు తోచెడిని.

ఈఋక్కు ఘృత సూక్తములోనిది. దీనికి వ్యాఖ్యానము చేయుచు విల్సన్ పండితుడు, "వేదవాఙ్మయములో కొన్నిచోట్ల ఎంతనిగూఢతా, అస్పష్టత కలవో దీనివల్ల తెలిసికోవచ్చు"నని తెలిపినాడు. "చిరకాలము నుండి జనపరంపర చెప్పుకొను గాథల నాధారము చేసికొని ఈసూక్తమున కర్థముచెప్పనెంచుట నిరర్థకప్రయాస"మని లడ్విగ్ పండితుడు వ్రాసినాడు. "చత్వారి శృంగా" అను పదములకు నాలుగువేదములని శాయనాచార్యులవారు చెప్పినారు. సూర్యార్థములో తూర్పు మొదలయిన నాలుగు దిక్కు లర్థమగుననికూడ వారు చెప్పినారు. "త్రయో అస్య పాదా" అనుదానికి త్రికాలములయందు జరుగు యజ్ఞకర్మ లర్థమనినారు. రెండు శిరస్సులను బ్రహ్మోదాన ప్రవర్గ్యకర్మలని తెలిపినారు.

"త్రిధాబద్ధో" అనగా మంత్ర, కల్ప, బ్రాహ్మణబద్ధమైన శ్రౌతకర్మలని స్పష్టపరచినారు. రంకవేయుట అనగా వేదము గట్టిగా చదువుట అని వివరించినారు. వృషభము యజ్ఞము కావచ్చును; లేదా ఆదిత్యుడు కావచ్చునన్నారు. మహీధరవ్యాఖ్య వేరువిధముగా నున్నది. నాలుగు కొమ్ములనగా యజ్ఞముచేయించుపురోహితులు, ఆచార్యులు నలువురును; లేదా వ్యాకరణార్థములో నామవాచకములు, క్రియలు, అవ్యయములు లోనగునవట! 'త్రయోఅస్యపాదా' అనగా వేదములు మూడును పాదములట; లేదా, ఉత్తమ, మధ్యమ, ప్రథమ పురుషులట; లేదా భూతభవిష్యద్వర్తమాన కాలములట! ఇట్లున్నవి వేదార్థములు.

అగ్నిని వృషభముగా వేదములో పెక్కుచోట్ల వర్ణించియున్నారు. మేషాదిరాసుల కన్నిటికి వేదములో నుల్లేఖములున్నవి. స్పష్టముగా ఖగోళమున గోచరించు సంగతులను త్రోసివేసి ఇతరములగు అర్థములు మాత్రము చెప్పుకొనుచుండుట యుక్తముకాదని విన్నపము.

---




ఆంధ్రనాయకుల పరధ్యానము



౬. మహిషాసురమర్దనము



౭ హరిహరుడు - సింసింగ్



౮. ప్రజ్ఞాపారమితుడు-సింఘసారి, జావా.

# వలసరాజ్యములందు భారతీయ శిల్పకళ



తలిశెట్టి రామారావు

## 8. జావాయందలి ప్రతిమా నిర్మాణము

జావాయందు లభించిన చక్కని విగ్రహములు మాత్రమే జావాశిల్పుల కీర్తిని చిరకాలము నిలువబెట్టగలవు. వీటిలో ననేకములు - హిందూదేశమున గానబడు విగ్రహములతో రచనయందు సరితూగగలవు; వీటిని మించియున్నవని కూడ కొందరి యభిప్రాయము.

దేవాలయములలో పూజకొరకు ప్రతిష్ఠింపబడినట్టియు, గూళ్ల నలంకరించినట్టియు చిన్నవిగ్రహములును, అలంకారార్థము మలచబడిన సామాన్య పరిమాణములు కల విగ్రహములును, సింహళమునందు కనబడు విగ్రహములవంటి పెద్దవిగ్రహములును జావాయందు గలవు. త్రిమూర్తులు, గణేశుడు, దుర్గ మొదలగు హిందూవేల్పులను, బుద్ధుడు, అవలోకితేశ్వరుడు, మైత్రేయుడు, మంజుశ్రీ, తార, వసుంధర మొదలైన మహాయాన బౌద్ధమతమునకు జెందిన వేల్పులను జావాశిల్పులు సిద్ధహస్తములతో మలచి ధన్యులైరి. వీటియందు కొన్ని కంచు విగ్రహములు, కొన్ని బంగారు విగ్రహములును గలవు.

చాలా సుందరమైన మూడు మహావిగ్రహములు చండిమెండూతునందు గలవు. అనురాధపురమున గాని, భారతదేశమున గుప్తులనాడు కాని యిట్టి యున్నతకళా సంప్రదాయ బద్ధమైన శిల్పసృష్టి లేకపోయెనని ప్రతీతి. బుద్ధభగవానుడు కాశీవనమున మొదట బౌద్ధమతమును ప్రచారము చేయునటుల మధ్యనున్న విగ్రహము కలదు. ప్రతిమ ధర్మచక్రముద్రాంకితము. కాళ్లవద్ద రెండు లేళ్లును, చక్రమును మలచబడియున్నవి. ఇరువైపుల వ్యాళికములు కలవు. ఈ విగ్రహముల సౌందర్యము అవలోకితేశ్వరుని విగ్రహమున (చిత్రము ౧) బాగుగ జూడగలము. హిందూమతావలంబకులకు ప్రియమైన ధ్యాననిమగ్నత, ఆధ్యాత్మిక పరిణామమువలన గలుగు మనఃప్రశాంతి, ప్రపంచము నుద్ధరించవలెనన్న కోరిక బాగుగ నిందు వ్యక్తమగుచున్నవి. వస్త్రము లంగముల సౌందర్యము నధికపరచుటకేగాని మరుగు పరచుటకు కాదను హిందూకళాసంప్రదాయ మీ విగ్రహములందు చూడగలము.

వినాయకుడు బాలుడు; తిండిపోతు. ఎల్లప్పుడు నాహారమును వెదకుచు తిరిగెడి యెలుక యీతని వాహనము. అంతటి బొజ్జ నెటుల యీ చిన్న జంతువు మోయ గలిగెడిదో? అన్నిటికిని మించిన విశేష మీతని యేనుగుతల; అందు నొకదంతము విరిగినది. వేల్పులలో నీతడు దృష్టిదోష పరిహారార్థము సృజింపబడెనా? అందువలననే విఘ్నవినాశకరుడుగ భావింపబడుచున్నాడా? భారతీయు లిట్టి చులకని యర్థము నావేల్పున కాపాదించువారు కారు. ౨వ చిత్రమున వినాయకుడు ధ్యానమున మునిగి యున్నాడు. విఘ్నేశ్వరుడు మానవుని భౌతికలోకజీవనమునకు చిహ్నము; సంఘముయొక్క స్థిరత్వపు వ్యక్తీకరణము. వేదాంతపరమున శివు డాత్మ కాన నాతని కుమారుడగు వినాయకుడు మనస్సు. మహాయాన బౌద్ధమతముతో బాటు జావాయందు తాంత్రిక మతము వ్యాపించియుండుటచే పుణికెల యాసనమున నీ గణనాథుడు ధ్యానమున

గూర్చొనవలసివచ్చెను. భారతీయ చిత్రములకును దీనికిని కొంతభేదము కానవచ్చుచున్నది కాని రచన సుందరముగనే యున్నది.

జావాయందు చతుర్ముఖ బ్రహ్మయొక్క విగ్రహ మొకటి లభించినది. రెండుచేతులతో కమండలములను బట్టుకొని యున్నట్లుగ గలదు. తక్కిన రెండు చేతులును ముందుగ గలవు. చక్కని హంస దిగువభాగమున మలచబడియున్నది. సృష్టికర్తయగు నీవేల్పు ధ్యానవిమగ్నుడై, చూపరులయందు గౌరవము, భక్తి కలుగజేయునట్లుగ గలదు.

ఈ ద్వీపమున అగస్త్యుని విగ్రహము లనేకములు లభించినవి. ఆ కాలమున నచ్చట యీ మునిని శివ గురువనియు, భట్టారక గురువనియు, భటార గురువనియు బూజించుచుండిరి. భారతదేశమున లేని గౌరవ మీ ఋషికీ వలసరాజ్యములం దెటుల గలిగిన దను సంశయమునకు తావుకలదు.

తనసంతతివారి కోరిక లీడేరుటకు భద్రలోకాలయ మను దేవాలయమును అగస్త్యుడు నిర్మించెనని జావాయందలి యొక చక్కని సంస్కృత శాసనమువలన దెలియుచున్నది. ఆతడీద్వీపమునకుబోయి హిందూమతప్రచారమును చేసెనా? అగస్త్య గోత్రజులు కొందరు జావాయందు కాపుర మేర్పరచుకొనిరని కొందరు పండితుల యూహ. దక్షిణ హిందూదేశ మీ ఋషి యొక్క వాసస్థానము. ఈతని శిష్యకోటిని బంపి యాదూరదేశములందు హిందూవిజ్ఞానమును వెదజల్లుటకు తోడ్పడియుండవచ్చును. ఈ యూహయే నిజమైనయెడల నావలస రాజ్యములందలి హిందువు లీతనిని గురువుగ భావించి, పూజించుటయం దాశ్చర్య మేమియు లేదు. తొలుత నీతని రూపమును దారువిగ్రహములుగను, తరువాత శిలావిగ్రహములుగను మలచినటుల పరిశోధన వ్యక్తపరచుచున్నది. అగస్త్యుని హరిశ్చంద్ర ఋషియని కవిభాషయందలి యొక పురాణగ్రంథము పేర్కొనుటచే యీ ఋషియొక్క హరిశ్చంద్ర విగ్రహము లానాడు విశేషముగ నుండినవని తలంపవచ్చును. అగస్త్యుని దేవదారు విగ్రహ మొకటి ప్రాతబడి చెడిపోగా సుప్రసిద్ధులగు శిల్పులను రప్పించి, చిరకాలముండునటుల మరియొక చక్కని విగ్రహమును నల్లరాతితో జేయించి క్రీ.శ. ౭౬౦ లో దీర్ఘదర్శుడని పేరుగన్న గజయానుడను రాజు ప్రతిష్ఠింపజేసెనని తూర్పు జావాయందలి దినయయనుచోట లభించిన శాసనమున గలదు. దక్షిణహిందూదేశమున నీ ఋషి బ్రహ్మవనము నందు నివసించుచుండెనని ప్రతీతి. జావాయందలి పాంబనము [బ్రహ్మవనము] అను పేరుకూడ యీఋషి పొందుచుండిన గౌరవమును సూచించుచున్నది. ఆకాలమున హిందువులు పడవలమీద హిందూమహాసముద్రమును దాటి యంతదూరదేశములకు బోవుటలో ననేకములగు కష్టములపాలగుచుండిరి. అగస్త్యోదయమైన వెంటనే జలము ప్రశాంతమగుటచే నప్పుడు నావికాయానమున కనువైన సమయమగును. ఆద్వీపమునకుబోవు నావికు లీఋషియెడల భక్తితో నుండుట కిదియొక ముఖ్యమైన కారణమైయుండును. నావికులే యీ ఋషిపూజ నాదేశమున బ్రవేశపెట్టుటయు సంభవము. నేడును బలిద్వీపవాసులు అగస్త్యుని సాక్షిగ నొట్టు బెట్టుకొనుచుండురట.

అగస్త్యవిగ్రహము లన్నిటిలోను ఇప్పుడు బటేవియా ప్రదర్శనశాలయందు భద్రపరుపబడిన చండి బాననువిగ్రహము ప్రసిద్ధి బొందినది. (చిత్రము 3) ఇది ౯-వ లేక ౧౦-వ శతాబ్దమునాటిదై యుండును. శివగురు వను పేర నగస్త్యుడు పిలువబడుచుండుటచే నీ విగ్రహము శివునిదని కొందరభిప్రాయపడిరి. జటామకుటము, గడ్డము, కమండలము, అక్షమాల యిరువురకు నుండుటచే యిట్టి పొరపాటున కవకాశము కలిగినది. స్థూలశరీరుడును, లంబోదరుడును అగు శివుని విగ్రహములు లేవు. తక్కిన అగస్త్య విగ్రహములతో సరిపోల్చియు, విగ్రహముల వెనుక చెక్కబడిన పేర్లను బట్టియు నిది ఋషియొక్క విగ్రహమేయని పండితులు నిర్ధారణచేసిరి. ఈ విగ్రహముయొక్క సుందరమైన ముఖములో అచలచిత్తము, జ్ఞానప్రపూర్ణత మొదలైనయుత్తమ లక్షణములు స్పష్టముగ కానవచ్చుచున్నవి.

దేవాలయ ద్వారపాలకులుగ భయంకర రాక్షస ప్రతిమలను జావావారు మలచిరి. వేల్పులముఖములందు

కానవచ్చు లావణ్యము, ఆధ్యాత్మిక చింతకు బదులు మౌర్ఖ్యము, పశుబలము మొదలైన నిమ్నమానసిక చిహ్నములు వీటియందు తాండవమాడుచున్నవి.

విష్ణువుయొక్క వాహనమగు గరుడుని రూపమీ ద్వీపమున వింతగ మారిపోయినది. మనదేశమునం దిప్పుడు వాహనములుగ వాడుకయందున్న గరుడ విగ్రహములు మానవాకారములుగ నుండుసు కాని సూది ముక్కు, రెక్కలు గరుత్మంతుని స్ఫురింపజేయును.

ప్రాంబనశిల్పచిత్రమున నెమ్మదైనయున్న గరుత్మంతునకు వాడియైన ముక్కు కలదు. తూర్పు జావా శిల్పమున నిది పందిమూతివలె పరిణమించినది. కాని యంగములు మోటుగ నుండుటవలనను, ముఖభావము వలనను గరుత్మంతుడు వీరుడనియు, భయంకరుడనియు నీశిల్పమును చూచినవారికి గోచరించును. దిగువనున్న గరుడుని కోపమును, మీదను గూర్చొనియున్న విష్ణువు ప్రశాంతభావమును గలసి యొకేచిత్రమున నుండుటచే భౌతికాధ్యాత్మిక భావముల భేదము బాగుగ వ్యక్తమై చిత్రము చూపరుల నాకర్షింప జాలినదై యున్నది. (చిత్రము ౫) పశుబలము, కోపము క్రిందిమెట్టు ; ఆధ్యాత్మిక చింత, శాంతము పైమెట్టు. మోటుతనము క్రిందిమెట్టు ; సౌందర్యము మీదిమెట్టు. తమోరజోగుణములు క్రిందిమెట్టు; సాత్వికగుణము మీదిమెట్టు. ఇంతచక్కగ నీభావములను మలచిన యాశిల్పి యెవరోకాని ధన్యుడు.

బెలాహనమునందు లభించిన యాగరుడ వాహన విష్ణువుయొక్క ముఖము తూర్పుజావాను పాలించి పేరుగాంచిన అయిర్లంగయను రాజుయొక్క ముఖమై యుండునని పండితుల యభిప్రాయము.

ఇచ్చటి విగ్రహములలో ననేకములు రాజులవో, రాణులవో యైయుండును. రాజు దైవసంభూతుడనియు దేవుడనియు, తపోభంగమువలన నిట్టిజన్మమెత్తెననియు, మహాపుణ్యాత్ముడగుకానియెడల నింతటి యున్నతపదవి నలంకరించుట కలుగదనియు, సకలజీవరాసులను సృష్టికర్త రక్షించునటుల తన ప్రజలను రక్షించుననియు భారతీయుల నమ్మకము. మన సనాతన గ్రంథములలో ననేకములు రాజునకీదైవత్వ మారోపించినవి. కనుక వేల్పుల విగ్రహములందే మానవులైన రాజుల రూపముల నిముడ్చు ఆచార మొకటి పెరిగినది.

మానవుల రూపములను శిలలందును, లోహములతోను మలచుట భారతదేశమునకు క్రొత్తకాదు. అనాదినుండియు మానవప్రతిమానిర్మాణ మాదరణమును బడయుచుండెననుట కనేకములగు నిదర్శనములు మన గ్రంథములందు కానవచ్చుచున్నవి. రాముని శిరస్సు వంటిది చేయించి రాముని జంపితినని రావణుడు సీత యెదుట బెట్టగా నామె నిజమని నమ్మినది. సీతయొక్క ప్రతిమను ఇంద్రజిత్తు యుద్ధభూమియందు నరుకగా మేధావియగు హనుమంతుడును మోసపోయి, సీత వధింపబడిన దని రాముని కెరుకపరచెను. సీత నడవులకు బంపినపిమ్మట నశ్వమేధ యాగముకొరకు రాముడు సీతయొక్క విగ్రహమును చేయించెను. ఈ కథలను నమ్మనివారును ప్రతిమలను సహజముగ నిర్మించుటకు రామాయణము రచింపబడినకాలమునాటికి శిల్పులలవాటుపడియుండిరని యొప్పుకొనక తీరదు. మానవుల ప్రతిమలను నిర్మింపరాదను నిషేధము శుక్రనీతి సారమున నున్నను, ఇట్టిప్రతిమలను మలచుటకు కొలతలు కొన్ని శిల్పశాస్త్రములందు కానవచ్చుచున్నవి. బరుహుతు, సాంచి నిర్మాణములందు రూపశిలాచిత్రముల చిహ్నములు కానవచ్చుచున్నవి. గాంధార శిల్పమునందు ముఖములలో విశేషముగ భేదము కానవచ్చుటచే నవి యన్నియు మానవుల ప్రతిమ లగుట సంభవము. కాని యీ వాదము సరికాదని కొందరి యభిప్రాయము. గ్రీకులు మనదేశమునకు వచ్చిన పిమ్మట హైందవ నాణెములమీద రాజుల రూపముల నొత్తుట యాచారముగ నేర్పడినది. మథురవద్ద కనిష్కుని, మరి యిరువురు రాజుల విగ్రహములు లభించినవి. అశోకుని విగ్రహములనేకము లుండెనని ఐత్సింగు వ్రాసెను. దేవాలయములను గట్టినప్పుడు నిర్మాణకర్తల ప్రతిమల నొక మూల నిలుపుట యాచారముగ నుండినది. రాజుల, రాణుల, ధనికుల విగ్రహములు దక్షిణహిందూదేశమున ననేకములు కానవచ్చుచున్నవి.

రాజు దైవసంభూతుడను నమ్మకమును, మానవుల ప్రతిమలనుచేయు శిల్పాచారమును కలసి వలస

రాజ్యములందు వింతరూపమును దాల్చినవి. చంపా, కాంభోజము, జావాలందు రాజును "దేవరాజ" ను నమ్మకముతో బూజించుచుండిరి. భద్రేశ్వరు డను రా జొక దేవాలయమును గట్టినయెడల దానికి "భద్రేశ్వరాలయ" మను పేరుబెట్టి ఈశ్వరునితోపాటు రాజు కూడ పూజను బొందుచుండెను. రాజులయొక్క ప్రతిమలు విడిగను, కుడ్యశిల్పములో రాజుల రూపచిత్రములను కాంభోజమున విశేషముగ గలవు. రాజు చనిపోయినపిమ్మట నాతని శ్మశానముపై దేవాలయమును గట్టి రాజురూపముతో శివునియొక్కయో, బుద్ధునియొక్కయో, విష్ణువుయొక్కయో ప్రతిమను చేయించి, యందు బూజించుచుండుట జావాయం దాచారమైనది. కనుక నీద్వీపమున గనబడు విగ్రహములను బరిశీలించునప్పు డీ "దేవరాజ మతము" ను జ్ఞాపకముంచుకొనుట మంచిది.

సింఘసారియందు బాలించి క్రీ. శ. ౧౨౬౮ లో చనిపోయిన విష్ణువర్ధనుని విగ్రహములు చండిజాగోయందు లోకేశ్వర అమోఘపాశుడను పేరను, వాలేరియందు శివునిగను బూజింపబడుచుండెను.

సింఘసారి తుదిరాజగు క్రేతానగరు డొకే దేవాలయమున శివుడుగను, బుద్ధుడుగను ఆరాధింపబడుచుండెను. ౧౨౯౨ లో చంపబడిన పిమ్మట నీతడు శివబుద్ధుడుగ బరిగణింపబడెను.

ఈతని యల్లుడగు విజయుడు క్రేతరాజసుడను పేర ౧౨౯౩ లో రాజ్యాధిపత్యమును వహించెను. ఈతనివిగ్రహ మొకటి బటేవియా ప్రదర్శనశాలయందు గలదు. శివుని విధమున నీవిగ్రహము మలచబడి సింపింగు దేవాలయమున ప్రతిష్ఠకాబడినదని గ్రంథములందున్నను, గదా, శంఖములు హస్తముల నలంకరించియుండుటచే విష్ణువిగ్రహమువలె నున్నది. ఈ సమస్యను పరిష్కరించుటకు ఆర్ష శాస్త్రజ్ఞులు దీనిని హరిహర విగ్రహమన్ని పేరుపెట్టిరి. రాజకీయి యీ ప్రతిమయందు బాగుగ మలచబడినది (చిత్రము ౫). కిరీటము, కర్ణాభరణములు, హస్తాభరణములు, కంఠాభరణములు, వస్త్రములందుగల జిలుగు సుందరముగ నున్నవి. ఇరువైపుల పద్మములు, పద్మపత్రములు సహజముగ మలచబడుటచే విగ్రహమునకు నిండును చేకూర్చుచున్నవి. ఇటుల పాత్రలందు పద్మములు మొలచునటుల నుండుట తూర్పుజావా శిల్పమునందు సంప్రదాయమయ్యెను. పాత్ర లీచిత్రమున మరుగుపడియున్నవి. ఇరువైపులనున్న చిన్నస్త్రీ విగ్రహములు క్రేతరాజసప్రభువుయొక్క రాణులనై యుండవచ్చును.

బటేవియా ప్రదర్శనశాలయందు దీనిని పోలిన స్త్రీ విగ్రహ మొకటి కలదు. ఇది పార్వతియని పండితులు నిర్ణయించిరి. హరిహర విగ్రహమును మలచిన శిల్పియే దీనిని మలచియుండును. క్రేతరాజసుని భార్యయగు పరమేశ్వరి త్రిభువని రూపప్రతిమ యిదియగుట సంభవము. ఇరువైపులనున్న పద్మము లీ విగ్రహమునకు వింతయైన సౌందర్యమును చేకూర్చుచున్నవి.

ఇప్పుడు లీడను ప్రదర్శన శాలయందు గల సుందరమైన ప్రజ్ఞాపారమిత విగ్రహము సింఘసారిదగ్గర నున్న యొక యడవియందు లభించినది. మహాయానబౌద్ధమతమునకు జెందిన యీ శిల్పమున నిమిడియున్న యర్థము చూడదగినది. (చిత్రము ౬) దాన, శీల, క్షాంతి, వీర్య, ధ్యాన, ప్రజ్ఞ యని పారమితము లారు. ఉపాయ, ప్రణిధాన, బల, జ్ఞానములు ఉపపారమితములు. అన్నిటికన్నను ప్రాజ్ఞాపారమిత ముత్తమమైనది. "ప్రాజ్ఞ" అనగా ధర్మములేక మతమునకుసంబంధించిన యుత్తమజ్ఞానము. పారమితములను నిష్కల్మషముగ నభ్యసించినయెడల నిర్వాణము లభించుననియు, బుద్ధుని కివి మించినవనియు, ప్రాజ్ఞాపారమితమను గ్రంథమును బుద్ధుడే చెప్పి, భద్రపరుపమని నాగుల కిచ్చెననియు, నాగార్జునుడు దీనిని మరలతెచ్చి లోకమున కర్పించెననియు మహాయాన బౌద్ధమతావలంబకులు చెప్పెదరు. మోక్షమునకు మూల కారణము ప్రాజ్ఞాపారమితము. ఈ దివ్యజ్ఞానమున కొక స్వరూపమునిచ్చి శక్తి, సరస్వతులవలె బూజించుచుండిరి. ఈమెను పూజించు విధానమును తెలుపుటకు సంగు డొక సాధనమును రచించెను. సాధనమాలయందు తొమ్మిది సాధనములు కానవచ్చుచున్నవి. ఇందు రెండు అక్షోభ్యునితో గలిపి పూజచేయుట

ఆవీరుని పట్టుదల, సాహసము, బలము, తనశక్తియందుండిన విశ్వాసము, నీటన్నిటివలన గలుగు ప్రశాంతహృదయమును అద్భుతముగ గనబడుచున్నవి. సైన్యమును విజయమునకు నడిపు వీరుడని యీచిత్రమువలన స్వవ్యక్తమగుచున్నది కళయన్న నిటులుండవలెను! సుందరముగ మలచి యేవో బిల్లరభావములను జూపినంతమాత్రమున నిట్టి యుత్తమశిల్పచిత్రము కాజాలదు.

అలెగ్జాండరుతోవచ్చిన గ్రీకుశిల్పులు గాంధారమున నూతనములైన రుచులను బ్రవేశపెట్టి హిందూరచనకదివరకులేని సౌందర్యమును చేకూర్చిరని కొందరు యూరోపా కళావిమర్శకుల నమ్మకము. కాని ఆధ్యాత్మికసౌందర్యమునే దృష్టిపథమున నుంచుకొనిన యీ భారతీయ శిల్పులకు భౌతికసౌందర్యమునందు లక్ష్యములేకపోయినది. చేతకానివారుమాత్రముకారని జావాయందలి శిల్పచిత్రములు వ్యక్తపరచుచున్నవి. బోధిసత్వుని ప్రతిమ(చిత్రము)యందు నిర్మలమైన యాధ్యాత్మికానందము, ఉన్నత భావావేశము, సముద్రముయొక్క లోతు, నీలాకాశముయొక్క ప్రశాంతము ప్రస్ఫుటితము లగుచున్నవి. కామేచ్ఛ మచ్చునకైనను కానరాదు. వీటన్నిటితో బాటు సాటిలేని సౌందర్యము కలదు. గాంధార శిల్పచిత్రములు దీనియెదుట నిస్సారమైనవిగ గనబడును.

చక్కని కంచువిగ్రహము లనేకములు జావాయందు లభించినవి. కంచుతో విగ్రహములను పోయు విధానమును భారతీయులే యిచ్చట బ్రవేశపెట్టిరి. రాను రాను జావావారు మంచిప్రవేశమును కలుగజేసుకొనుటచే ఇచ్చట తయారైన విగ్రహములు భారతీయవిగ్రహములతో సరితూగగలవైనవి.

శిలతోను, కర్రతోను చేయబడిన ప్రతిమలలో కొన్నిటికి రంగులను వేయుట కలదు. రంగు లిప్పుడు కనబడుటలేదు జావాయందు గోడలమీద నెట్టిచిత్రములను వ్రాయుచుండిరో చెప్పుట కిప్పుడు మచ్చునకైన నొక చిత్రము కానరాలేదు. కొన్ని సనాతనగ్రంథములందు మాత్రము చిత్రములు కలవు. మధ్యజావాయందు లభించిన తామ్రశాసనమున నొక చిత్తరువు చెక్కబడియున్నది. ఇది అజంతశైలియందుండుటచే నిచ్చటి చిత్తరువులన్నియు నీతరగతికి జెందినవని యూహింపవలసియున్నది.

జావాయందు బట్టలకు రంగులనువేయువిధ మొకటి కలదు. మైనముతో వస్త్రముయొక్క కొన్నిభాగములను కప్పి రంగునందు ముంచెదరు. మైనములేనిచోటునే రంగంటుకొనును. దీని నతికి మరల మైనముతో మరియొక విధమున గప్పి వేరురంగునందు ముంచెదరు. ఇటుల చేయుటవలన వస్త్రమున వింతయైన చిత్రము లేర్పడును. ఈవిధానమునకు బతిక్క అనెదరు. ఇటుల పంచె (కెయిను పంజంగ), పయ్యెట (కెయిను స్లెండంగ), తలగుడ్డ (కెయిను కపాల)లను చేసి అమ్ముచుందురు. నటకులవేషములకొరకిటుల చిత్రితములైన వస్త్రములను సువర్ణచ్ఛాయను సుందరముగ నద్దుటకలదు. మధ్యజావాయందు కాషాయ, నీలిమలనే వాడుచుండిరికాని తక్కిన ప్రదేశములందు ఎరుపు, ఆకుపచ్చలు కూడ వినియోగమునకు వచ్చుచుండినవి.

“ఇకతు” అనువిధమున పట్టు, నూది వస్త్రములకు రంగువేయుటయందు జావాపనివాండ్రు సుప్రసిద్ధులు. ప్రతిదారమునకును కొంతలప్రకారము వేరువేరు రంగులనువేసి తరువాత నేసెదరు. వారి యుద్దేశముల ప్రకారము నేయుచున్నప్పుడా రంగులకూడికవలన చిత్రము లేర్పడుచుండును. ఈకష్టమైన విధానమును సాధించినందుల కాదేశీయు లభినందనార్హులు.

నాట్యమునందును జావావారు కొన్నిమార్పులతో భారతదేశీయుల ననుకరించిరి. చిత్ర, శిల్పవిద్యలందు ప్రవేశము కలుగజేసుకొనవలెనన్న నాట్యకళ తెలిసియుండవలెనని మన సనాతనశాస్త్రములందు గలదు. హిందూరాజ్యమైయుండినట్టియు, హిందూవిజ్ఞానమును పూర్తిగ నామోదించినట్టియు జావాయందు భరతనాట్యకళ నేటికి నభ్యాసమున నుండుట సహజము.

వయాంగు బెబెను, వయాంగు పుర్వ, వయాంగు గెడాగు, వయాంగు క్లిటెక్క అని తోలుబొమ్మలాటలు నాలుగు విధములు. ఇవి హిందూపురాణకథలతో ప్రారం

కుపకరించును. ధ్యానబుద్ధునినుండి యీమె పుట్టి కురుకుల్ల, సితతార, వజ్రతార లనబరగినది. ఈ రూపమున నీమె సువర్ణచ్ఛాయ గలదనియు, ఐదుగురు ధ్యానబుద్ధుల విగ్రహములు కిరీటమున నుండుననియు, హస్తములు ధర్మచక్రముద్రయం దుండుననియు, బాహుమూలములం దుండు పద్మములపై ప్రాజ్ఞాపారమిత గ్రంథము లుండుననియు గలదు. ఇట్టి విగ్రహమొకటి ఇండియను ప్రదర్శన శాలయందు గలదు. అక్షోభ్యునినుండి పుట్టిన పదునొండు దేవతలలో ప్రాజ్ఞాపారమిత యొకతె. ఈమె సితప్రాజ్ఞాపారమిత యనియు, పీత ప్రాజ్ఞాపారమిత యనియు రెండు విధముల బరగుచున్నది. పీతప్రాజ్ఞాపారమిత వజ్రపర్యంకాసనమున పద్మముపై గూర్చొనియున్నటులను, హస్తములు వ్యాఖ్యానముద్రయం దుండునటులను, ఎడమచేతి వద్దనున్న పద్మమునందు ప్రాజ్ఞాపారమిత గ్రంథ ముండునటులను మలచవలెనని కలదు. ఆ చిత్రమున నీ చిహ్నములన్నియు గలవు.

యోగినివలె ధ్యానమునను, దైవసంభూతురాలని తెలియజేయుటకు పద్మమునను శిల్పి లీమెను గూర్చొనబెట్టిరి. ఆ దివ్యసౌందర్యము, కిరీటాద్యాభరణముల తీరు, పద్మముయొక్క సహజరచన మనోహరముగ నున్నవి. ఎంతటిప్రతికూలురైన నీ విగ్రహరాజమును చూచినపిమ్మట భారతీయ శిల్పకళయొక్క గొప్పదనమును స్వీకరింపకతీరదని కొందరి యభిప్రాయము. పైకి సుందరముగనున్నను, హిందూదేశపు ఉత్తమకళా సంప్రదాయములకు సరిపోవుటలేదని కుమారస్వామి, గంగులీగార్ల యభిప్రాయము. హేవెలు మొదట చూపిన యుత్సాహమును తరువాత చూపలేదు.

జావాయందు కెన్ఆరోక్ అనుపేర విష్ణువు అవతారమెత్తెనని యొక బ్రాహ్మణునకు తెలియగా నాతడు హిందూదేశమునుండి జావాకు వెళ్లి కెన్ఆరోక్ వద్ద సేవకునిగ బ్రవేశించి యాతనిని కెదిరిరాజుల యాస్థానమున బ్రవేశపెట్టెను. కెదిరిరాజకుమారుని భార్యయగు డెడిసు నీతడు (కెన్ఆరోక్) మోహించి, తుదకు రాజు నొక బాకుతోజంపి తానే సింఘసారి రాజై (౧౨౨౦) రాజససంఘ అమర్వభూమియను బిరుదమును ధరించి, డెడిసును వివాహమాడి, ౧౨౨౭ లో దుర్మరణముపాలయ్యెను. ఈ డెడిసురాణియే ప్రజ్ఞాపారమిత విగ్రహముగ మలచబడెనట. కథవలన నీ విగ్రహము క్రీ. శ. ౧౨౨౦–౨౭ నాటిదని తెలియుచున్నది.

చండిలోరో జొంగ్రాంగును కట్టుటకు కారణమైన రాజకుమారిక రూపమును మహిషాసురమర్దని విగ్రహముగ మలచిరి. శుక్రవారమునాడు దగ్గరనే సంతకూడునప్పుడు విగ్రహము నలంకరించెదరు. జావా ప్రజలు, చైనావారు, జాతిభ్రష్టులు, మహమ్మదీయులు, ఐరోపావారును ధూపమును, ప్రసాదమును అర్పించి మొక్కుబడులను తీర్చుకొనుచుందురట! ఇటుల పూజను బడయకపోయినను దుర్గయొక్క విగ్రహములు జావాయందచ్చటచ్చట నున్నవి.

లీడను ప్రదర్శనశాలయందు గలమహిషాసురమర్దని విగ్రహము (చిత్రము ౬) ప్రసిద్ధిబడసినది. రచనయందును, భావమునందును అదిచాలసుందరముగ నున్నది. శుద్ధశక్తి యధర్మమును 'నాశనముచేయుటకు వెడలినప్పు డడ్డువారు లేరు. ఆముఖమున "శక్తి" తాండవమాడుచున్నది. మూడు లోకములను సృజించి, నాశనముచేయగల మహాశక్తికి మహిషాసురుడనగా నెంత? ఇంతటి యల్పకార్యమునకు భయంకరాకారమును, కోపమును పొందవలెనా? సూర్యుని యెదుట పొగమంచు మాయమగునటుల పాపము మాయమగుట కామె యోగనిద్రనుండి మేల్కొనిన జాలును. ఈశిల్పచిత్ర మీభావములను బాగుగ వ్యక్తపరచుచున్నది.

భారతీయ (జావా)శిల్పులు రూపప్రతిమలను మలచుటయం దతిప్రవీణులు. కాని కోపము, అసూయ, ఈర్ష్య మొదలగు భావములను తమసృష్టియందు చూపుట వీరి కళాతత్త్వమున లేదు. ప్రతినరమును, స్నాయువును బ్రదర్శించుట నిజమగు కళయొక్క యుపయోగము నధికపరుపజాలదు. ముఖమున వ్యక్తియొక్క ప్రయోజనము వ్యక్తమైన జాలును. భీమునియొక్క యీ రూపశిల్పమునందు (చిత్రము ౭) వివరములు విశేషముగ లేకపోయినను క్రిందిదవుడయొక్క విశాలతయందును, పెదవుల బిగింపునందును, కండ్లు దూరముగనుండుటయందును

భమై మజపహిత్తు రాజులతో నంతమగును. కాళ్లు చేతులు కదలునటుల తోలును బొమ్మలుగా కత్తరించి తెరలపై నాడించెదరు. తమపూర్వుల చరిత్రల నీయాటలు ప్రదర్శించును కనుక వీటియందు జావావారి కిప్పటికిని గౌరవము మెండు.

చిన్నబొమ్మలనుచేసి యాడించుటకు వయంగ గొలెకు అనిపేరు.

వివిధములగు ముఖచిత్రములను ముఖములకు తగుల్చుకొని నాట్యముచేయుటకు వయంగ టొపెంగ అందురు. సాధారణముగ వేషములనువేసుకొని యాడుటకు వయంగవాంగ అందురు. పరిసరములను, రంగాలంకారములను చూపుట కెట్టియనుకరణములును వాడుకలో లేకపోయినను, నటులు వారిపాత్రలకు తగిన దుస్తులను ధరింతురు. కథాభాగము పూర్వచరిత్రమై యుండును. హస్తముద్రలందున, అభినయమునందును పూర్వుల నాగరికత కండ్లయెదుట గట్టినటు లుండును. కొన్ని యుత్సవసమయములం దాడుటకు వందలకొలది నటులు మాసములకొలది యభ్యాసముచేయుదురు. ఇందుకు ధనికులు విశేషముగ పైకమును వెచ్చించుచుందురు. యోగ్యకర్త, సురకర్తయను దర్బారులందీ నాటకముల కొరకు కొందరు నటులను వేతనములనిచ్చి పోషించుచుందురు. రాజకుటుంబములవారును వేషములను ధరించుట యాచారమైనది. వైజ్ఞానికముగ నీనాట్యములమూల్యములై యున్నవి.

నాటకములందు కాక ప్రత్యేకముగ నాట్యము చేయుటయందును జావావారు పేరుగాంచిరి. వీరి భావాభినయము చాలసుందరముగ నుండును. పండగలందు స్త్రీలు నాట్యము చేయుదురు. భావప్రదర్శనము లేకనే యామోదమును చేకూర్చుటకు ప్రత్యేక నాట్యముకలదు. ఈనాట్యవిధానములన్నియు భారతీయనాట్యకళానుకరణములని చూచి వారు నిర్ధారణచేసిరి.

జావాదేశీయులు మొదలు హిందూసంగీతము నభ్యసించిరి కాని యాకళ రానురాను మార్పుచెంది వింత మార్గమును త్రొక్కినది. ఇప్పటిది హిందువులును, ఐరోపావారును విని హర్షించువిధమున పెరిగి పేరుగాంచియున్నది.

పదునైదవ శతాబ్దమునుండియు పరిస్థితులు మారిపోవుటచే హిందూవిజ్ఞానము పెరుగుట కవకాశములు లేకపోయినవి. అనేకశతాబ్దములనుండి వ్యాపించిన యాచారము లింకను కనబడుచున్నవి కాని హిందూదేశముతో సంపర్కము వీడిపోవుటచే మిగిలియున్న యీచిహ్నములును త్వరలో మాయమగుచున్నవి.

ఈవలసరాజ్యములందు నిట్టి మహాకార్యములను జేయజాలు పుత్రులను గనిన భారతమాత ధన్యురాలు. తన యసమానసౌందర్యమువలనను, అలంకారములవలనను ప్రపంచమున జ్యోతివలె వెలిగినది; చూచుటకు నయనము లున్నవారి కిప్పుడు నాసుందరరూపము కానవచ్చును. అట్టి యర్హతబొందు ప్రయత్నముమాత్రము చాలదు. ఆదేశములకు తొలుత వెళ్లినవారిలో ఆంధ్రులు ముఖ్యులు. కాని తమ పూర్వపు టౌన్నత్యమునైన వీరు స్మరింపకుండుట శోచనీయము.

ఈ వ్యాసావళిని వ్రాయుటయందు నాకు తోడ్పడిన గ్రంథములు :


A. K. Coomaraswamy:
History of Indian & Indonesian Art.

E B Havell:
Indian Sculpture & Painting.
Ideals of Indian Art.

T. N. Ramachandran:
Articles on Javanese Art in "Triveni"

James Fergusson.
History of Indian & Eastern Architecture.

R. C Muzumdar:
Indian Colonies in the Far East
Champa,

O C Gangoly
The Art of Java.

J. Ph Vogel
The Relation between the Art of India & Java

Phanindra Bose
The Indian Colony of Siam,

Hermester
The Symbolism of Borobudur (The Theosophist)

Robert J Casey
Four Faces of Siva (National Geographical Magazine)

వ్యాసములందలి చిత్రములు గ్రంథములనుండి తీసికొనబడినవి.

---



చేపలు పట్టుట — S.S S.

## పరరాజ్యములందలి భారతీయ శిల్పకళ చిత్రములు





౮. భీమునితలలు



౯. బోధిసత్త్వుడు - జావా

అకే శ్రీ మారేమండ రామారావుగారు ఆంధ్రదేశీయేతిహాస పరిశోధకమండలిపత్రికయందు ప్రకటించియున్నారు. అట్లే ఈగ్రంథమునందలి కాకతీయశాసనములు కొన్ని ఆపత్రికయందును, కొన్ని సుజాత, ఆంధ్రపత్రిక ఉగాదిసంచికలలోను ప్రకటితములయియుండుటచేత తమ క్రొత్తదనమును గోలుపోయినవనవచ్చును. అయినను అవి యన్నియు నీగ్రంథమున మఱికొన్ని క్రొత్తశాసనములతో గలసి యొక్కచోట దొరకుటయే ఈగ్రంథమునకు విలువ.

ఇందు ప్రకటితమయిన ఏశాసనమునకుగాని ప్రకాశనలు ప్రతిబింబముల నొసగియుండలేదు. అందువలన నిందిచ్చిన శాసనపాఠములు నిర్దుష్టములయినవియు, కానివియు దెలిసికొనుట కష్టము. ఈగ్రంథమున ప్రకటింపబడిన ముఖ్యశాసనములలో నూనూరుశాసనము (కాకతీయశాసనములు, సంఖ్య ౫౫) ఒకటి దీని నిదివఱకే రామారావుగారు ఆంధ్రదేశీయేతిహాసపరిశోధకమండలి పత్రికయందు పరామర్శించియున్నారు. శేషాద్రిరమణకవులు ఆంధ్రపత్రిక ప్రజోత్పత్తి ఉగాదిసంచికలో 'కాకతీయరాజు'లను వ్యాసమున ప్రకటించియున్నారు. ఈశాసనాధారమున కొన్ని క్రొత్తసిద్ధాంతములుకూడ వచ్చినవి. ఇటువంటి ముఖ్యశాసనములకయినను మండలివారు చక్కని ప్రతిబింబముల నిచ్చియుండవలసినది.

ప్రకటితమయిన శాసన పాఠముల నిపుడున్న విధమున యథారూపముగ గ్రహించుట కొంకింత సంశయింపవలసి వచ్చుచున్నది; ఏలన, ఈగ్రంథమున ప్రకటితములయిన వరంగల్లు శాసనములలో గొన్నింటిని గవర్నమెంటు శాసనశాఖవారుకూడ సంపాదించి దక్షిణహిందూదేశ శాసనసంపుటములు ౪-వ సంపుటమున (చూడుడు, ౪౨౯, ౪౩౦, ౪౩౮ సంఖ్యలుగల శాసనములు) ప్రకటించియున్నారు. వాటి ననుసరించి చూచినచో ఈగ్రంథమున ౫౧, ౫౨ సంఖ్యాంకితములుగ నిచ్చిన రెండు విడిశాసనములును నిజమున నొక్కటే యని భావింపవలసి వచ్చుచున్నది. ఇది శాసనశాఖవారి ౧౯౦౨-వ సంవత్సరపు ౧౦౪-వ సంఖ్య శాసనము. ఇది ద. హిం. శా., ౪-వ సంపుటమున ౪౩౦-వ శాసనముగ ప్రకటితమయినది. దీనినిబట్టి చూడగా, ఈగ్రంథమున నిజముగా ఒక్కటిగ చేరియుండవలసిన శాసనములు వేఱువేఱు శాసనములుగ విడదీయబడినవేమో యనియు, విడివిడిగా నుండవలసిన రెండు వేఱువేఱు శాసనములు ఒక్కటిగ జూపబడినవేమో యనియు అపోహమున కవకాశము కలుగుచున్నది. ఈయపోహము బలమగుటకు క్రిందివి మరికొన్ని కారణములు.

కాకతీయ శాసనములు ౬-వ సంఖ్యగల కొండిపర్తి శాసనమున దక్షిణపు వైపు భాగము కడపటి పంక్తులు శార్దూలవృత్తమున నున్నవి. ౫౮-వ పంక్తిలో కడపటిపాదము ముగియనేలేదు. తరువాత నిచ్చినతూర్పు దిశగల శాసనభాగము వేఱొకవృత్తముతో నారంభమగుచున్నది. ఇచ్చట కొన్ని పంక్తులు పోయినట్లు తలంచుటకు చుక్కల గుర్తులుకూడ లేవు. ఈ శాసనముననే ఉత్తరభాగమున ౨౨-వ పంక్తితో ఒక శాసనము పూర్తియై, వేఱొకశాసనము 'నమస్తుంగశిరశ్చుంబి' అనుశ్లోకముతో నారంభమగుచున్నది. కాని శాసన పరిష్కర్తలు అంతకుపూర్వపు శాసనమును దీనిని ఒక్క శాసనముగనే చూపినారు. ౫౧, ౫౨ సంఖ్యలు గల కాకతీయశాసనములు రెండు వేఱువేఱుశాసనములుగ నీగ్రంథమున జూపబడినను ఆ రెండును గలసి యొక్కటే శాసనమని పైనే తెలుపబడినది. బూదపురము శాసనము (కాకతీయ శాసనములు ౨౦-వ సంఖ్య) ఉత్తరపు వైపుభాగము ౨౨-వ పంక్తి 'రాజసమాజజ' తో నంతమగును; తరువాత నిచ్చిన పశ్చిమపువైపుభాగమున మొదటిపంక్తి 'శ్రీశకవరుషంబు' లతో ఆరంభమగును. ఇట్లుత్తరపువైపు శాసనము భాగమునకును, పడమటివైపు శాసనభాగమునకును నేమియు సంబంధము లేదు. అది యట్లుండగా ఉత్తరమువైపున నారంభమయినట్లు చూపబడిన శాసనము పశ్చిమపువైపున నింకను పూర్తికాలేదు. తరువాత నిచ్చిన దక్షిణమువైపు శాసనశేషభాగము శాసనారంభమున నేవక్కణకలనో ఆవక్కణతోనే మరల నారంభమగుచున్నది. బూదపురమునందలిదే యగు మఱియొక శాసనముగ జూపబడినదానిలో (కాకతీయశాసనములు, సంఖ్య ౨౧) ఉత్తరమువైపు శాసన

భాగమున ౩౪-వ పంక్తియందు శార్దూలవృత్త మారంభమయి ౩౫-వ పంక్తితో అసమగ్రముగ నిలిచిపోవును; తరువాత నిచ్చిన దక్షిణముప్రక్క శాసన భాగమున మొదటి పంక్తి పై శార్దూలవృత్తమునకు సంబంధింపని "గుండయ దండనాయకః॥" అను నొకవృత్తశకలముతో నారంభమగుచున్నది! ఈవృత్తశకలము తరువాత నారంభమగు వృత్తమునకుగూడ సంబంధించినదికాదు!! ఈదక్షిణపు వైపుభాగముననే శాసనము మొదటి ౧౧ పంక్తులవఱకు సంస్కృతభాషను గలదు. ౧౦-వ పంక్తి కడపటిపదము 'వాతాశ', తరువాతిపంక్తికి ౧౨-వ సంఖ్య వేయబడినను ఆరెండుపంక్తులకు నడుమ నేకారణముననో చుక్కలు చూపబడినవి. తరువాతిది ౧౨ - వ పంక్తి యగునప్పుడీచుక్క లెందులకు రావలసివచ్చెనో తెలియదు. పై నుడివినట్లు ౧౧-వ పంక్తి కడవఱకు సంస్కృతము, ౧౨-వ పంక్తి యారంభముననుండి పైదాని కేమాత్రమును సంబంధింపని తెలుగు! పాఠకులకు సుబోధమగుట కా రెండుపంక్తులను ఈదిగువ నుల్లేఖించుచున్నాను.

౧౧. లావణ్యకాకకర్ణశచామరేన కలితా వాతాశ

* * *

౧౨. * ందుండును సంకిసపురాధినాథ *

ఇట్లే కొలనుపాకశాసనము (కాకతీయ శాసనములు, సంఖ్య ౩౯) మొదటివైపునకును, రెండవవైపునకును, మూడవవైపునకును అతుకు కలియదు. అచ్చట కొన్ని పంక్తులు పోయియుండు ననుకొందమన్న నచ్చట చుక్కల గుర్తులు లేవు. పమ్మిశాసనము (కాకతీయ శాసనములు సంఖ్య ౩౧) "స్వస్తిశ్రీశకవత్సరములు ౧౧౫౬ అగు దుర్ముఖిసంవత్సర వైశాఖ శుద్ధ ౧౧ గు। స్వస్తి శ్రీమన్మహామండలేశ్వర కాకతీయగణం రుద్ర (దే)వ మహారాజులతో నారంభమయి నాలుగవవైపు "౧౨. ముదుంబ నరసింహ

౧౩. చార్లు

౧౪. ముదుంబ నరసింహ్వా

౧౫. చార్లు శోభకృతు

౧౬. చై. శు ౧౪

౧౭. ౧౭౩౬"

తో పూర్తియగును! ఇట్టి విశేషములు ఇంకను గలవు.

సాధారణముగ శాసనములను జెక్కినవార లింతయసందర్భముగ జెక్కియుండరు. ప్రకటితములయినశాసనములలో గొన్ని శబ్దార్థాలంకారములతోను, కవితావిశేషములతోను అలరారు చక్కని కావ్యములే. అట్టివి తెలుగునను గలవు; సంస్కృతమునను గలవు. అట్టి చక్కనికావ్యములను శాసనలేఖకుడు సందర్భశుద్ధి చెరచి అసంబద్ధముగ జెక్కియుండునని నేను విశ్వసింపలేను. పైగా శాసనలేఖనమున కొకపద్ధతి, ఒకమతలబు నున్నది. వక్కణ ఎచ్చటబట్టిన నచట రాదు. కావ్యమున నాశ్వాసాంతపద్యము లెట్టివో శాసనమున వ్యాసగీతాదిశ్లోకములట్టివి. అవి శాసనము కడపటనేకాని మధ్యకాని, మొదటకాని రావు. ఇట్టినియమములు కొన్ని యున్నవి. ప్రకటితములయిన శాసనములు గొన్నిట నిట్టి నియమములకు భంగముకలిగినట్లు చూపట్టుచున్నదన్న నది శాసనలేఖకుల దోషముకాదు; తీసిన శాసనప్రతిబింబములు 'ఏప్రక్క తరువాత నేప్రక్క శాసనభాగము రావలెనో' చూచి సరిగా గుర్తులు వేసుకొని చక్కజేసికొనకపోయినందువలన కలిగిన యనర్థకము కాని యితరముకాదు. ఈశాసనము లిట్లే యున్నవని ఋజువయినచో శాసనలేఖనమున నిది యొక విచిత్రపద్ధతిగ తలంపవలసియుండును.

శాసనభాగము లిట్లు తబ్బిబ్బులే కానిచో శాసనపాఠము లింత యకటావికటముగను, అన్వయగుప్తములుగను ఉండునవి కావు. ఇట్లు తబ్బిబ్బుగపడిన శాసనభాగములును, అన్వయరహితములుగ నున్న శాసన పాఠములునుగల యీగ్రంథమున కెంతవరకు ప్రామాణికత కలదో వేఱ చెప్పనక్కరలేదు. తప్పు మండెలివారిది కాదు. శాసన పరిష్కర్తలది.

శాసనభాగ సంయోజనమునందలి దోషముల నటులుండనిచ్చి ఇక శాసన పాఠములను బరిశీలింతము. ప్రతిబింబములు లేని కారణమున ఈపాఠములు సరియైనవగునో కాదో తెలిసికొనుటకు వీలులేదని యిదివఱకే తెలుపబడినది. అయినను మండెలివారు సంపాదించి ఈ

# తెలంగాణాశాసనములు*

కడచిన శతాబ్దిచివరభాగమున కజిన్సుదొరగారు నిజాంరాష్ట్రమునందంతట పర్యటనముచేసి యారాష్ట్రమునందు గల పురాతన వస్తుపరిశిష్టములనుగురించి ఒక నివేదిక తయారుచేసినారు. దానిని ఇండియాగౌర్నమెంటుపురాతత్త్వశాఖవారు 'లిస్ట్సు ఆఫ్ ఆంటిక్వేరియన్ రిమెయిన్స్ ఇన్ ది నైజామ్స్ డొమినియన్స్' అను పేరుతో ఒక చిన్న గ్రంథముగా ప్రకటించినారు. నిజాంరాజ్యమునందలి పురాతననిర్మాణావశేషములను దెలుపుటయే ఆగ్రంథమునుద్దేశముకాని శాసనములున్నస్థలములనుగురించి చెప్పుటకాదు. అయినను ఆయాస్థలములయందు గల శాసనములను- వివరములేమియు నీయకుండ-దిఙ్మాత్రముగ సూచించును. ఈకారణమున నీగ్రంథము పరిమితప్రయోజనముగలదిమాత్రమే యైనది. నిజాంరాష్ట్రమునందలి శాసనసామగ్రి చరిత్రకారునికి అజ్ఞాతమును, అలభ్యము నయినది.

నిజాంగవర్నమెంటువారు పురాతత్త్వశాఖ నొకదానిని స్థాపించి రమారమి ఇరువదిసంవత్సరములకుపైగ పనిచేయుచున్నప్పటికి స్థితిగతు లేవియు మారలేదు. వారు హైదరాబాదు పురాతత్త్వశాఖాప్రకటనములను పేర కొన్నికొన్ని హిందూయుగమునాటి శాసనములను ప్రకటించుచువచ్చినను ఆరాజ్యమునందు గల శాసనసంపదలో ప్రకటితమయినది శతసహస్రాంశమును లేదనుట యతిశయోక్తి కాదు.

ఇట్టి సందర్భములలో నిజాంరాజ్యమునందలి హైదరాబాదు ఆంధ్రసభవారు ఆరాజ్యమున పగభాగమాక్రమించిన తెలంగాణమునందలి చారిత్రకసామగ్రిని సేకరించి, ప్రకటించుటకు పూనుకొనుట ప్రశంసాపాత్రమయిన విషయము. వారు తమ పర్యవేక్షక్రింద నీపరిశోధనకార్యమును నడపునిమిత్తము ౧౯౨౨-౨౩ సంవత్సరమున నొకసంఘమును స్థాపించిరి. దానికి మొదటినుండియు ఈపరిశోధనమునకు సంబంధించిన కార్యమును నిర్వహించుటయందు 'అమూల్యములగు సలహాల నొసంగిన స్వర్గీయ శ్రీ కొమఱ్ఱాజు వేంకట లక్ష్మణరావు పంతులుగారి జ్ఞాపకార్థముగను, వారియెడ కృతజ్ఞతాసూచకముగను' 'లక్ష్మణరాయపరిశోధకమండలి' యని పేరుపెట్టుట చాల యుక్తముగ నున్నది. కాని మండలివారి కార్యము గ్రంథరూపమును దాల్చకమునుపే శ్రీ లక్ష్మణరావుపంతులుగారు దివంగతులగుట విచారకరమయిన విషయము.

తలపెట్టిన కార్యమును నిర్వహింప మండలివారు వెంటనే పూనుకొనిరి. ఈకార్యనిర్వహణమునకై ఆంధ్రదేశచరిత్రమునందు, అందు ముఖ్యముగ కాకతీయేతిహాసమునందు అకుంఠితాభిమానముగల శ్రీ శేషాద్రిరమణకవులు మండలివారికి లభించుట భాగ్యవిశేషము. శ్రీ శేషాద్రిరమణకవులు తమకు వీలున్నయపుడెల్ల తెలంగాణాయందలి కొన్నిమండలములలో పర్యటనము కావించి, కొన్ని ప్రాచీనతాళపత్రగ్రంథములను సేకరించి, కొన్ని శిలాశాసనములకు ప్రతిబింబములు తీసి పట్టుదలతో పనిచేసియున్నారు. వారు కావించిన సంతతకృషిఫలమే ఈ 'తెలంగాణాశాసనము'లను గ్రంథము. ఇది లక్ష్మణరాయ పరిశోధకమండలివారి ప్రథమప్రచురణము. చరిత్రకు ముఖ్యమయిన యిట్టిగ్రంథము ప్రకటనమగుటకు కారణభూతు లయినవారి కందఱకును, అందు ముఖ్యముగ నీసంపుటమున కగు ముద్రణాదివ్యయములను భరించి తోడ్పడిన యుదారులు శ్రీ శ్రీ మునగాల జమీందారువారికిని ఆంధ్రులు కృతజ్ఞతానిబద్ధులై యుండగలరు.

ఈసంపుటమున ప్రకటితములయిన శాసనములు ౧౨౩. వీనిలో ౫౭ కాకతీయులకును, ౪౨ చాళుక్యులకును, ౨౪ తదితరవంశములకును సంబంధించినవి. ఈ ౧౨౩ శాసనములలో ౧౨ శాసనములను శేషాద్రిరమణ

* ప్రకాశకులు : శ్రీలక్ష్మణరాయపరిశోధకమండలి, హైదరాబాదు, దక్కను; క్రౌనుసైజు, అష్టపో ౨౧౫ పుటలు, వెల; పూర్తికాలికో బయిండు రు ౪-౦-౦ లు; లింపు బయిండు రు. ౨. ౮. ౦.

13 3- . 13 3

కవులును, ౪౦ శాసనములకు మారేమండ రామారావు గారును, ౧ శాసనమునకు భావరాజు వేంకటకృష్ణరావు గారును పాఠములు వ్రాసినట్లు ప్రకాశకులు తెలుపుచున్నారు. ఈ సందర్భమున మారేమండ రామారావు గారు ఆంధ్రదేశేతిహాసపరిశోధకమండలివారి పత్రిక ౭-వ సంపుటము, ౨-వ సంచికలో నిజాంరాజ్యము నందలి కాకతీయశాసనముల పట్టికను ప్రకటించునప్పుడు వ్రాసిన యీ క్రిందిపంక్తులు గమనింపదగినవి.

"The inscriptions tabulated below have been collected by Messrs Seshadriramanakavulu, the pioneer scholars of Telingana, for the Lakshmanaraya Parisodhaka Mandali of Hyderabad Some of the inscriptions were deciphered by the poets (and published in the Sujata, now extinct) and some by me, in the year 1931 Subsequently, I edited the whole lot in a volume. Since this Volume happens to be with -held from publication for some reasons I am publishing summaries of the Kakatiya inscriptions for the benefit of the scholars."

రామారావుగారు 'ఎడిట్' చేసినట్లు చెప్పు సంపుటము విమర్శయందున్న ఈగ్రంథమో వేఱొకటో తెలియరాదు. అదియు, నిదియు నొక్కటే యైన యెడల రామారావుగారు ఈశాసనములనన్నిటిని తామే 'ఎడిట్' చేసినట్లు చెప్పుటయు, మండలిప్రకాశకులు ౪౦ శాసనములకుమాత్రమే రామారావుగారు పాఠపరిష్కరణము చేసినట్లు వ్రాయుటయు ఏల కలిగెనో తెలియదు.

ఇంగ్లీషున సర్ వేపా రామేశంపంతులవారి గ్రంథమునకు తొలిమాటయు, నిజాంకళాశాలయందలి చరిత్రాధ్యాపకులు యస్. హనుమంతరావుగారు భూమికయు, పరిశోధకమండలి గౌరవకార్యదర్శియగు ఆదిరాజు వీరభద్రరావుగారు తెలుగున పీఠికయు వ్రాసినారు. ఇన్నిటికి దోడుగ, ప్రకటితములయిన ఈశాసనములవలన దెలియవచ్చు ముఖ్యవిషయము లెవ్వియో, వాటివలన చరిత్ర కెట్టిప్రయోజనము కలుగుచున్నదో, వాటివలన విడిపోవు ప్రాతసమస్య లెవ్వియో, క్రొత్తగ కలుగు సమస్య లెవ్వియో తెలుపుచు ఒక చారిత్రక పీఠికకూడ నుండినయెడల ఈగ్రంథమువిలువ మరింత హెచ్చియుండెడిది.

ఈగ్రంథమున ప్రకటితములయిన శాసనములను నల్గొండ (౧౧ గ్రామములు), వరంగలు (౧౦ గ్రామములు), మహబూబునగరు (౭ గ్రామములు), మెదకు (౫ గ్రామములు), కరీంనగరు (3 గ్రామములు), రాయచూరు (౧ గ్రామము) జిల్లాలనుండి సంపాదించినారు. ఈవిషయమునుబట్టియే శాసనసంపాదకుల పర్యటనము చక్కగ నిర్ణీతమయిన ఒక పథకమునుబట్టి జరగియుండలేదనియు, శాసనాన్వేషణ సంపాదనములు ఒక క్రమపద్ధతినిబట్టి నడవలేదనియు విదితమగుచున్నది. ప్రభుత్వశాసన శాఖవారి పర్యటనములే తెలుచుగ ఒక క్రమపద్ధతికి లోబడనప్పుడు మండలి శాసనసంపాదకుల పర్యటనవిధానము గురించి తర్కింప నవసరములేదు. శ్రీ శేషాద్రిరమణకవుల కుండు తీరిక ననుసరించియు, రాకపోకల, బాటల సౌకర్యముల ననుసరించియు పర్యటనకార్యక్రమము నిర్ణీతమగుట యుక్తమే; అయినను ఆ యున్న కొద్దియవకాశములందే చేసిన పనిని ఒక క్రమపద్ధతి ననుసరించి జిల్లావారిగ జరపినయెడల ఇంతకంటె నుపయోగముగను, బాగుగ నుండెడిది.

ఈగ్రంథము నేయే గ్రామమునందలి శాసనము లేయేపుటలలో గలవో తెలుపు విషయసూచికయేకాక, తరగతివారీగ ఆయాశాసనవిషయములను సంక్షేపముగ దెలియజేయు 'శాసనవివరములు' ను, గౌర్నమెంటు శాసనశాఖవార్షికనివేదికలలోవలె ఇంగ్లీషున శాసనము న్నస్థలము, రాజుపేరు, శాసనకాలము, భాష, వివరములను దెలుపు ఒక షెడ్యూలునుకూడ గలవు. ఇంగ్లీషున నున్న షెడ్యూలు ఆంధ్రేతరచరిత్రపరిశోధకులకు చాల సహకారి. అయితే, మండలివారి యనుమతి యున్నదో లేదో తెలియదు కాని ఇటువంటి షెడ్యూలు నిదివ

గ్రంథమున బ్రకటించిన శాసనములే కొన్ని దక్షిణ హిందూదేశ సంపుటములను గ్రంథము ౩-వ సంపుటమున ప్రకటితములయి యుండుటచేత ఈరెండు గ్రంథములయందలి శాసనపాఠములను ఒకదానితో నొకటి సరిపోల్చి చూచినయెడల ఈవిషయము కొంత బోధపడగలదు. గ్రంథవిస్తరభీతిచేత నీరెండు గ్రంథములయందలి శాసనపాఠములను ఇక్కడ పొందుపఱుచుట మానినాను.

రెండు పాఠములను బరిశీలించినవారికి ఈ గ్రంథమునందలి పాఠములెంతదుష్టముగ నున్నదియు తెలియుటయేకాక, పూరింపదగిన శాసనపంక్తులనుగూడ శాసనపరిష్కర్తలు విడిచిపెట్టి చుక్కలగుర్తులు పెట్టినట్లును స్పష్టమగుచున్నది. ఈగ్రంథమున నిచ్చిన శాసనములందలి పాఠములలో క్రిక్కిరిసి కానవచ్చు చుక్కలలో చాలభాగము కొన్నిచోట్ల శాసనశిలలు చెడిపోయియుండి శాసనపాఠము నేర్పఱుచుటలో గల కష్టమువలన బెట్టినవే యని యూహింపనవకాశమున్నను శాసనము చదువుటకించుక కష్టముగ నున్నచో, పాఠము పూరింపక విడిచిపెట్టుటవలన గలిగినను గలిగియుండవచ్చునని శంకించుటకు పారోద్వాహ్యత శాసనములే తావొసంగుచున్నవి.

ఈవిధముగ నున్న గ్రంథము చరిత్రపరిశోధకుల కంతవిశేషముగ నుపయోగపడదు. దీనికి ప్రామాణికతయు తక్కువ. చరిత్రపరిశోధకులు కానివారలకు దీని ప్రయోజనమే యల్పము. ప్రకటితమయిన గ్రంథము ఉన్నదున్నరీతిని మండలివారికికాని, పేరుపెట్టిన శ్రీ లక్ష్మణరావుగారికిగాని అంతప్రతిష్ఠావహము కానేరదని తెలుపవలసివచ్చినందులకు చింతిలుచున్నాను. ధనమూ వ్యయమయినది. ప్రయాసమూ అధికమయినది. అయ్యును తగిన ఫలము చేకూరకపోవుట ఆంధ్రుల దురదృష్ట మనవలెను. ఎవరిది లోపమని వెదకుట అనవసరము. శాసనప్రకటనము కష్టసాధ్యము. ఎంతటి యభ్యాసము గలవారి కయినను శాసనపాఠనిర్ణయమున ప్రమాదము లొండు రెండు రాకపోవు. కాని యట్టివి గణనాతీతములయిన కారణముననే ఈరీతిని విచారపడవలసివచ్చుచున్నది. తెలింగానాశాసనములు లక్ష్మణరాయ పరిశోధకమండలివారి కృషివలన చరిత్రపరిశోధకులకు సులభమయినవనుసంతోషము గ్రంథపరిశీలనముతో విషాదముగ మారుచున్నది. ఈగ్రంథమున ఫలాన శాసనములున్నవి, విషయమిదియని తెలిసికొనుటకు తప్ప దీనివలన నితరప్రయోజనము లేదు. ఇంతటనైన మండలివారీ గ్రంథమునందలి శాసనపాఠములను చక్కగ నిర్ణయము చేయించి దోషములను సవరింపించి, పునర్ముద్రణముచేసి ఆంధ్ర చారిత్రకలోకమున కుపకారముచేసిన పుణ్యము కట్టుకొందురని ఆశించుచున్నాను. అట్లయిన ఆంధ్రదేశ చారిత్రమున కమూల్యమయిన మేలు కలుగుటయే గాక మండలివారి కీర్తియు చిరస్థాయి కాగలదు. అన్ని శాసనములను గాకపోయిన మానె, వివాదగ్రస్తము లయిన ప్రధానచారిత్రక విషయములుగల శాసనముల కయినను మండలివారు పునర్ముద్రణమున ప్రతిబింబముల నిచ్చుట ఆవశ్యకము.

'శర్మ'

---



"నృత్తము"

— పెనుమాక వెం. సుబ్బారావు.

# కలగూరగంప



భోగమల్లు సితారా

భోగమల్లు శ్రీరంగం నారాయణబాబు (కవితా సమితి) విజయనగరము.

'ఒరిజినల్ క్లాసికల్ టాకీస్' వారి 'భక్తకబీర్' అను తెలుగుటాకీలో భోగమల్లు పాత్రను వీరు ధరించినారు. వీరిపాత్రధారణము, అభినయ కౌశలము కళాభిజ్ఞులగు సహృదయుల హృదయములను చూరగొనినవి. వీరు రజతపాత్రాది బహూకృతులను బడసిరి.

ఈచిత్రము కబీరుని సతియగు సీతారాను చెరుప నుంకించునప్పుడు శ్రీరామచంద్రుడు ప్రత్యక్షముకాగా భోగమల్లు చకితుడగుటను సూచించు పట్టు.

'ప్రాడిపెద్ది.'

---



శ్రీ బాలభాగవత వెద్దింటి వరహాలుదాసు

ఈ బాలభాగవతుని జన్మస్థలము విశాఖపట్టణం జిల్లాలోని నడిపాడు. ప్రస్తుతం గంజాంజిల్లాలో ఇచ్ఛాపురమందున్నాడు. బాల్యమునందే సంస్కృత భాషయందును, సంగీతమునందును చక్కనిజ్ఞానమును సంపాదించుకొనెను. హరికథలు చెప్పుటయందు ఇతనికి మంచి నేర్పుకలదు. నాటకములయందు పాత్రధారణాభినయముల కౌశల మధికము. బంగారు పతకములను పెక్కింటిని బహుమతిగాగూడ బడసినాడీ చిరంజీవి.

శాస్త్రి

---



కీ. శే. ఆవుల నారాయణస్వామినాయుడు

ఆవుల నారాయణస్వామినాయుడు ఆంధ్రపత్రిక బొంబాయిలో నుండగా ఫోర్మెనుగా కార్యాలయమున ప్రవేశించినాడు. నాటినుండియు తన చేయవలసిన కార్యమును, ఆసక్తితో నేర్పుతో నిర్వహించుచు యజమానియొక్కయు, సహోద్యోగులయొక్కయు ప్రేమను చూరగొన్నాడు. ఇతడు అయిదారునెలలనుండి ఆరోగ్యము సరిలేక సెలవులోనుండి అనుకోనకుండనే మొనమొన్న చనిపోయినాడు. ఇతని వయస్సు 52 ఏండ్లు మాత్రమే. ఇంకనూ ఎంతకాలమో బ్రదికియుండవచ్చును. పాపము ఏమి చేయవచ్చును. అజ్ఞాడను మానవునకు మృతి అనుల్లంఘ్యము. కాని అతనితో కలసి మెలసి ఒక్క కార్యాలయమున పనిచేయుచుండిన వారందరకును అతని మృతి సంతాపకరము కాకమానదు. ఇంతే పర్యవసానము.

---

## "వేంకట" శబ్దవిచారము

"వేంకట" శబ్దమునుగూర్చి యింతకుముందు "భారతి"లో చర్చలు జరిగినవి. "ఓంకా—అంకాళమ్మ అంకమ్మ" మొదలయినవి తన్నామ్ముల తద్భవములుగా నెంచఁబడినవి.

ఈలోపల కొంతికాలమునుండి నేను మహారాష్ట్ర దేశమున నున్నాఁడను. ఇక్కడ నొక విశేషము గాంచితిని.

ఇక్కడివారిలో నొకరు నా పేరును వ్రాయఁదటస్థించినప్పుడు "వేంకట" అని వ్రాయక "వ్యంకట" అని వ్రాసిరి. నేను దాని సవరింపు తెల్పఁగా వారు కీ ప్రాంతమున ఆశబ్దము నట్లే వ్రాయుదురని తెల్పిరి.

అట్లయినచో "వేంకట" శబ్దములోని భాగములను నిర్ణయించి అర్థములను గూర్చుట కింతవఱకు సూచింపఁబడినంత శ్రమ యవసర ముండదు.

"వి + అంక + అట" అను శబ్దములకు (యణాదేశ, పరరూపములు) పక్షిగుఱుతు (గరుడధ్వజము) తో సంచరించువాఁ డని యర్థము తేలఁగలదు. ఈ "వ్యంకట" శబ్దోపయోగము మహారాష్ట్రదేశమునందు మిక్కిలి వాడుకలో నున్నట్లే గమనించినాఁడను.

"కతా వేంకటనాయక" యను ప్రమాణమున తన్నామశబ్దవిచార మల్పము గాదు గాన దానినిగూర్చి లభించిన యీవిషయముయొక్క సామంజస్యమును గూర్చికూడ అభిజ్ఞులు పర్యాలోకింతురు గాక.

దోమా వేంకటస్వామిగుప్త




## స్వప్నానుభూతి

ఇది శ్రీ దుర్భా రామమూర్తి యం. ఏ గారిచే ౧౯౩౫లో రచింపబడిన భావస్ఫూర్తిగల ఖండకావ్యము. కవి ఇరువదియైదేండ్లకు లోబడిన యువకుడు. నెల్లూరు నందు వెంకటగిరి రాజా కాలేజిలో ఇంగిలీషు ట్యూటరుగ నున్నారు. వీరిది పండితవంశము. వీరి తండ్రిగారు బ్ర. దుర్భా సుబ్రహ్మణ్యశర్మగారును ఆకాలేజీలో నాంధ్ర సాహిత్యవాఙ్మయాధ్యాపకులు, ప్రౌఢకవులు.

ప్రస్తుతకావ్యము సార్థకనామము గలది. ఈకవి కుమారుని కలము మనోహరమగు నీచిన్ని కావ్యరూపమున వెడలినది. గ్రీకు ఐతిహాసికుడగు హోమరుగాథలలోని Goldeh Apple (బంగారు ఫలము) అను సంశము ను ఆంగ్లకవిరాట్టు టెన్నిసన్ గారి Dream of fair women (అందకత్తియలకల) యను పద్యావళి లోని యంశమును నిజోపజ్ఞతోటి మనోజ్ఞముగ సమ్మేళనమొనర్పబడి ఈకృతి కూర్పబడినది. దీని నూట నలుబదియొక్క పద్యములున్నవి. ఏ పద్యమున కా పద్యము స్వతఃపూర్ణమైయున్నను కొన్నియెడలమాత్రము ఆగామ్యపేక్ష కానవచ్చుచున్నది. కవిత్వము రసవంతముగను, భావములు ఉత్సాహామోదోద్బోధకములుగను నున్నవి. అందందు చిత్రపటములుండిన దృశ్యసంపదయు చేకూరియుండును. ముఖ్యముగ కవికుమారుని ఆకాశయానము, లక్ష్మీపార్వతీసరస్వతుల దర్శనము, కవితాదేవతా కరకంకణాభూషణము — ఈమూటికైన పటములుండదగును.

ఈగ్రంథమున కథాభాగ మతిస్వల్పము. లక్ష్మీ పార్వతీ సరస్వతు లొండొరులతో స్పర్ధగొని తమలో నెవతె యధికురాలో తీర్మానించుకొనజాలక మనుష్య లోకమున నుండు నీకవికుమారుని మాధ్యస్థ్యమును గోరి, ఈతని తమకడకు దేర దేవదూతి నొర్తు నంపి యాతని తమ నెలవునకు రప్పించుకొనినట్లును, ఈతడా సందేశహారిణివెంట వ్యోమయానమున నాముత్త్వయుండుచోటు నకు బోయి వారొకరొకరు స్వాతిశయపక్షమున జెప్పిన యుత్కృష్ట వాక్యముల నెల్ల విని తుదకు సరస్వతి నత్యుత్తమురాలినిగ నిర్ణయించి ఉత్తమురాలి కీదగు స్వర్ణఫలము నామె కర్పించినట్లును, సరస్వతి యాతని ప్రాజ్ఞతను మెచ్చుకొని కవితాకుమారి నీతనికి ప్రసాదించినట్లును, అభిమానసూచకముగ నాకవితాకన్య నిజహస్తమును జాప నీత డద్దాని ముద్దాడినట్లును, ఇంతటితో "స్వప్నానుభూతి" సమాప్తమై యాతనికి భౌతికప్రపంచస్ఫురణము కలిగినట్లును కావ్యవస్తువు.

వియద్గమనఘట్టమును, లక్ష్మీపార్వతీసరస్వతుల స్వాతిశయవాక్యములును, కవితాకుమారిసందర్శనమును బహురమ్యముగ నున్నవి:—

లక్ష్మి:—

ధరణీమండల మేలు రాజపదవిన్
దైవారంగాఁ జేతు; బం
ధురభోగప్రతిపాదకంబులగు వ
స్తువ్రాతముల్ నూర్తు; ను
ర్వర నీకున్ సురభూమియై వఱల దీ
వ్యత్ భాగ్యసంపత్తి సు
స్థిరముం జేయుదు, నీగృహంబునను వ
ర్థిల్లన్ సువర్ణాంబువుల్.

పార్వతి:—

అరులన్ గెల్చుపరాక్రమస్ఫురణ, శౌ
ర్యస్ఫూర్జితావేశమున్
గురుసంగ్రామ శావిదగ్ధయును నీ
కున్ గూర్తుఁ గాదేని దు
స్తరవారాశిని దాఁటులాఘవము శ
శ్వత్తారకానీకమున్

వరుసన్ లెక్కయిడంగ నోపు కుశల
త్వంబున్ బ్రసాదించెదన్.

వాణి:—

పిలిచిన రాదు, పిల్వకయ
పిల్చినయట్టుల వచ్చి తీయనౌ
తలపులు మోసులెత్త బలి
తంబుగ డెందము బందిజేయు, పే
రలుక వహించి కన్నులకు
నందని చోటుల కేగి డాగు, న
చ్చెలువచరిత్ర మెంతయును
జిత్రము, హర్షమె వెల్లవేళలన్.

ఆట్టికవితాకుమారిసఖ్యంబు నీకుఁ
గలుగఁజేసెద, యువకవీ! కనకఫలము
నిమ్ము.

కవితాధోరణికిని, రసస్ఫూర్తికిని ఈ పద్యములె చాలియుండగలవు. కొన్నియెడల నిందలిరచన గూఢముగగూడ నుండును. ఉదాహరణము

శర్వరీకాంత మృదులహృత్స్పందనములు
శ్రవణముల కందు నాఁడి నిశ్శబ్దమందుఁ
బలుచుచున్నది హృదయమ్ము శరమువోలె
దేని నాసించియో నాకుఁ దెలియరాదు.

ఈకవిచిత్తవృత్తి శాంతిప్రవణమైనది. సంగ్రామకళావిదగ్ధత బార్వతి ప్రసాదింపనున్న

చనియె సంగ్రామయుగము, ప్రశాంతమైన
ప్రాగ్దిశాసితకాంతి సంపదల బలిసి
పశ్చిమాశకు నమలినత్వము ఘటించి
రక్తశోణిమ కడుగుఁ గ్రౌర్యంబు తలఁగ.

అని నిరాకరించినాడు. ఈతనికి కవిత్వమునందు గల యత్యంతాసక్తిచే దా జేయునుద్యోగంబునందును వైరస్యము జూపినాడు.

ఉదరంబున్ భరియింపఁగా నలుపును
ద్యోగక్రియల్ తృప్తియ
న్నది చేకూర్పమి జీవితమ్ము తలక్రిం
దైనర్థహీనమ్మునై

పోలెన్ - నాలుగు నిర్వేదేండ్లు గతమున్
బోఁగ్రోసి జన్మాంతరం
బదగన్ గాంచినయట్టు లయ్యె కవితా!
త్వద్దర్శనప్రాప్తిచేన్.

దివ్యస్వప్నముక్తుడై యీతడు నిజస్థితి నిటుల స్వభావస్వరూపరమ్యముగ వర్ణించియున్నాడు-

కనులను విప్పిచూడ నిజ
కాంతయు వేకువ నింటికార్యముల్
పూనరిచి నన్ను మేల్కొలుపు
పూనిక పాటలు పాడుచుండెఁ బ్ర
క్కన నిలుచుండి, సూర్యకర
కాండము సోఁకెను మేనుగాలిఁ దోఁ
చెను బరువుస్వనుల్ మనుజ
జీవితదైనికసంగరోగ్రమై.

ఇతనికడ కేతెంచిన దేవమాత
"వెన్నెలల్ బర్వఁ బెదవుల విప్పి యంత
ధవిజకాంతయు ననుఁ జూచి తియ్య మలర
శ్రావ్యవీణానులాపసుస్వరముతోడ
మఱపురానట్టు లిట్లనె మనుజభాష"
బహుశః ఈభావ తెలుసుగనె యుండునుగదా.

మద్రాసుయూనివర్సిటే ఆంధ్రవిద్యాశాఖాధికారులును, ఆంధ్ర యూనివర్సిటే ఆంధ్రవిద్యాశాఖాధికారులును ఈనవీనకల్పన నామోదించి యభిమానించి ఆయా యూనివర్సిటీలలో ౧౯౩౦ సంవత్సరపు బి. ఏ. పరీక్షా పాఠ్యగ్రంథముగ దీని నియమించిరని తెల్పుట కెంతయు సంతసముగ నున్నది. ఈ కవికుమారుని కిది మిగుల ప్రోత్సాహకరమై ఇతోధికములగు ప్రౌఢకావ్యరచనల కుత్సహింప జేయగలదు. ఒ. వెం.

---

## చిత్తోడుపతనము

(సమాకారము)

సరస్వతీగ్రంథమాల ౩౭వ పుష్పము. గ్రంథకర్త: శ్రీ కోచమర్తి చినరఘుపతిరావు. క్రౌను ౧/౮ సైజు. ౧౭౧ పుటలు. వెల. అ. ౧౨ లు. వలయువారు

పశ్చిమగోదావరి జిల్లా, తణుకు తాలూకా, కాకరపర్రులో నున్న శ్రీసరస్వతీ గ్రంథమాలవారికి వ్రాసికొనవలెను.

విషాదాంతమగు ఈ దృశ్యకావ్యమున మూడంకములలో చిత్తూరురాజ్య వినాశవృత్తాంతము వివరింపబడినది. చిత్తూరురాణా రణభీరువయి తురుష్కుల నెదిరింపలేక దుర్గము విడిచి పారిపోవుట, ఆవృత్తాంతమును చిత్తూరు మంత్రి భేల్వాసంస్థానాధిపతి యగు పుట్టాసింహు నెరుకపరచుచు రాజపుత్రుల గౌరవమును నిలుపగోరుట, వివాహము చేసికొనుచున్న పుట్టాసింగు అది ముగియకుండగనే తండ్రి మామలతోగూడ చిత్తూరునకు పోయి ఢిల్లీ పాదుషాకు రాయబారమంపుట, సంధి కుదురక తురుష్కులు, రాజపుత్రులు యుద్ధమొనర్చుట, రాజపుత్రులు మడియగా చిత్తూరు వినాశమగుటయు నిందలి కథాంశము.

ఇందలి కథ మొదటినుండి ౩వ అం. ౨ వ. రం. వరకు సంధిప్రధానప్రయోజనములగు సూచ్యార్థసూచన, వివక్షితార్థప్రతిపాదన, గోప్యార్థగోపన, చమత్కారిత్వములు లేకయే కథమాదిరిగనే సాగినది. యుద్ధము ౩ వ. అం. ౨. వ. రం. తోనే ప్రారంభింపబడి ముక్తసరిగ మూడురంగములలో చితోడుపతనముతో అంతమైనది. ఇందాదినుండి అంతమువరకు ప్రధానరసమునకు తగినరీతిని పరిపోషణము లేదు.

పుట్టాసింహుడు, అతని తల్లి మీరాబాయి యుద్ధమునకు ముందు ప్రసంగించిన మాటలలో కొన్ని ఉభయపాత్రపరిపోషణమునకు కొరత కల్గించునవి.

ప్రభువు ఒక పనిని చేయవలెనని భృత్యునితో చెప్పి పంపగా, ఆవెంటనే అతడు తిరిగివచ్చి 'అట్లే యొనరించి వచ్చితి' నని చెప్పుట సంస్కృతనాటకములందు తరచుగ కలదు. కొంత కాలము వ్యవధాన ముండవలెను. ఇట్టిది తెలుగునాటకములలో అరుదు. ఈ 'సమవాకారము' నందు పయి సంస్కృతఫక్కి ననుసరింపబడి రాయబారులను గౌరవింప సభ వీడిన నాగేశ్వరామాత్యుడు వెంటనే తిరిగివచ్చుట ప్రదర్శితము.

పాత్రౌచిత్యము పాటింపబడక సేవకుడుమొదలు చక్రవర్తివరకు అందరికి ఇందు గ్రాంథికాంధ్రమే ఉపయోగింపబడియున్నది. కాని నవాబురాయబారులకు మాత్రము రాజపుత్రులతో మాటలాడునపుడు తురక తెలుగు, నవాబుతో మాటలాడునపుడు గ్రాంథికాంధ్రము ఉపయోగింపబడినవి. దానికి కారణము తెలియకున్నది.

జనసామాన్యపు టభిరుచులనుబట్టి కాబోలు నిందు పద్యములు చాల తక్కువగ రచింపబడినవి.

"ఇ-య్యది సుక్షత్రియవీరవంశ్యఘనపు-ట్టాఖడ్గమా నేని" [పుట ౨౫] అనునెడ యతి తప్పినది.

ఇందు "పదునాల్గు వత్సరాల్ దెనిచితి" [పుట ౨]వంటి అచ్చుపొరపాటులు, "ఒనరించినను యొనరింపకున్నను" [పుట ౧౦౮] వంటి యడాగమ రూపములు "దుగ్ధపదుర్దాంతసురంతదుస్సహారిప్రస్ఫీత మస్త్రాళి" [పుట ౨౫] వంటి భావకవుల పోకడలు కొన్నికొన్ని కలవు.

ఇందలిపాత్రముల జీవితము లాదర్శప్రాయములు; విషయము జనాదరణపాత్రము; రచన ఎక్కువగ వచనము; సరళము. కాన ఈ గ్రంథము పఠనయోగ్య మనదగును.

బు. వేంకటరమణయ్య

---

## కథావింశతి

వెల రు. ౦-౮-౦

నలువదిపుటల యీచిన్ని పుస్తకమునందలి యిరువది కథలను శ్రీ చక్కా పద్మావతిగారు రచియించిరి. కథలలోని విషయములు ప్రాతవి. రచనము చాలసామాన్యము. ఇది "ప్రాథమిక పాఠశాలలయందలి ఉత్తమ తరగతులకు పఠనీయముగ" పద్మావతిగారిచే నుద్దేశింపబడినది.

ప్రకాశకులు శ్రీ నాళం రాఘవమ్మగారు, ౩౬౮ టంకసాలవీధి, మదరాసు.

---

## శ్రీ భర్గశతకము

వెల రు. ౦-౮-౦

ఇందు 'భర్గా, పార్వతీవల్లభా!' అను మకుటము గలిగిన వృత్తములు ౧౦౧ గలవు. దీనిని 'కవిసార్వభౌమ'

కూడిమంచి తిమ్మకవి రచియించెను. ' జగమెఱిగిన బ్రాహ్మణుు' తిమ్మకవి. ఇతనిమాటలు "హాటకగర్భవధూటీ, లాటనచలితాంఘ్రి నూపురారావశ్రీ, పాటచ్చరములు తేనియతేటలు" అని పొగడ్తగన్నవి. ఇకనితని కవిత్వమును గూర్చి చెప్పుట యనవసరము. ఈ శతకముకవిత్వమును ప్రాయికముగా నట్టి పొగడ్తకు తగినదే.

---

## హిందూదేశము - ఫెడరలు ప్రభుత్వము

వెల రు. ౦-౧-౦

గ్రంథకర్త: కే. వి. పున్నయ్య, ఎం. ఏ., (ఆనర్సు)

గ్రంథకర్తకు 'ఎం ఏ. (ఆనర్సు)' డిగ్రీకి (ఆంధ్రవిశ్వవిద్యాలయ మిచ్చునది) సంపాదించియిచ్చిన యీ పేరిటి విపులాంగ్లరచనమునంపలివగు ముఖ్యాంశములు గల క్షుప్తరూప మీ చిన్నపుస్తకము. విపులరచనముకూడ గ్రంథరూపమును పొందనున్నదట! ఇది అనకాపల్లి యందలి ప్రజాసేవ గ్రంథమాలలో మూడవప్రచురణము.

---

## ౧ లక్ష్మీస్తోత్ర నక్షత్రమాల

నాలుగుపుటలు. వెల రు. ౦-౨-౦

గ్రంథకర్త. వలిపె వెంకటరావు, వకీలు, కొల్లాపురము.

## ౨ నీతిగీతికలు

నలువది గీతికలుకల చిన్నపుస్తకము, వెల రు. ౦-౨-౦

గ్రంథకర్త: గంధము వెంకటనరసింహాచార్యులు, కొల్లాపురము.

ప్రకాశకులు : ప్రెసిడెంటు, స్నేహలతా కవితా సంఘము, కొల్లాపురము, మొరవకొండపోస్టు, కర్నూలు జిల్లా.

---

## Studies in Dravidian Philology

(ఆంగ్లము)

రాయల్ ౧/౮ ౨౦౦ పు. వెల రు. ౨-౮-౦

గ్రంథకర్త: కే. రామకృష్ణయ్య, యం. ఏ.,

(Senior Lecturer in Telugu, Oriental Research Institute, University of Madras.)

మదరాసు విశ్వకళాపరిషత్తు ప్రచురణము

---

## మురళి

(మాసపత్రిక)

కాకినాడ ఆంధ్రప్రచారిణీగ్రంథనిలయ రజతోత్సవ స్మారకముగ, శ్రీ వేంకట పార్వతీశ్వరకవులచే సంపాదింప బడుచున్నది. భిన్నభావములు, భిన్నవృత్తులు గల భిన్నప్రకృతుల యేకీభావమున కీ మురళి యుద్దేశింపబడినది. ఈ ప్రథమసంచిక యాయాదర్శమునే నిరూపించుచున్నది. నడకనుబట్టివారు, వేంకట పార్వతీశ్వరకవులు నీ తొలిసంచిక నందముగ దీర్చినారు. ఏడాది చందా రు. ౧-౨-౦. విడిసంచిక ౦-౧-౬.

---

## The Philosophy of the Village Movement

మహాత్ముని గ్రామపరిశ్రమోద్ధరణోద్యమ తత్త్వమును వెల్లడించుచు జె. సి. కుమారప్పగారు వేర్వేరు ప్రదేశములలో గావించిన యుపన్యాసములను సమకూర్చి గ్రంథరూపమున బ్రకటించుటలో శ్రీయుత శనివారపు సుబ్బారావుగారు అదనున కవసరమగు సేవయొనర్చిరి.

భారతదేశపు ఆర్థికజీవితములో నిది చాలముఖ్యమగుసమయము. ప్రపంచమున ప్రతిదేశపుసభ్యతయు, ఆదేశపుయొక్క ఆర్థిక,పారిశ్రామికసంపదపై నాధారపడియుండును. ఇది భారతదేశమునకుగూడ వర్తించును. భారతదేశమున పరిశ్రమ లిపు డింకను శైశవావస్థయందున్నవి. ఈ దేశమున నిపుడు వ్యాపించియున్న ప్రబోధమువలన చాలమంది దేశీయపరిశ్రమల నభివృద్ధిపరచుట కుత్సాహపడుచున్నారు. ఏపద్ధతియందు భారతీయులు తమ పరిశ్రమ నభివృద్ధిపరచుకొనవలెను అను విషయము వారి నాందోళనపరచుచున్నది. పాశ్చాత్యరాష్ట్రీయులవలె ఫాక్టరీపద్ధతిమీదనా, లేక చిన్నచిన్న గృహపరిశ్రమల పద్ధతిమీదనా? ఈరెంటిలో నేది దేశమునకును, ప్రపంచమునకునుగూడ శ్రేయోదాయకము?

ఈప్రశ్నలకు సమాధాన మంత సులభమైనదిగాదు. నిష్కళంక దేశభక్తిపూరితులగు మేధాసంపన్నులగువారనేకు లీవిషయమున భిన్నాభిప్రాయులగుటకు అవ

కాశ మున్నది. గాంధిమహాత్ము డీవిషయమును దీర్ఘముగ నాలోచించి గ్రామపరిశ్రమల పద్ధతి భారతదేశమునకును, ప్రపంచమునకును గూడ తారకమంత్రమని భావించి, అఖిలభారత గ్రామపరిశ్రమోద్ధరణ సంఘమును స్థాపించెను. మహాత్ముని శిష్యగణమునందగు ముఖ్యులగు జె. సి. కుమారప్పగారీసంఘమునకు కార్యదర్శిగ నియమింపబడిరి. అట్టికుమారప్పగారికంటె ఈయుద్యమ తత్త్వమును వివరించుట కధికారముగలవారు చాల అరుదు. సప్రమాణములగు వారి యుపన్యాసములకు మెరుగుపెట్టునటుల భారతజాతీయ మహాసభాధ్యక్షులగు బాబురాజేంద్రప్రసాదుగారు ఈ గ్రంథమునకు "తొలిపలుకు"లు వ్రాసిరి.

కుమారప్పగారీయుపన్యాసములయందు భారతదేశము తనపరిశ్రమలను గృహపరిశ్రమలపద్ధతిలో నిర్మించుకొనవలసినయావశ్యకతను నిరూపించుచు ఆపద్ధతికి ప్రత్యర్థియగు ఫ్యాక్టరీపద్ధతివలన గలుగు కీడుమేళ్లనుగూడ దీర్ఘముగ చర్చించి, అది సౌభాగ్యప్రదమగుటకుమారు అరిష్టదాయకమగుచున్నదని హెచ్చరించిరి. రష్యాదేశీయు లవలంబించిన సామ్యవాదసిద్ధాంతమువలనగూడ ఫ్యాక్టరీపద్ధతివలన గలుగు దుష్ఫలితములు నివారణనొందవని వారి యభిప్రాయము.

మహాత్ముని గ్రామపరిశ్రమోద్ధరణోద్యమము కేవల మార్థికమైనదే కాదు. కుమారప్పగారు నుడివినటుల నది అత్యుత్కృష్టమగు నాధ్యాత్మికసిద్ధాంతములతో గర్భితమైయున్నది. గృహపరిశ్రమలయందలి చేతిపనులవలన మానవుని వ్యక్తిగతమగు మానసికవికాసమునకును ఉపజ్ఞాప్రవృత్తికిని ఆత్మసంతృప్తికిని అవకాశముండును. వస్తుసంచయము అవసరములబట్టి మితముగ నుత్పత్తి చేయబడును. వానికి ధరలు లభించును. మనుష్యులు హాయిగ సంతృప్తజీవనులగుదురు. ఫ్యాక్టరీపద్ధతిలోవలె అమితోత్పత్తికిని, వానిని విక్రయించుకొనుటకు పోటీలకును, మానవనాశకమగు మహాసంగ్రామములకును అవకాశములు తగ్గింపబడును.

అన్ని దేశములును గ్రామపరిశ్రమలపద్ధతి నవలంబించినయెడల పరిశ్రమలయందును, వాణిజ్యమునను గలుగు పోటీలకును, మత్సరములకును అవకాశము తగ్గుననువిషయము నిజమేగావచ్చును. కాని ప్రపంచమందన్నిదేశము లీపద్ధతి నవలంబించునా? అవలంబించనిచో ఒక్క భారతదేశమువాత్ర మన్నిపరిశ్రమల సంబంధమునను గూడ గృహపరిశ్రమలవిధానమునే యవలంబించుట శ్రేయస్కరమా యను ప్రశ్న గలదు. ఫ్యాక్టరీపద్ధతిమీద పరిశ్రమల నడుపుకొనుచున్న దేశమునకును, గృహపరిశ్రమలపద్ధతిలోనున్న దేశములకును పోటీపడినపుడు రెండవదేశ మల్పకాలములోనే శిథిలమైపోకతప్పదు. అంతియగాదు, ఆదేశమాత్మరక్షణమును గావించుకొనగల్గుటగూడ దుస్సాధ్యము. నేడు మనకండ్లయెదుట అబిసీనియా దేశీయులు పడుచున్నదురవస్థలకంటె ఇందుకు ప్రబలనిదర్శన మనవసరము. ఇంకొకవిషయము - నేడుప్రపంచమున బలవంతములయినట్టియు, శత్రుభయంకరమైనట్టియు, అందుచే ప్రపంచమున గౌరవపాత్రముగనున్నట్టియు దేశము లెవ్వియో జూడుడు: ఇంగ్లాండు, జర్మనీ, ఫ్రాంసు, ఇటలీ, అమెరికా. వీనికన్నిటికిని ఇంతప్రాబల్యము చాలవరకు ఫ్యాక్టరీపద్ధతిలో పరిశ్రమల నేర్పుకొనుటవలననే లభించెనని అంగీకరింపకతప్పదు. ఈబలవంతములగు దేశములతో సరిసమాన గౌరవప్రతిపత్తులను సంపాదించుకొనుటకు ఇటీవల జపానుగూడ తనపరిశ్రమలను ఫ్యాక్టరీపద్ధతిమీదనే సత్వరముగ నభివృద్ధిపరచుకొనవలసివచ్చె ననువిషయము గుర్తింపదగియున్నది! జపానుదేశ మిపుడు ఎంతశత్రుభయంకరమై పాశ్చాత్యజాతులతో తన సరిసమానతను అంగీకరింపజేసి గౌరవము నందుచున్నదో సమకాలికులందరెరిగినదే. ధనస్వామ్యమును నిర్మూలించుటకు బుట్టిన రష్యాయందలి కమ్యూనిస్టుప్రభుత్వముగూడ ఫ్యాక్టరీపద్ధతి నవలంబింపక తప్పదయ్యెను. లేనిచో రష్యాస్థితి యిపుడెటులుండెడిదో యెవరు చెప్పగలరు?

ఫ్యాక్టరీపద్ధతివలన గల్గును అనిష్టములు, ఆపద్ధర్మముగ దానిననుసరింపవలసిన యావశ్యకమును, గృహపరిశ్రమల యుత్కృష్టతను, మానవకల్యాణ సంధాయక శక్తిని గుర్తించి, భారతజాతీయావశ్యకతల కనుగుణముగ

పారిశ్రామిక విధానమును నిర్ణయించుకొనుట కీయుపన్యాసములు చాలవరకు తోడ్పడును.

ఈ గ్రంథము కావలయువారు శివివారపు సుబ్బారావుగారు, కొవ్వూరుపోస్టు, పశ్చిమగోదావరి అని వ్రాయవలెను. వెల రు. ౦-౮-౦ లు.

మో. కృ

---

## ఉపన్యాసములు

(మొదటి భాగము)

గ్రంథకర్త: శ్రీ కృత్తివెంటి వెంకటసుబ్బారావు, క్రౌనుగ ౧౬పేజు, ౧౦౨పుటలు. వెల విద్యార్థులకు రు. ౦ ౧౨-౦, ఇతరులకు రు. ౧. వలయువారు పడమటి గోదావరి జిల్లా, భీమవరమున ఉన్న గ్రంథకర్తకు వ్రాసికొనవలెను.

ఈ మొదటిభాగమున "ఆంధ్రసారస్వతగోష్ఠి, నాటకచరిత్రసంగ్రహము, సంగీతసాహిత్యములు" అను మూడు 'ఉపన్యాసములు' కలవు. 'ఇందు మొదటి రెండును ౧౯౩౦ సం. అక్టోబరు ప్రాంతమున "రచించి యుపన్యసించినవి. 'మూడవది' గ్రంథకర్త 'కాకినాడ కాలేజీలో లెక్చరరుగా నున్నపుడు (౧౯౩౧ అక్టోబరు ప్రాంతమున) అచ్చటను, తరువాత కొలదిదినములకే రాజమండ్రి ఆర్ట్సుకాలేజీలోను సంగీతసాహిత్యములను గూర్చి యుపన్యసించినపిదప వ్యాసరూపమును నిచ్చుటకు' అతనికి 'సంకల్పము కలిగినది. అది సంకల్పమాత్రముగనే యుండి, రాజమహేంద్రవరము యువతీ సంస్కృతకళాశాలలో వైస్ ప్రిన్సిపాలుగ నుండినపుడచటి సంగీతము మాటగ మాటగ నీ వ్యాసమునకు త్వర కలిగినది. ౧౯౩౩ సం. ఆ విషయమే రెండు మూడుసారు లుపన్యసింపగ ఈ ప్రస్తుతస్వరూపము నొందినది."

'ఈ వ్యాసములు కొంతవఱకు చారిత్రకములు; కొంతవఱకు వైమర్శికములు. 'ఆంధ్రసారస్వతగోష్ఠి' యనుమొదటివ్యాసమున ఆంధ్రసారస్వతచరిత్రము సంగ్రహముగ ఈయబడినది. ఆంధ్రసారస్వతచరిత్రముతోపాటు ఆంధ్రదేశచరిత్రము, దానితోపాటు హిందూదేశచరిత్రమును ఇందక్కడక్కడ సంకీర్ణములయి యున్నవి.

'కొందరు రామాయణకర్తయగు భాస్కరుడు కూడ నన్నయకు పూర్వుడే యందురు......నన్నెచోడుడును, భీమకవియు పూర్వులైన గావచ్చును' [పుట ౧౩] 'వీరేశలింగముగారి కవులచరిత్రతో గురజాడ శ్రీరామమూర్తిగారి కవిజీవితములు బయలువెడలెను.' [పు. ౩౦.] పయికీలి క్రొత్తసిద్ధాంతములు కొన్ని పయి వ్యాసమున గలవు.

'నాటకచరిత్రసంగ్రహము' ను గూర్చిన రెండవ వ్యాసమున నాటకేతరవాఙ్మయముయొక్కయు, తత్కర్తలయొక్కయు చరిత్ర మచ్చటచ్చట వ్రాయబడినది. భారవి, సుబంధుల చరిత్ర మిందులకు ఉదాహరణము. ఇందు చరిత్రమునకు విరుద్ధములగు విషయములు కొన్ని కలవు. మచ్చునకుకొన్ని—

'చరిత్రకారు లాతనిని (కాళిదాసును) క్రీ. శ. ౫౭౫-౬౬౦ ప్రాంతమున నుంచిరి. భారవియును వీని సమకాలీనుడే.' [పుట ౪౦.]

భారవి కాళిదాసునికి అర్వాచీనుడు.

'పాణినీయ విరుద్ధప్రయోగములు పెక్కులు వీని (భాసుని) నాటకముల యుండుటచే నితడు తత్పూర్వుడో, సమకాలికుడో యై యుండును. (క్రీ. పూ. సుమారు ౫౦౦ ప్రాంతమువాడేమో.)' [పుట ౪౨.]

భాసుడు పాణినికి పూర్వుడు కాడు: సమకాలీనుడును కాడు.

గ్రంథకర్త ఒకచో [పుట ౪౧] 'మురారేః తృతీయః పంథాః' అను లోకోక్తిని 'అనర్ఘరాఘవ కర్త యగు మురారికి ముడిపెట్టెను. అది మీమాంసకుడగు మురారిమిశ్రునిగూర్చి చెప్పబడినది గాని మురారి కవిని గూర్చి చెప్పినది కాదు.

ఈ వ్యాసమున 'నాటకలక్షణములు etc' అను శీర్షికక్రింద ఈయబడిన పెక్కు విషయములు అసంగతములు. అందు కొన్ని యిచట ఈయబడును—

"వీనికి (రసములకు) స్థాయీభావములు:— రతి, హాస, శోక, క్రోధ, కోప, రోష, ఉత్సాహ, భయ, జుగుప్సా, విస్మయ, శమములు." [పుట ౫౩]

పైవానిలో క్రోధ, రోషములు స్థాయిభావములు కావు.

౫౮-వ పుటలో 'స్వరూపము' అనునది నాయక గుణములలో ఒకటిగా చెప్పబడినది. పయి విషయసంగ్రహమునకు మూలమగు 'ప్రతాపరుద్రీయము'న నాయక గుణనిరూపణముతరువాత 'అథ నాయకస్వరూపం నిరూప్యతే' అని యుండుటచే గ్రంథకర్త నాయకస్వరూపముకూడ గుణమని భ్రాంతిపడి యిట్లు వ్రాసియుండవచ్చును.

'ప్రస్తావన(ప్రరోచన)—ప్రస్తావనము ప్రవర్తక ప్రయోగాతిశయము.' [పుట ౬౦] అనగా అర్థమేమో? ౬౧వ పుటలో ఆముఖము, ప్రస్తావన వేరువేరుగ వివరింపబడినవి. కాని పయి రెండును అభిన్నములే.

"నాన్ది-౮, ౧౨, ౧౮, ౨౨ అక్షరములు గలిగి అర్థములఁ గాని, శబ్దములఁ గాని కావ్యార్థసూచనము కలది." [పుట ౬౨]

౮ గాని, ౧౨ గాని, ౧౮ గాని, ౨౨ గాని పదములు కలిగి నాంది యుండవలెనని నియమము; కాని అక్షరము లుండవలెనని కాదు.

'సంగీతసాహిత్యము' లను శీర్షికగల మూడవ వ్యాసమున సంగీత,సాహిత్యముల చరిత్రతోపాటు భాషాచరిత్రమును అచ్చటచ్చట వివరింపబడినది. సంగీత సాహిత్యములకు గల సంబంధమును, వాని తత్త్వమును గ్రంథకర్త యూహకందినటుల వివరింపబడినవి. వాని తత్త్వమును వివరింప ఉభయతత్త్వము నెరిగినవారే సమర్థులు.

శ్రీ సుబ్బారావుగారి రచన సరళమైనది. కాని కొన్నియెడల పూర్వాపరసందర్భమును, ఔచిత్యమును వీడి యుండుట యును, ధర్మధర్మిభావమును లెక్కసేయకుండుటయు గలదు. కొన్నిపదములు ప్రత్యయములులేకయే ప్రయుక్తములు. కొన్ని స్త్రీవాచకపదములు తెలుగునను దీర్ఘములతోనే నిలిచిపోయినవి.

దిఙ్మాత్రముగ కొన్ని ఉదాహృతులు.-'రాజరాజ నరేంద్రుఁడు తెలుగు సారస్వతమునకు ఆంధ్రభోజుఁడు. తెలుగుభాష వీని చేతులలోఁ బెఱిగి మాటలాడనేర్చి గారాము నొందినది.' [పుట ౧౨.]

'ఈ రెడ్డిరాజులయొద్ద శంభుదాసుఁడను ఎఱ్ఱాప్రగడయను కవి యొకఁడు పోషనూపెను.' [పుట౧౫.]

'కవిరచితమైనది కావ్యముగదా. అవి ద్వివిధము లనుచున్నవి.' [పుట ౩౫]

'—సంగీతము స్వాభావికమునకు విరుద్ధము..' [పుట ౫౫]

'స్త్రీ పురుష సమ్మేళనములకు ప్రదర్శనముల ప్రయోజనము...—' [పుట ౫౫]

'వీరికి నాయికానుకూలమందు- కొంచెము ఊన స్వభావముల పీఠమర్ద, ఏకవిద్యుఁడగు విట, సంధానకుశలుఁడగు చేట, హాస్యప్రాయుఁడగు విదూషక అను వారు' [పు౫౯].

'వీరికి (నాయికలకు) నాయకానుకూలమందు దాసీ, సఖీ, కారూ, (రజకీమున్నగు) ధాత్రేయి, (ఉపమాతృసుత), ప్రాతివేశినీ (సమీపగృహవర్తినీ), లింగినీ (పరివ్రాజిక), శిల్పినీ, స్వా, (స్వయం. భగినీ బాలిక మాతులసుత) అనువారు' [పుట ౫౯-౬౦]

ఇంకను అన్వయసౌకర్యము లేని పదములు,వాక్యములు చాల కలవు. మూడు ఉపన్యాసములు మూడు ముద్రాయంత్రములలో ముద్రింపబడుటచే ఈ గ్రంథమున అందందు అచ్చుతప్పులు దొరలుట వింతకాదు.

గ్రంథకర్త ఏరుకొనిన విషయములంగూర్చి చెప్పవలసినది ఎంతయేని కలదు. కాని ఈ యుపన్యాసములలో విద్యార్థులు గ్రహింపదగిన విషయములు చాల తక్కువ. కాని అచ్చటచ్చట పరాధిక్షేపములు కలవు. వానింగూర్చి గ్రంథకర్తయే "అచ్చటచ్చట కొందరికితవుగాని కొన్నివిషయము లుండవచ్చును. కాని యవి వ్యక్తిపరములుగ నొకరికొఱకుగా, మఱియొకరి నుద్దేశించియు వ్రాసినవికావు" అని చెప్పికొనెను.

శ్రీ సుబ్బారావుగారు కడమభాగములందయినను పయి లోపములు కలుగకుండునట్లు ప్రయత్నించి వాఙ్మయమునకు సేవ చేయుదురని విశ్వాసము.

బు. వేంకటరమణయ్య

---

# కాంగ్రెసు చరిత్రము

(ఇంగ్లీషు)

"My own belief is that the Congress is tottering to its fall, and one of my great ambitions while in India is to assist it to a peaceful demise."

—Curzon's letter to the Secretary of State for India, dated the 18th of November, 1900.

అని కర్జను ప్రభువుగారు క్రీ. శ. ౧౯౦౦ వ సంవత్సరమునందు ఇండియా కార్యదర్శికి వ్రాసిరి. కర్జనుదొర అతిమేధావి. పైయభిప్రాయమునే నమ్మి యతడు కాంగ్రెసు అంతరించుటకు సాధ్యమగునంతవర కును ప్రయత్నించి విఫలమనోరథుడాయెను. కర్జను కొరకు పిమ్మట ఎందరో దొరలు ఈయభిప్రాయ మునే నమ్మి తమ శక్తికొలదిని ప్రయత్నించిరి. నేటికిని ఈయభిప్రాయము చాలమంది మనస్సులలో నుండ వచ్చును. కాని ౩౫ సంవత్సరములకు పైగా కర్జనుదొర ఈ యభిప్రాయమును వ్యక్తపరచినను కాంగ్రెసు తొట్రువడి పతనముచెందుటకు బదులు నానాటికిని వృద్ధినొంది మొన్న మొన్ననే ౫౦ సంవత్సరములవయస్సు గడచినందువలన ఒకమహోత్సవమును చేసికొనినదన్నచో ఇందలి విశేషము వ్యక్తమగును. ఈ ౫౦ ఏండ్లకాలము నందును హిందూదేశమునందేమి, ఇతరదేశములందేమి ఎన్నియో సంస్థలు బయలుదేరినవి. కాని వానిలో ఒక్క టైనను కాంగ్రెసునకు సాటిరాకుండుటకు కారణ మేమి ? కాంగ్రెసునందున్న విశేషములేమి ? ఏకారణముచేత కాంగ్రెసు హిందూదేశమునందలి ౩౫ కోట్ల జనులకే కాక ప్రపంచమునందంతటను గౌరవనీయ మైనది ? ఏల కోట్లకొలది జనులు కాంగ్రెసునందు భక్తి ప్రేమలచే మెలగుచు తమ జీవితసర్వస్వమును ధార వోయుటకై సంసిద్ధులై యున్నారు ? ఇట్టిప్రశ్న లెన్నియో జనసామాన్యమున కుండుట యాశ్చర్యము గాదు. కాంగ్రెసుకార్యములలో పాల్గొని కష్టముల కోర్చిన వేలకొలది జనులకుగూడ ఈ ప్రశ్నలకు సరి యైన సమాధానముగాని, కాంగ్రెసు మహాత్వమునకు సరియైన కారణములుగాని తెలియవు. విదేశీయులు కొందరు పుస్తకములయందును, వార్తాపత్రికలయందును తమతమ యభిప్రాయములనుబట్టి కాంగ్రెసుప్రాముఖ్య మునకు కారణము లొసగిరి. కాని సమగ్రముగను, సమ దృష్టితోను కాంగ్రెసుతత్వమును విశదీకరించి, కాంగ్రెసు జీవితపరిణామమును విప్పిచెప్పుటకు ఇదియే ప్రథమప్రయ త్నము. ప్రథమప్రయత్నమయ్యును ఈగ్రంథరాజమునందు దోషము లెన్నియో గాన్పింపక నిష్పక్షపాతముగను, హృదయరంజకముగను ఉన్నదన్న, ఈపుస్తకమును రచిం చిన శ్రీయుత. డాక్టరు పట్టాభిసీతారామయ్యాగారి సామ ర్థ్యమును గూర్చియు, అట్టి ఆవశ్యక సత్కార్యమునకు వారిని నియోగించి పుస్తకమును ప్రచురించిన అఖిల భారత - కాంగ్రెసు - కార్యనిర్వాహక సభయొక్క సదుద్యమమును గూర్చియు వేరుగ జెప్పనక్కరయేలేదు.

ఆధునికచరిత్రకారుని కష్టములు మెండు. నిన్న మొన్న జరిగిన విషయములనుగూర్చి సర్వసమ్మతముగ (ముఖ్యముగ ప్రభుత్వమువారికి సమ్మతముగ) వ్రాయుట కష్టతరము. అందుచేను చారిత్రకవిషయముల నన్నిటిని పేర్కొనక కాంగ్రెసు చరిత్రమును మాత్రమే ప్రత్యేక ముగ వ్రాయబూనుకొని స్వమతభూషణ, పరమత దూషణములకు ఎంతమాత్రమును పాలుగాకుండ ఈకష్ట తమమగు కార్యమును డాక్టరుగారు నెరవేర్పగలిగిరి.

ఈ పుస్తకమున ౬ భాగములు గలవు. మొదటి ౩౦ సంవత్సరముల చరిత్రమును మొదటి భాగమునందు వివిధవిషయశీర్షికలక్రింద వర్ణించియున్నారు. ఈ భాగపు చరిత్రమునుగూర్చి ఇదివరకే బెసెంటు దొర సానియు, మజుందారుగారును, బానర్జిగారును, ఇతరు లును వ్రాసియుండుటచేత సీతారామయ్యాగారు స్వల్ప ముగ వ్రాసియున్నారు. హోమురూలుయుగ, స్వరాజ్య యుగ చరిత్రమును రెండవ మూడవ భాగములందు విశదీకరించియున్నారు. క్రీ. శ. ౧౯౨౯ వ సంవత్సరము నుండి నేటివరకును పూర్ణస్వరాజ్యయుగమే అని అచ

వచ్చును. ఇందు మొదటి రెండుసంవత్సరములవిషయము లను నాలుగవభాగమునందును, గాంధి ఇర్విను సంధి, సంధిభంగమును గూర్చి ఐదవభాగమునందును, అప్పటి నుండియు నేటివరకు సంభవించిన కార్యములను, నేటిపరిస్థితులను ఆరవ భాగమునందును చక్కగ విమర్శించి యున్నారు. ప్రతి భాగమును వివిధభాగములుగ విభజింపబడియున్నది. పుస్తకాంతమునందున్న విశేష పదసూచియు ప్రతిభాగపు ఆరంభమునందును ఆ భాగమునందున్న అధ్యాయములందలి విషయవిభాగములను దెలుపు శీర్షికలును చదువరి కెంతయో సౌకర్యమును గలిగించుచున్నవి. గ్రంథమును తొందరగ వ్రాయుటచేత రచనాపద్ధతియందు దోషము లుండవచ్చునని గ్రంథకర్త గారు తమ తొలిపలుకున జెప్పుకొనినను అట్టిదోషము లంతగా గానరావు.

కాంగ్రెసు చరిత్రయందే దృష్టిని కేంద్రీకరించి యుండుటచేత నితరవిషయము లెన్నియో ముఖ్యమైనవికూడ వదలివేయవలసివచ్చినది. ప్రత్యేకముగ కాంగ్రెసునకు సంబంధించిన విషయములనుగూడ గ్రంథ విస్తరభీతిచే సంగ్రహపరుపవలసివచ్చినది. కాంగ్రెసు తీర్మానములనుకూడ అన్నిటిని ఇవ్వ సాధ్యముగాలేదు. కాని ఇందువలన గ్రంథప్రాముఖ్యమున కేమాత్రమును నష్టము కలుగకుండునట్లు ముఖ్యాధారములను అచ్చటచ్చట పొందుపరచియున్నారు. ఇదియే ఆధునిక చరిత్రకారుని ముఖ్యకర్తవ్యము. ఇందువలన విషయము సరిగ బోధపడుటయేగాక చరిత్రకారుని ప్రత్యేకాభిప్రాయములు సాధ్యమైనంతవరకును మరుగుపరచ వచ్చును.

కాంగ్రెసుచరిత్రపైననే సమగ్రముగ దృష్టిని లగ్నము జేసినచో, కాంగ్రెసు జోక్యము కలిగించుకొనిన ప్రతివిషయమును ప్రత్యేకముగ చర్చించుటకు ఏమాత్రమును వీలుండదు. ముఖ్యమైన విషయములను గూడ అట్లు చర్చించక వదలివైచినచో ఆవిషయముల ప్రాముఖ్యము తెలియకపోవుటయేకాక ఆవిషయమును గూర్చి కాంగ్రెసు ఒనరించిన కార్యక్రమముయొక్క ఆధిక్యముగూడ తెలియకపోవును. అట్టిచోట్ల మాత్రము గ్రంథకర్త తన కేంద్రీకృత దృష్టిని విషయాంతరముల పైకి మరలించిరి. ఎక్సైజు, న్యాయాధికార్యనిర్వాహకాధికార్యముల విభజన, జాతీయ రక్షణ సమస్య, దక్షిణఆఫ్రికాయందలి హిందూదేశీయుల స్థితిగతులు మొదలగు విషయముల నెన్నిటినో డాక్టరుగారు తెలియజేసిరి. ఈవిశదీకరణము అన్నిచోట్లను అత్యంత హ్రస్వముగ నున్నను, దురవగాహములనదగు సమస్యలు గూడ ఎట్టిపామరునికైనను సులభముగ బోధపడునట్లుండుటచేత ఇట్టి సందర్భములింకను అధికముగ చేర్చిన బాగుండునని చదువరి చింతించును. జనబాహుళ్యమునకు తెలియని ఎన్ని విచిత్రవిషయము లిందుగలవో లెక్కపెట్ట సాధ్యముగాదు. దక్షిణ ఆఫ్రికాయందలి హిందూదేశీయులు ఆదేశమునకు గొప్ప ఉపకారము జేసిరని చర్చిలుదొర ఒకప్పుడు ప్రశంసించెనని మనలో ఎందరికి తెలియును? క్రీ. శ. ౧౯౨౧ వ సంవత్సరమున ఇండియన్ పీనల్ కోడునందలి ౧౨౧, ౧౨౪ సెక్షనుల క్రింద ఎందరినో ఖైదుచేసిరి. మాననీయులగు చిత్తరంజన దాసుగారిని, వారి భార్యాపుత్రులను, లాలాలజపతి రాయిగారిని, మోతీలాల్ నెహ్రూగారిని, జవహరలాల్ నెహ్రూగారిని ఖైదుచేసిరి. వీరందరి శిక్షలకు ఆధారమైన ౧౨౧, ౧౨౪ సెక్షనులను కనుగొని వానిని మూలనుండి ముంగిటికి తీసికొనివచ్చినది సప్రూగారేనట. మెసెంటుకొరసాని కొలతుచట్టము నామోదించుటయే కాక, మాంటేగుగారు దాన్నెంత నిర్లక్ష్యముగ జూచినను వారికి తానుమాత్రము సాధ్యమైనంతవరకును సహాయము జేయ యత్నించెనని నేటియువకులలో నెందరికి తెలియును? మాప్లాఖైదీలను బళ్లారికి పంపించుసందర్భమున ౧౦౦ మందిని ఒక గూడ్సుపెట్టెలో వేసినందువలన సుమారు ౭౦ మంది ఊపిరిఆడక చనిపోయిరని కూడ ప్రతివానికిని తెలియునా? సింహాగారు ఇండియా కార్యదర్శిగా నియమింపబడినయెడల తాను సహాయ కార్యదర్శిగనుండి పనిచేయుటకు మాంటేగుగారు సిద్ధముగనుండిరనికూడ ఇందుండి తెలియుచున్నది. అట్లయినచో హిందూదేశమును శాసించుటకేకాక హిందూదేశమునకు సహాయముచేయుటకుకూడ తాను సంసిద్ధుడై, అహంకారరహితుడైయుండి ఇండియన్ సివిల్ సర్వీసు వారికి మార్గోపదేశి యగుటకు అది మంచి తరుణమని

మాంటేగుగారు తలచిరట. చెమ్సుఫర్డ్ గారికి వైస్రాయి పదవి నొసగునపుడు వారు హిందూదేశమునందలి నేనంతో మేజర్ పదవియందు గుంకిరనియు, అతనిపేరను, మాంటేగుగారిపేరను క్రీ.శ. ౧౯౧౯-౨౦ వ సంవత్సరము న ఒసగిన ప్రభుత్వ విధానమందు యు క్రీ.శ. ౧౯౧౭వ వత్సరము మార్చినెలకు పూర్వమే నిర్ణయించేయ బడి యుండెననియు తెలియుచున్నది.

ప్రభుత్వమున కసమ్మతములగు విషయములను ఈ పుస్తకమునందు నన్నిటిని జెప్పినను, చెప్పినవిధానము నందుమాత్రము ఏలాటి మాత్సర్యమునులేక డాక్టరుగారు మిక్కిలి మెలకువతో ప్రవర్తించిరి. తాము కాంగ్రెసు వాదియైనను కాంగ్రెసునకు అనుకూలములైన విషయముల నన్నిటిని వినినంతటనే నమ్మి గ్రంథస్థము జేయుటమాని సకారణముగ • నిరూపింప సాధ్యమగు నంశములను మాత్రమే చెప్పియున్నారు. ప్రభుత్వేతర కాంగ్రెసు ప్రతిస్పర్థులనుగూర్చి వ్రాయునపుడును, కడకు కాంగ్రెసుద్రోహులని ఎన్నదగువారినిగూర్చి వ్రాయునపుడును గూడ డాక్టరుగారు నిష్పక్షపాతముగ విమర్శనాబుద్ధితో విషయములను విశదీకరించుట యేకాక విషయవర్ణనమునందు గూడ ఏమాత్రమును హేయభావము గనుపట్టకుండునట్లు సామర్థ్యముతో మెలగిరి. కొన్ని కొన్ని విషయములను వ్రాయునపుడు ఎట్టివానికిని మనశ్చలనము కలుగకుండుట సాధ్యము గాదు. కాని డాక్టరుగారి మనస్సు మాత్రము చారిత్రక దృష్టినుండి ఇంచుకంతయు చలించలేదు. తిలకు, గోఖలేగార్లను సమదృష్టితో జూచి, ఒకరిని ఎక్కువ జేసి ఇంకొకరిని తక్కువజేయకుండుటకు ఏమహారాష్ట్రు నికి సాధ్యమగును? మహారాష్ట్రునికేల, ఏహిందూదేశీ యునికి సాధ్యమగును? మహారాష్ట్రులు ప్రభుత్వో ద్యోగములను స్వీకరింప సంసిద్ధులగుటకును, చింతామణిగారు మంత్రిపదవిని గైకొనుటకును ఆస్పదమొసగునట్లు మోతీ లాల్ నెహ్రూగారు ప్రవర్తించి స్కీనుకమిటీ సభ్యు లగుటయు, సుప్రసిద్ధులగు కేల్కారు శ్రీనివాసయ్యం గార్లతో నెహ్రూ కలహించుటయు లోనగు విషయ ములను వ్రాయునపుడు సమదృష్టిజూప డాక్టరు గారికితప్ప మరెవ్వరికి సాధ్యమగును? చిత్తరంజన దాసుగారు మదరాసు సముద్రతీరమునందే గాంధిగారిని, వారిమార్గమును ఖండించుటలో ఇంచుకంతయు సర సము పాటింపకున్నను వారిని గూర్చి వ్రాయునప్పుడు మాత్రము డాక్టరుగారు అతిశాంతముగ ప్రవర్తించుట విశేషము. బి. యన్. శర్మగారి విచిత్రప్రవర్తనమును గూర్చియు, మాలవ్యాగారు వలసకూలీలను (Indentured) చేర్చువిషయమై అధినివేశ కార్యస్థానము (Colonial Office) వారితో రహస్యముగా నొనరించుకొనిన ఒడంబడికను గూర్చియు, బెసెంటుదొరసాని ఆవ ఉద్రేకమునందు జేసిన పిచ్చిపిచ్చిపనులను గూర్చియు, కడకు జనరల్ డైయర్ గారిని గూర్చియుగూడ డాక్టరు గారు నిష్పక్షపాతముగ ఉన్నవిషయము నున్నట్లుగ జెప్పి, ఇందున తమయభిప్రాయమెట్టిదోకూడ చదువరు లకు తెలుపరైరి. డాక్టరుగారు చెప్పినదానికన్న తీవ్ర ముగ డైయరునుగూర్చి ఇదివరలో పాశ్చాత్యులు వ్రాసిన పుస్తకములందే యున్నది. ఎట్టి చర్చనీయాంశమునందును గూడ డాక్టరుగారు ప్రతిపక్షులవాదమును స్ఫుటముగ వక్కాణింపలేదని చెప్పసాధ్యముగాదు. ఇతరుల యభి ప్రాయములనుగూర్చి వ్రాయునపుడు తమ ఇష్టానిష్ట ములవలన అట్టి అభిప్రాయవిశదీకరణమున కెక్కడ దోషము వాటిల్లునోయని సాధ్యమైనంతవరకు వారివారి మాటలనట్లే ఈపుస్తకమునందు పొందుపరచిరి.

ఈ నిష్పక్షపాతదృష్టిమాత్రమేకాక, మనో రంజకముగ వ్రాతయుగూడ ఈపుస్తకము సర్వజనా మోదకరమగుటకు కారణమగును. చెప్పువిషయ మెంత ముఖ్యమైనదైనను చెప్పువిధానము హృదయరంజకముగ లేకున్నచో ఎట్టివానికిని ౧౦౦౦ పేజీల గ్రంథమును చదువ నోపికయుండదు. కాని సులభమై, ఆకర్షకమగు శైలిచేతనేమి, పదలాలిత్యముచేతనేమి, విషయసమీ కరణముచేతనేమి ఈ పుస్తకము చదువ ప్రారంభించిన పిదప ముగియువరకు వదలివేయ బుద్ధిగలుగదు. నానా దేశీయుల పేరులు చదువుటకుం బ్రదుగు ఈ పుస్తక వింత ఆకర్షకముగ నుండుట మిక్కిలి ఉపయోగము గంభీరమగు హాస్యరసముచే నొప్పుచు ఈపుస్తక మించు

కేనియు విసుగించదు. ఉదాహరణము లెన్నియో కలవు. క్రీ. శ. ౧౯౨౫ వ సంవత్సరమునందు స్వరాజ్యవాదులతో కలహించి కేల్కారు, మూంజీ, జయకరు గార్లు శాసననిర్మాణసభాసభ్యత్వమునకు రాజీనామా యొసగిరని చెప్పి, ఈకార్యముచే వారు స్వరాజ్య దోషసంపర్కము తమదేహమునకును, జీవమునకును, సుహృత్తులకును ఏమాత్రమును అంటుకొనకుండునట్లు disinfect చేసికొనిరని చెప్పియున్నారు. క్రీ.శ. ౧౯౨౬ నందు బెంగాలునందు క ప్రత్యేక పార్టీలుండెనట. వానిని హిందూ స్వరాజ్యవాదులనియు, స్వరాజ్యహైందవులనియు, తురుష్క స్వరాజ్యవాదులనియు, స్వరాజ్య తురుష్కులనియు డాక్టరుగారు నామకరణము చేసియున్నారు. ఈపార్టీల కొకదాని కొకటి కున్న భేదమంతయు వాని నామధేయము లందలి రెండుపదముల స్థానమునుబట్టి వికసనుచున్నది. క్రీ. శ. ౧౯౨౭ వ సంవత్సరము నవంబరు నెలలో ఇర్విన్ గారీ దేశమునందలి ప్రముఖులందరును తమనగరునకు రావలయునని కోరిరి. మహాత్ము డప్పుడు మంగళూరు నుండి సుమారు వేయిమైళ్ళదూరము తనపనినంతను వదలి ఢిల్లీకి ప్రయాణించగా, సైమను కమీషనునుగూర్చి ఇండియా కార్యదర్శిపంపిన వర్తమానమును ఇర్విన్ మహాత్మునిచేత బెట్టెను. ఒక అణాకవరుతో ముగియు పనికై మహాత్ము డింతదూరము రావలసివచ్చెనని డాక్టరుగారు చెప్పియున్నారు. సైమనుదొర మొదటితూరి ఇండియానంతను జుట్టి ఇంగ్లాండునకు వెళ్ళినప్పుడు ఇండియాలో ఏమిజేసితివన్న ప్రశ్నకు సమాధానముగ ఇండియాయందలి ప్రజలలో అన్నితరగతుల వారిని స్వయముగ కలిసికొంటినని చెప్పియు, మరల తానే తన నివేదికయందు అసెంబ్లీయందలి ముఖ్యులే తన్ను చూచుటకుగూడ ఇచ్ఛగించరైరని చెప్పియున్నాడు. దీనిని Terminological enexactitude అని డాక్టరుగారు బహుసరసముగ జెప్పిరి. క్రీ.శ ౧౯౩౦ వ సంవత్సరమునందు బాంగోలీయందు పన్నులను వసూలుచేయుటకు ప్రభుత్వమువారు పటానుల నుపయోగించిరని చెప్పను, టెన్నిసనుకవి తన Charge of the Heavy Brigade అను పద్యమునందు చెప్పిన దానికి అనువుగ ఒక పద్యము వ్రాసియున్నారు. కలకత్తా కాంగ్రెసునకు పూర్వము అఖిలపక్షమహాసభ (All Parties Convention) ఉన్న స్థితిని గూర్చి వర్ణించుచు, ఆసంస్థ వ్యాధిగ్రస్తయై చావనుండెననియు, త్వరలో చావక జీవితకాలమధికమైనకొలదిని, దానికి బీదబంధువుల పీడ ఎక్కువ ఆయెననియు అతిహాస్యకరముగ జెప్పియున్నారు.

హాస్యరసమేగాక ఎట్టి సందర్భములలో ఎట్టి భాషాధోరణి నుపయోగించినారో చెప్పనావశ్యకమే లేదు. రచనచే మెప్పించిన సందర్భము లెన్నియో గలవు. క్రీ. శ. ౧౯౧౫ వ సంవత్సరమునందు కాంగ్రెసు ఉన్న స్థితిగతులను వర్ణించుటయందేమి, ఉపసంహారమునందు కాంగ్రెసు ఓడిపోయినదా యను ప్రశ్నకు సమాధానము నొసగునప్పుడేమి, సత్యాగ్రహముయొక్క శక్తిసామర్థ్యములను వర్ణించుటయందేమి డాక్టరుగారి రచన నిరుపమానము. భావగర్భితములగు చతురోక్తులను నిర్మించుటలో డాక్టరుగారి శక్తి అత్యధికము. రాజేంద్రప్రసాదుగారును, జవహరలాలుగారును సహా స్థానిక ప్రభుత్వములను పరీక్షించి యవి నిష్ఫలములని చెప్పియున్నారని వక్కాణించియు "కాని భాషయందలి యక్షరములవలెనే జీవితమునందలి అక్షరసమామ్నాయముగూడ ప్రతివాడును స్వయంకృషిచే నేర్చుకొనవలసినదే" అని చెప్పియున్నారు. మరొకసందర్భమున ప్రభుత్వమును గూర్చి వ్రాయుచు The wheels of Government grind slow, but grind steady, అని చెప్పియున్నారు. ఇట్టి సందర్భములను వర్ణించునపుడు వారి పద జాలమునకు సరియగు భావమిచ్చు భాషాంతరీకరణమే సాధ్యముగాని పని. ఈ పుస్తకమునందు లోపము లెన్నియో లేవని ఇదివరకే చెప్పియున్నాను. లోపము లనబడునవిగూడ అభిప్రాయభేదములేయని అనవచ్చును. కావునే ఇట్టి యభిప్రాయభేదములు ప్రతివానికిని వేర్వేరుగనుండును. జాతీయోద్యమమున ఆంధ్రులొనరించిన ధైర్య సాహసములకు తగినంత ప్రాముఖ్యమివ్వలేదని ఆంధ్రులలో కొందరు

తలచవచ్చును. ఇట్లే అరవలును, ఇతర రాష్ట్రీయులును గూడ తలప సాధ్యముండవచ్చును. ఆంధ్రులను పట్టాభి సీతారామయ్యగారు ఆంధ్ర తమిళ రాష్ట్రము లొనరించిన కార్యములను తగినట్లు ప్రశంసించుట లేదనుకొనుటకన్న పిచ్చియూహ ఉండజాలదు. తమ సంపూర్ణ వినయముచేతనే తమ దేశభాగములందలి చర్యలను తగినట్లు ప్రశంసించక వదలివైచిరని చెప్పను గూడ సాధ్యముగాదు. ఈ మహోద్యమమునందు ఆంధ్ర తమిళ రాష్ట్రములు ఎంతమట్టుకు పాల్గొన్నవో భవిష్యత్కాలమునందు చరిత్రకారులు నిష్పక్షపాతముగ విశదీకరించినపుడు డాక్టరుగారి యభిప్రాయముతో నేకీభవింతురని తోచుచున్నది.

చాలవిషయములను డాక్టరుగారు తమ యభిప్రాయమును వెలిబుచ్చక విషయకథనముతో మాత్రమే తృప్తి బొందిరి. పామరజనమున కిది అంతగా రుచించక పోవచ్చును గాని ఇందున డాక్టరుగారు చరిత్రకారుని ధర్మమును ఏమాత్రమును అతిక్రమించలేదు. కొన్ని కొన్ని ప్రశ్నలకు సమాధానము ఈపుస్తకమునందు విశదముగ గానరాదు. గాంధి ఇర్విను సంధియనంతరము గూడ ప్రభుత్వమువారు సంధిషరతులకు వ్యతిరేకముగ ప్రవర్తించుచుండిరని మహాత్ముడు కోపించి ఇంగ్లాండునకు పోగూడదని నిర్ధరించెను. అట్లు నిర్ధరించియు గూడ మరల త్వరలో తన యభిప్రాయమును మార్చి ఇంగ్లాండునకు పయనమగుటకు ఏమికారణము లుండెనో తెలియరాదు. ఇందుల కనేక కారణము లుండవచ్చును. వానిలో కొన్ని రహస్యవిషయములు గూడ నుండవచ్చును. డాక్టరుగారు కాంగ్రెసుప్రముఖులలో నొక్కరు. వారికి తెలియనివిషయము లుండజాలవు. కాని తెలిసినవాని నన్నిటిని విచక్షణలేక బహిరంగము జేయుట కానిపని. ఇందువలననే గాబోలు మరికొన్ని విషయములందుగూడ డాక్టరుగారు కొంత కొంత భాగమును విశదము సేయరైరి. అంతస్సాంఘిక సమస్యలను నిర్ధరించువరకును ఇంగ్లాండునకు వెళ్లనని యుద్దేశ్యపడి చు మహాత్ముడు, ఉద్దేశ్యమును మార్చుకొనుటకు ఏమి కారణము కలిగెను? లాహోరుకాంగ్రెసునకు మహాత్ముడే అధ్యక్షుడుగ నుండవలెనని దేశమునందు చాలభాగము కోరినను మహాత్ముడేల ప్రతినపట్టి జవహరలాలునకే ఆపదవి నొసగెను? స్వరాజ్యవాదులను మొదట ఖండించియు ఏల తుదకు వారు కోరిన విషయములన్నిటియందును మహాత్ముడేకీభవించెను? ఇట్టి ప్రశ్నలలో కొన్నిటికి సంపూర్ణ సమాధానము ఈ పుస్తకమునందు ఇవ్వలేదని చాలమంది తలచవచ్చును. వీనిలో కొన్నిటిని చర్చించకుండుటకునైన మహత్కారణము లుండవచ్చును. కేవలము కాంగ్రెసునకు సంబంధించని విషయములుగూడ కొన్నియైన ఇందుండిన బాగుండునని కొందరకు తోచవచ్చును. ఉదాహరణార్థము మహాత్ముని ఇంగ్లాండుయానమును గైకొందము. కాంగ్రెసు ప్రతినిధిగ మహాత్ముడొక్కడే ఇంగ్లాండున కేగెను. అట్టిచో అత డొనరించిన ప్రతికార్యమును, అతడు చెప్పిన ప్రతిమాటయును కాంగ్రెసునకు ముఖ్యమే. కాన మహాత్ముడు లాంకషైరునందును, లండనునందును చెప్పిన విషయములనుగూర్చియు ఇంగ్లాండునందలి అతని చర్యల నన్నిటినిగూర్చియు ఇంకను కొంత తెలిపియుండిన బాగుండునని తోపకమానదు.

పైనుడివిన యంశములేవియును డాక్టరుగారికి తెలియనివిగావు. కాని ఏదో ముఖ్యకారణ ముండియే డాక్టరుగారు ఇట్టిసంగతుల ననేకములను వదలివైచిరని తలపవచ్చును. పుస్తకము నచ్చొత్తించుటయందును ప్రూపులను దిద్దుటయందును చాలశ్రద్ధవహించియుండుట విశదము. తప్పొప్పుల పట్టికయందున్నవానికన్న అధికముగ అచ్చుతప్పులు గ్రంథమునందున్నను, ౧౦౦౦ పేజీలకుమించి ఆతురముగా నచ్చొత్తించిన పుస్తకమునందు ఆమాత్రమే అచ్చుతప్పులుండుట ఆశ్చర్యమే. ఖద్దరుసద్దితో చక్కగా బైండుచేయబడిన ఈమహాగ్రంథము వెల రు ౨-౮-౦ మాత్రమే. కాంగ్రెసువాదియే కాకపోయినను ఆధునిక హిందూదేశచరిత్రయందు ఇసుమంతేనియు శ్రద్ధయున్న ప్రతివాడును ఈపుస్తకమును పఠించి విషయమును ఆమూలాగ్రముగ తెలిసికొనవలసినదే.

ఇట్టి మహాకార్యము నొనర్చుటకు డాక్టరు పట్టాభి సీతారామయ్యగారికి అవకాశము నొసగినందులకును,

అట్టిఘనకార్యమును అంతసామర్థ్యముతో వారు నియమిత కాలముననే నెరవేర్చినందునకును ప్రతి తెలుగువాడును గర్వించవలసినదే. కాని అట్టిగర్వముతో మాత్రమే తృప్తి నొందక ఈపుస్తకమును పఠించి అందలి విషయములను జీర్ణించుకొని నిదర్శితాదర్శములను దృష్టిబద్ధములుగ జేసికొనుటయే మనము డాక్టరుగారికి ఒసగగల సరియైన అభినందనము. డాక్టరుగారి నిరుపమాన గ్రంథరాజము వలన చారిత్రకయుగమున నేటికి తెలుగువారికి ఒక గౌరవస్థానము కలిగినది. ఆస్థానమునకు తగినట్లు ప్రతి తెలుగువాడును వ్యవహరించి నిష్పక్షపాతముగ చరిత్రను పరిశోధించుటయందును, విశదీకరించుటయందును తెలుగువారికి ఎవ్వరును సరిరారని అనిపించుకొన్న నాడే డాక్టరుగారి యుద్యమమునకు సరియైన ప్రతిఫలము కలుగును.

డా. పుట్టపర్తి శ్రీనివాసాచార్యులు

(తెలుగు)

డా. భోగరాజు పట్టాభిసీతారామయ్యగారి యింగ్లీషు గ్రంథమున కిది తెలుగుఅనువాదము. ఇదియును ఇంచుమించుగా వేయిపుటలదాక పెరిగినది. మూలగ్రంథము నందువలెనే ఇందును కాంగ్రెసుఅధ్యక్షుల చిత్రములు, ఇతరుల చిత్రములు గలవు.

గ్రంథప్రశస్తినిగూర్చి మీద మూలగ్రంథమును విమర్శించినవారు చెప్పదగినదంతయు చక్కగా చెప్పినారు. ఆవిషయమున వారి యభిప్రాయముతో నేకీభవించుటకు కెవ్వరికిని విప్రతిపత్తియుండబనిలేదు. ఇట చెప్పవలసినది అనువాదవైఖరిని గూర్చి మాత్రమే.

గ్రంథకర్త ఇంగ్లీషున రచించినట్లే తెనుగునను స్వయముగ రచించియుండిన గ్రంథమున కెంతయో కమ్మదనము గలిగియుండెడిది. అట్లుకాలేదు. కారణమేదయిననేమి, అట్లుకాకపోవుట పెద్దలోపమే. ఆలోపమిందు కనుపడ పోలేదు. ఎంతకొమ్ములు తిరిగినవారిదయినను అనువాదము అనువాదమే. మూలభాషా సంప్రదాయములు దానిని వదలకపోవు.

ఈ గ్రంథముఅనువాదము ఒకొక్కయెడ పదమునకు పదముగను, ఒకొక్కయెడ భావమును బట్టియు, ఒకొక్కచోట స్వేచ్ఛగను నడచినది.

ఆంగ్లవాసనకొట్టుచున్నను, చదును చాలకున్నను సామాన్యపాఠకలోకమునకు అర్థస్ఫూర్తి కంతగా అడ్డుతగులని ధోరణితో రచనము సాగినది. ఇందులకు అనువాదకులును మూలగ్రంథకర్తతోపాటు అభినందనార్హులగుచున్నారు. దీనివెలకూడ రు. ౨-౮-౦.

ఆంధ్రపత్రికాకార్యాలయము, తపాలా పెట్టె నెం. ౨౧౨ మదరాసు.

Printed and Published by K. Nageswara Rao,
at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty St., Madras. Editor. G. Subbaramayya.

